శంఖు మార్కు

REGD. TRADE MARK

లుంగీలు
చేతిగుడ్డలు

ధోవతులు-చీరలు
స్లాక్ అండ్ చోళీ గుడ్డలు

చేనేత
రంగానికే ప్రత్యేకత

మేలైన తయారీ

ఆకర్షణీయమైన
రంగులలో

సరికొత్త
రకాలు

దీర్ఘకాల
మన్నిక

బ్రాంచీలు:
45/16, లోయర్ చిట్‌పూర్ రోడ్ &
5. ఆర్మీనియా వీధి, కలకత్తా-700001.
175, కీళవెళి వీధి, మధురై-625001.
మెయిన్ రోడ్, క్విలాన్-691001.

శంఖు
మార్కు
సాటిలేని
మేటిది

తయారుచేయువారు & విక్రయందారులు:

**మొహమ్మదు అబూబకర్ & కంపెనీ**
95. తంబుచెట్టి వీధి, మదరాసు-600001.







ముఖచిత్రం : బందీగా అగ్ని కోపాగ్ని

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ. 36-00
దీపావళి సంచికతో రూ. 42-00
యువ, హైదరాబాదు-500001.

జయప్రద మూవీస్

# నాకూ స్వతంత్రం వచ్చింది

ఈస్ట్‌మన్ కలర్



# యువ ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | అరుణోదయం | (నవల) | కొ. కుటుంబరావు | 2-00 |
| 2. | మారుపేర్లు | ,, | ,, | 2-00 |
| 3. | కులంలేని మనిషి | ,, | ,, | 2-00 |
| 4. | గడ్డు రోజులు | ,, | ,, | 2-50 |
| 5. | నీకేం కావాలి | ,, | ,, | 2-00 |
| 6. | నిలవ నీరు | (కథలు) | ,, | 2-00 |
| 7. | కాలభైరవుడు | ,, | ,, | 2-00 |
| 8. | వరప్రసాదం | ,, | ,, | 2-00 |
| 9. | మొండివాడు | ,, | ,, | 2-00 |
| 10. | శిథిలాలయం | (నవల) | గోపీచంద్ | 2-50 |
| 11 | అర్థమున్న కథలు | (కథలు) | అవసరాల రామకృష్ణరావు | 2-50 |
| 12. | కరుణ | (నవల) | రవీంద్రనాథ్ ఠాకూర్ | 2-00 |
| 13. | వీరఛత్రసాల్ | (సంక్షిప్త నవల) | | 2-50 |
| 14. | మాధవీ కంకణం | ,, | | 2-50 |
| 15. | రాజసింహ | ,, | | 2-50 |

| | | | |
|---|---|---|---|
| 16. | కుంకుమభరిణ (సంక్షిప్త నవల) | | 2-50 |
| 17. | ఆనంద మఠం | ,, | 2-50 |
| 18. | కపాల కుండల | ,, | 2-50 |
| 19. | గోరా | ,, | 3-00 |
| 20. | మాయావి | ,, | 3-00 |
| 21. | సీతారామ్ | ,, | 2-50 |

పది కాపీలకు తక్కువ కాకుండా సొమ్ము ముందుగా పంపినవారికి ఖర్చులు మేమే భరించి పుస్తకాలు పంపుతాము. యువ ఏజంట్లకు 30% కమీషన్ ఇవ్వబడుతుంది. కావలసిన కాపీలకు కమీషన్ మినహాయించుకుని డబ్బు ముందుగా పంపవలసినదిగా ఏజంట్లను కోరుతున్నాము.

యువ పబ్లికేషన్స్,
హైదరాబాద్ - 500 001.

# *Free!* ఉన్నపాటునే రండి ఉచితం !!

పాపములో పడిపోయిన పాపి, ప్రభుపాదముల యొద్దకు వచ్చుటకు కొంత సిద్ధపాటు కావలెనని అందరూ తలంచుదురు. తీర్థయాత్రలు, పుణ్యనదులలో స్నానాదులు, నోములు, వ్రతాలు, ఉపవాసాలు, దానధర్మాలు ఎంతవరకు మానవుల పాపములను పరిహరింప గలవు? నిజం చెప్పాలంటే దైవసన్నిధికి వచ్చుటకు ఇటువంటి సిద్ధపాటు లేవీ అవసరంలేదు. ఆయనకు కావలసినదంతా మనము అంతవరకూ చేసిన పాపములకు పశ్చాత్తాపపడుటయె. వ్యాధిగ్రస్థుడు వైద్యుని అవసరం గుర్తించినట్లు, పాపవ్యాధిగ్రస్తుడుకూడ తన అవసరం గుర్తించి ప్రభుపాదములను పట్టినప్పుడు ఆ ప్రభువు వాడి అపరాధములను క్షమించి, వాడి పాపములను పరిహరించి వాడిని పరిశుద్ధునిగా మార్చగలడు.

దేవుడు మానవుల పాపములను దైవకుమారుడైన క్రీస్తునందే క్షమించ గలడు. మానవులంతా గొర్రెలవలె త్రోవతప్పి, ప్రతివాడూ తన కిష్టమైన, త్రోవకు తొలగియుండగా, దేవుడు మానవులందరి దోషములను క్రీస్తునందు క్షమించినాడు. నాకు విధింపబడిన శిక్షను మరొకరు భరించినట్లు, నేను చేసిన అప్పులను మరొకరు తీర్చినట్లు యేసు నా పాపములకోసం, ప్రాయశ్చిత్తముగా తనప్రాణం శిలువమ్రానుమీద సమర్పించాడు. తమ పాపపు దుస్థితిని గుర్తించి, పశ్చాత్తాపముతో, విశ్వాసముతో తనయొద్దకు వచ్చే ప్రతి పాపిని, ఆ ప్రభు కృపతో క్షమించి, వారిని పవిత్రులనుగా చేయును. మీరెటువంటి ఘోర పాపులైననుసరె, ఉన్నపాటునె ప్రభుయొద్దకు రండి. తనయొద్దకు వచ్చేవారిని ఆ ప్రభు ఎన్నడూ త్రోసివేయడు. నశించినవారిని వెదకి రక్షించుటకే క్రీస్తు ఈ లోకములో అవతరించాడు.

— చదలవాడ చంద్రమతీదేవి.

# యువ

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు చక్రపాణి

సంపుటి 32 | అక్టోబరు, 1975 | సంచిక 4


ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 3,000 కోట్ల టన్నుల, 37 రకముల ఖనిజములు భూగర్భంలో వున్నాయని భూగర్భ శాస్త్రజ్ఞుల పరిశోధన వల్ల బయటపడింది. ఈ ఖనిజములలో ముఖ్యమైనవి, యాస్బెస్టాస్, బారైట్స్, అభ్రకము, రాగి, సీసము, మాంగనీసు, అని ప్రకటింపబడింది ఇదికాక, ఆదిలాబాద్, కరీంనగర్, ఖమ్మం, నిజామాబాద్, పడమటి గోదావరి జిల్లాలలో విస్తారమైన రాక్షసి బొగ్గుగనులు వున్నాయని కూడా తేలింది అనంతపురం జిల్లాలోని వజ్రకరూర్, లత్తవరం ప్రాంతాలలో వజ్రపురాళ్లు వున్నాయని కూడా భూగర్భ శాస్త్రజ్ఞులు ప్రకటించారు

ఇప్పటివరకు జరిగిన పరిశోధనలనుబట్టి, పైన చెప్పిన ఖనిజముల నిలువ అంచనాలు తేలినప్పటికీ, ఇంకా పరిశోధనలు జరిగితే మన రాష్ట్రంలోని ఖనిజసంపదను గురించిన వివరాలు మనకు ఎక్కువగా తెలియవచ్చును. కొంతమంది శాస్త్రజ్ఞులు కృష్ణా, గోదావరి నదులమధ్యప్రాంతంలో పెట్రోలు కూడా వుంటుందని అభిప్రాయపడుతున్నారు.

ఇకముందు జరుగబోయే పరిశోధనలవల్ల ఏ కొత్త సంగతులు బయట పడినా, యిప్పటివరకు తెలిసినదానినిబట్టి, మన రాష్ట్రం ఖనిజసంపదలో అత్యంత భాగ్యవంతమైనదని స్పష్టపడుతున్నది. ప్రస్తుతానికి తెలిసిన సమాచారాన్ని ఉపయోగించుకొని, ఏ ఏ ఖనిజాలు ఎక్కడ లభిస్తున్నాయో, ఆ యా ప్రాంతాలలో, ఆ ఖనిజాలను ఉపయోగించే పరిశ్రమలను

స్థాపించడానికి సక్రమమైన, సమగ్రమైన కృషి వెంటనే ప్రారంభం కావడం అవసరం. పరిశ్రమల స్థాపనవిషయంలో మన రాష్ట్రం ఎంతో వెనకబడి వుంది. గత పదేళ్లలోనూ కొన్ని పరిశ్రమలు స్థాపింపబడినప్పటికీ, మన రాష్ట్రంలోని సహజ సంపదను పూర్తిగా వినియోగించుకునేటట్టుగా పరిశ్రమలు ఏర్పడలేదు పరిశ్రమలు బాగా ఎక్కువ అయితేనేగాని మన రాష్ట్రం సర్వసంపన్నమైన రాష్ట్రంగా రాణించజాలదు మూడు పెద్ద నదులు మన రాష్ట్రానికి జీవనాధారాలుగా వున్నాయి ఆ నదీజలాలను పూర్తిగా వినియోగించుకొని, పంటలు బాగా పండించి, ఆహార ధాన్యాల ఉత్పత్తిని ఎక్కువచెయ్యడానికి మన రాష్ట్రంలో జరుగుతున్న కృషి ప్రశంసనీయమే. ఈ కృషి ఫలితాలను అనుభవించడం ఆరంభమైంది కొద్ది సంవత్సరాలలోనే ఈ కృషి ఫలితాలను మనం సంపూర్ణంగా అనుభవించగలము. మన యిరుగు, పొరుగు రాష్ట్రాలకు ఎక్కువగా ఆహార ధాన్యాలను సప్లయిచేసి, మన దేశపు ఆహార పరిస్థితిని బాగుచెయ్యగలము. అదేవిధంగా, సహజ సంపదగల అన్ని ప్రాంతాలలోనూ పరిశ్రమలను స్థాపించినట్టయితే, పారిశ్రామికంగా కూడా మన రాష్ట్రం ముందుకురావడమేకాక, మనదేశ సౌభాగ్యసంపదలకు దోహదం చెయ్యడమవుతుంది

కొత్త పరిశ్రమలను స్థాపించాలన్నా, పాత పరిశ్రమలను అభివృద్ధి చెయ్యాలన్నా పెట్టుబడి అవసరం. ఈ విషయంలో మనకు లోటు ఏ మాత్రమూ లేదు ఎన్నో పరిశ్రమల స్థాపనకు తోడ్పడగల స్తోమతవున్న వ్యక్తులూ, సంస్థలూ మన రాష్ట్రంలో కొల్లలు. వీరికి ఉత్సాహాన్ని కలిగించి, వీరి కృషికి అంతరాయాలు లేకుండాచేసి, రాష్ట్రంలో అనేక పరిశ్రమలు ఏర్పడేటట్టు చూడవలసిన బాధ్యత ప్రభుత్వానిది. ఈ విషయంలో రాష్ట్ర ప్రభుత్వం అశ్రద్ధ ఎప్పుడూ చూపలేదు; కాని, ఇటీవల నాలుగైదు సంవత్సరాలుగా రాష్ట్రంలోని రాజకీయాలు స్థిరంగా నడవని కారణంచేత, ప్రభుత్వంలో మార్పులు వస్తూవుండడంచేత, ప్రభుత్వ విధానాలు పట్టుదలతో అమలుజరిగే వాతావరణం లేకుండాపోయింది.

ప్రస్తుతం మనం ఎమర్జెన్సీలో వున్నాము. ఎమర్జెన్సీ పరిస్థితులలో ప్రతి కార్యక్రమమూ చురుకుగా జరుగుతుంది ప్రభుత్వమూ, ప్రభుత్వోద్యోగులూ తమ విధులను దీక్షతో నెరవేరుస్తారు. కాబట్టి, యీ ఎమర్జెన్సీ కాలంలో, రాష్ట్రాభివృద్ధి కార్యక్రమాలు చకచకా జరిగిపోతాయని మనం

ఆశించవచ్చును. ఇదే అదనుగా తీసుకొని, పరిశ్రమలను స్థాపించదలచుకున్న వారంతా, తమ ప్రయత్నాలకు తగిన ప్రోత్సాహాన్నీ, సహకారాన్నీ ప్రభుత్వంవద్దనుంచి పొందవచ్చును.

పరిశ్రమలు నిరాటంకంగా నడవాలంటే, విద్యుచ్ఛక్తి చాలా అవసరము. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, పంపకముల విషయంలో మన రాష్ట్రం చాలా వెనకబడివుంది. ఎక్కువగా హైడ్రో ఎలక్ట్రిసిటీమీద ఆధారపడినందుననూ, వర్షాలు సరిగాలేక యీ విద్యుచ్ఛక్తి సరిగా ఉత్పత్తి కానందుననూ, రెండు, మూడేళ్ళుగా మన రాష్ట్రంలోని పరిశ్రమలు నానా అవస్థలూ పడ్డాయి. థర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ఎక్కువగా ఏర్పాట్లను చేసినట్లయితే, యీ అవస్థలు యికముందు రావు. మధ్యప్రదేశ్ రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని అత్యధికంగాచేసి, ఆ రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి లోటులేకుండా చేసిన శ్రీ నార్ల తాతారావు, మన రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు చైర్మను అయారు. వీరి హయాంలో మన రాష్ట్రం, విద్యుచ్ఛక్తి విషయంలో ఏమాత్రం లోటు లేని రాష్ట్రం అవడమేకాక, విద్యుచ్ఛక్తి సప్లయి విషయంలో ఏమైనా లోటుపాట్లువుంటే అవి కూడా సవరింపబడతాయని మనం ఆశించవచ్చును శ్రీ తాతారావు ప్రతిభను గుర్తెరిగినవారంతా, మన రాష్ట్ర అవసరాలకు తగినంతమాత్రమేకాక, అదనంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అయ్యేటట్లు ఆయన కృషిచెయ్యగలరని ఆశిస్తున్నారు.

విద్యుచ్ఛక్తితోపాటు, మన రాష్ట్రప్రభుత్వం శ్రద్ధతీసుకోవలసిన కార్యక్రమాలలో, రోడ్లనిర్మాణం ఒకటి. మన రాష్ట్రంలో వుండవలసినన్ని రోడ్లు లేవు. వున్న రోడ్లుకూడా సరియైన స్థితిలో లేవు. తమిళనాడు, మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలలోని రోడ్లతో పోలిస్తే మన రాష్ట్రంలోని రోడ్లు ఎందుకూ పనికిరానివని చెప్పవచ్చును ఉన్న రోడ్లను బాగు చేయించడమూ, అవసరమైన చోట్ల కొత్త రోడ్లను వేయించడమూ ఒక ఎమర్జెన్సీ పనిగా భావించి, ప్రభుత్వం ఆ కార్యక్రమాన్ని అమలు జరిపించడం అవసరం.

ఆకాశాన్ని అంటిపోయిన అనేక వస్తువుల ధరలు, ఎమర్జెన్సీ పుణ్యమా అని. క్రమంగా తగ్గుతున్నాయి. నిత్యావసర వస్తువుల ధరల జాడను ఒక కంటితో కనిపెట్టి, ధరలు పెరగకుండా చూస్తే లక్షల సంఖ్యలోవున్న మధ్య తరగతి కుటుంబాల కృతజ్ఞతను ప్రభుత్వం పొందగలదు

---

## నవంబరు నెల

# భావపరిచయ పోటీ

### బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

---

## సెప్టెంబరు నెల

### బహుమతి పొందిన వ్యాఖ్య



*బ్రతుకుబాటకాని వాగు బాటయెకాని, దిగకముందు జూడ సొగసుగుండు;*
*నడువ నడువ మిగుల యిడుమలు తథ్యము. ఆదుకోరెవరును ఆపదందు.*

— కె హెచ్. చిదంబరరెడ్డి, హిందూపూర్.



# ఆ రోజులు రావు

## ఇచ్ఛాపురంపు జగన్నాధరావు

**గ**డియారం ఆరు కొట్టింది. వెలుతురు బాగా వచ్చింది బద్ధకంగా రామారావు పరుపుమీద ఒత్తిగిల్లాడు.

తా నెక్కడ ఉన్నాడో జ్ఞప్తి తెచ్చుకుని ఒక్కసారి లేచాడు రామారావు. కిటికీలోంచి బైటికి చూశాడు—తోటమాలి చెట్లకి సంరక్షణ చేస్తున్నాడు. తోట అవతల రోడ్డు ఒకటి రెండు కార్లనీ, నాలుగు బళ్ళనీ తప్పిస్తే నిర్మానుష్యంగానే ఉంది.

రాత్రి పన్నెండయేసరికి తతంగం అంతా పూర్తి అయి, అప్పుడు పడు కున్నాడు రామారావు. పెళ్ళి పందిరిలోని దృశ్యాలన్నిటిని జ్ఞాపకం తెచ్చు కుంటూ ఆతను మళ్ళా మంచంమీద కూర్చున్నాడు.

మేడమీద సందడి అంతగా లేదు. తనకి తెలియని ఒకరిద్దరు ఆడవాళ్ళు మాత్రం ఎదురుగా గదిలో సామాను సర్దుకొంటున్నారు. ఇద్దరూ వయసు మీరిన వాళ్ళే. ఒకామె మాత్రమే సకేశ.

టూత్‌బ్రష్‌కోసం తడుముకుంటున్నాడు రామారావు. ఆ గది జాగ్రఫీ అతవి కేమీ తెలియదు. రాత్రి తన సామాన్లు ఎక్కడ పెట్టారో కూడా అతనికి తెలియదు. ఎవరినైనా అడుగుదామంటే పూర్తిగా కొత్త యిల్లు!

కర్తవ్యం ఆలోచిస్తూ అత నలాగే కొద్ది ని షాలు కూర్చున్నాడు. ఇంతలో ఎదురుగా టేబిల్‌మీద అద్దమూ, దువ్వెనా చూసి, లేచి తల దువ్వుకుంటు న్నాడు.

అప్పుడే ఒక చెంబులో నీరూ, అతని టూత్‌బ్రష్, పేస్టు పట్టుకువచ్చింది శ్యామల. గిరుక్కున వెనుదిరిగాడు. ఆమె గుమ్మం దాటింది. అయిదేళ్ళక్రిందటి శ్యామలకీ ఈ శ్యామలకీ ఎక్కడా పోలికే లేదు తలా, బట్టలూ ఏర్పరుచుకోక పోయినా, యౌవనపు మిసమిస ఆమెలోనుంచి తొంగిచూస్తూనే ఉన్నది.

రామారావు నిలబడదా మనుకున్నాడు-కాని అతని శరీరంలో ఏదో నీరసం లాగ బలవంతంగా అతన్ని కూర్చోబెట్టింది. అతను చాలా మాటలాడదా మను కున్నాడు. కాని ఒక్క మాటా అతని పెదవులుదాటి పైకి రానేలేదు.

అతను టూత్‌బ్రష్ నోటిలో పెట్టుకుని బయటికి వచ్చేసరికి శ్యామల మెట్లు దిగి వెళ్ళిపోతున్నది.

తన బలహీనత్వానికి తానే నవ్వుకుని రామారావు పళ్ళు తోముకుని, ముఖం కడుక్కున్నాడు. మళ్ళావచ్చి టేబిల్‌దగ్గర కూర్చుని అక్కడి సౌందర్యపరిక రాలన్నీ పరీక్షిస్తున్నాడు. శ్యామల కాఫీ తెస్తుందేమోనని అతని కాళ లేకపో లేదు. అలా జరిగితే ఈసారి తప్పక ఆమెతో మాటలాడాలని అత ననుకు న్నాడు.

తలుపుతోసుకుని లోనికి వచ్చాడు ప్రకాశం. కళ్ళన కాటుకా, వంటిని వసుపు గుర్తులూ అతన్ని పెళ్ళికొడుకుగా తెలియజేస్తూనే ఉన్నాయి.

"మొహం కడుక్కున్నావురా?" అన్నాడు చిరునవ్వుతో ప్రకాశం.

తానూ చిరునవ్వుతోనే, "కడుక్కున్నాను" అన్నాడు.

ప్రకాశం పూర్వంలాగే—"హాస్యంగా శ్యామలని నీకు నీళ్ళుతెచ్చి ఇమ్మ న్నాను. అంతా నవ్వారు. పంతానికని పట్టుకొచ్చింది. నిద్రలేపిందా?" అన్నాడు.

రామారావు కొంచెం సిగ్గుగా నవ్వుతూ "అదేమీ లేదులే. నేను లేచే ఉన్నాను. గుమ్మందాటి అవన్నీ క్రిందపడేసి, తుర్రుమన్నది" అన్నాడు.

ఈసారి ఇద్దరూ నవ్వుకున్నారు.

"దానికేంగాని, రామం, ఇంత ఆలస్యంగా వచ్చావేమిరా? మీ సెలవులు వారం క్రిందటినుంచే కదా? నువ్వు నిన్న ముహూర్తం వేళకే సరిగా వస్తావను కోలేదు. అందుకే టెలిగ్రాం ఇవ్వలేదు. అంత ఆలస్యం ఎందుకైంది?"

రామం తల వంచుకున్నాడు. "అలాగే అశ్రద్ధ అయిపోయిం దన్నయ్యా! పొరపాటేలే, నీకు రాద్దా మనుకున్నాను. తీరికే లేకపోయింది" అని మాత్రం అన్నాడు.

"దానికేంలే—నిన్న వాళ్ళంతా నువ్వు రావనుకున్నారు. ఏమైనా, వయ సొచ్చాక అన్నదమ్ములా అని వాళ్ళ అనుమానం. నాకు తెల్సుననుకో. సరే— రాత్రి సరిగా నిద్రపట్టిందా?...పద కాఫీ తాగి వద్దాము. వాళ్ళంతా నీకోసమే చూస్తున్నారు."

వాళ్ళిద్దరూ మేడదిగి, క్రింద అందరూ ఫలహారాలు చేస్తూన్న చోటికి వచ్చారు. కాఫీ, ఉప్మాలతోపాటు ఇడ్లీ కూడా తింటూ అందరూ పెద్దగా కాకా ఖానీ కొడుతున్నారు. రామంతో, ప్రకాశం రావడంతో కొంత సద్దు తగ్గింది.

"మా తమ్ముడు...చెప్పానుగా, లా చదువుతున్నాడని" అని కొంతమందికి పరిచయం చేశాక ప్రకాశం అతన్ని లోపలికి తీసికెళ్ళాడు. అక్కడ పది పన్నెండుమంది బహుశా వాళ్ళకోసమే ఎదురుచూస్తున్నారు. వాళ్ళంతా ముఖ్య బంధువులని గ్రహించాడు రామం.

"రావోయ్, కూర్చో. అన్ననే మరిచిపోయావేమిటి? అతను బెంగపెట్టు కున్నాడనుకో—ఆ పీటమీద కూర్చో—ప్రకాశం, నువ్వా పీటమీద కూర్చోవోయ్."

అతను పీటమీద కూర్చున్నాడు.

"ఆయనే రామూ మామగారు" అని ప్రకాశం పరిచయం చేశాడు. తరవాత అందరినీ పరిచయం చేశాడు.

"మరదలిక్కడ లేదులే. అయినా ఉదయం పరిచయం అయిందిగా?"

అంతా నవ్వారు. శ్యామల సావిత్రికి చెల్లెలేమీ కాదు. కాని తన సహజమైన

చిలిపితనంతో సావిత్రికి ఆ రెండురోజుల్లోనూ అంతకన్న సన్నిహితురాలైంది. ఉదయం విషయం త్రవ్వి కాస్త నవ్వుకోడానికే ప్రకాశం అలాగ అన్నాడు.

"ఊ...అయితే లా చదువుతున్నావా? ఎన్నో సంవత్సరం?" ప్రకాశం మామగారు కృష్ణారావుగారు అడిగారు.

"ఒకటో సంవత్సరం అయింది."

"నువ్వు ఇంటర్ ఎక్కడ చదివావు?"

"విశాఖపట్టణంలోనే."

"అయితే మా అమ్మాయిని నువ్వింతకుముందే ఎరుగుదువన్నమాట."

"తెలీదండీ – నాకు జూనియరో, సీనియరో అయివుంటుంది."

ఆ మాట నిజమైనా, అతను సత్యాన్ని అంగీకరిస్తే తన కామె తెలుసుననే చెప్పి ఉండాల్సింది.

తరవాత కొంచెంసేపు ఖాతాఖానీ అయ్యాక అందరూ ఊరేగింపుకి బయలు దేరుతున్నారు. తలనొప్పిగా ఉందని చెప్పి, రామారావు తన గదికి వచ్చి పడు కున్నాడు. వస్తూంటే దారిలో సావిత్రి ఎదురైంది, తల వంచుకుని వెళ్ళి పోయింది. అతను నడక శీఘ్రతరం చేశాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. ఆ కొత్త వాతావరణం బాగా అలవరచుకొనేదాకా అతనికి తోచలేదు. లేచాడు.

కిటికీలోంచి చూశాడు. కొంతమంది చుట్టాలు వెళ్లిపోతున్నారు. ఊరేగింపు సాగుతోంది.

అతను వెనుదిరిగాడు. గది ఎవరో శుభ్రంచేసిపెట్టారు. గోడలని చాలా ఫోటోలూ అవీ ఉన్నాయి. ఒక మూలగా రేడియో ఉంది.

ఏమీ తోచక అతను రేడియో ట్యూన్ చేశాడు. ఏదో పాశ్చాత్య సంగీతం వస్తోంది. శ్రవణపేయంగా ఉంది. సిగరెట్ ముట్టించి పొగ వదిలాడు. కొంచెం ఉత్తేజం అనిపించింది గదిలో అటూ ఇటూ పచారుచేస్తున్నాడు. షెల్ఫులో చాలా పుస్తకాలున్నై.

ఒకటి మధ్యది తీశాడు — మాఘామ్‌ది. పేజీలలో అండర్‌లైన్లూ. మార్కులూ. పెట్టేశాడు.

డ్రాయర్‌మీద చూశాడు—ఇంగ్లీషు మ్యాగజైన్లు, ఏదో బొమ్మల పుస్తకం తీశాడు—చికాగ్గా పారేశాడు. ఇంకొకటి ఫిలింజర్నల్. తీసి, మంచంమీద పడు కుని బొమ్మలు చూస్తున్నాడు.



కొద్దిసేపట్లో అతను మళ్ళా నిద్రకి వశుడయ్యాడు. సినీ జర్నల్ అతని చేతిలో ఉంది. సిగరెట్ మాత్రం పారవేశాడు. సంగీతం వాల్యూమ్, తక్కువగా వస్తూనే ఉంది.

ఏదో చప్పుడు అయి అతను ఇద్దకంగా లేచాడు. సావిత్రి టేబిల్ముందు కుర్చీలో కూర్చుని ఆ డ్రాయర్లో ఏమో తీస్తూంది. అతని గుండెలు కొట్టు కుంటున్నాయి. ఆ శబ్దం ఆమెకి వినపడకుండా ఈ ప్రక్కకి తిరిగి అతను ఐల వంతాన కళ్లు మూనుకున్నాడు.

మధ్యాహ్నం భోజనంచేసి నిద్రపోయాడు రామం. ఆ గది అతనికి ప్రత్యే కంగా వదిలేశారు. అతను లేచేసరికి నాలుగు దాటింది—ఎదురుగా సబ్బూ, తువ్వాలూ, నీళ్ళూ ఉన్నాయి.

ముఖం కడుక్కుని బట్టలు మార్చుకొన్నాడు. అతను కాఫీకోసం ఏమిటి చెయ్యడం అని ఆలోచిస్తూంటే శ్యామల కనిపించింది. పిల్చాడు, కాఫీకోసమని కాదు ఆమెకోసమని.

శ్యామల వచ్చి గుమ్మందగ్గర నిలబడి కొంచెగా, "ఏం?" అన్నది. రామారావు ధైర్యమంతా కరిగిపోతూంది. చిన్నగా నవ్వుతూ "షికారు వస్తావా బీచ్‌కి పోదాం" అన్నాడు. కాని వెంటనే నాలిక కరుచుకున్నాడు – హద్దు అతిక్రమించి ప్రవర్తించానేమోనని.

"సీతోనే; నేను రాను" అంది. ఆ మాటలంటూ ఆమె చిరునవ్వు నవ్వింది; కాని, అతనా విషయం గ్రహించలేదు.

ఈ సంఘటన ఏమాత్రం గొప్ప అపజయమో అతను తెల్సుకునేలోపున శ్యామల వెళ్ళిపోవడమూ జరిగింది. రామారావుమాత్రం ఆమె సమాధానంలో ఏమైనా అంతరార్థాలు ఉన్నాయా అని ఆలోచిస్తున్నాడు.

ఇంతట్లో ఎవరో-వంట బ్రాహ్మణుడై ఉంటాడు—కాఫీ, ఫలహారమూ తెచ్చి ఇచ్చాడు. కాఫీ ముగించి రామారావు మెట్లుదిగేసరికి బంతులాట జోరుగా సాగుతోంది; పాటలు పాడుతున్నారు.

అందరి దృష్టి ఒక్కసారి అతని ముఖంమీద పడటం అతన్ని చాలా గాభరా పెట్టింది. ఒక్కసారి సావిత్రి ముఖంలోకి చూశాడు. ఆమె తనవైపే చూసి, సిగ్గుతో తిన్నగా నవ్వి తల దించుకున్నది.

తొందరగా ఇల్లుదాటి బైటికి నడిచాడు రామం. సావిత్రి చిరునవ్వుమాత్రం, అతని గుండెల్లో నాటుకుపోయింది. తొలిమల్లెల తెల్లదనంలాగ ఆ చిరునవ్వు—

## 2

సముద్రతీరం వెంటనే నడుస్తున్నాడు రామారావు. అక్కడి ప్రశాంతత అతనికి చాలా ఉత్తేజకరంగా ఉంది.

కొంచెం దూరం నడిచి ఒకచోట కూర్చున్నాడు. ఒక్కసారిగా ఏదో పరాజితుడిలాటి భావం అతని మనస్సుని చుట్టిముట్టింది, "ఏమిటీ భావం? ఎందుకీ పరాజిత మానసికవ్యధ?''... అనుకున్నాడు. నిన్న రైల్లో వస్తూంటేనూ ఏదో నేరం చేయబోయే వాడిలాగ బాధపడ్డాడు—నేడూ అదేస్థితి ఎందుకని?

సావిత్రి చిరునవ్వు తుమ్మముల్లులాగా ఒక్కసారి గుచ్చుకుంది—మనస్సులో.

రెండేళ్ళక్రిందట కాలేజీలో సంఘటన అతనికి జ్ఞప్తికి వచ్చింది. ఆనాడూ ఆమె అదేరకపు చిరునవ్వు—అదే భావం.

ఈ రెండేళ్ళూ తా నామె నెంతగా తలచుకొన్నాడు? ఎన్నిసార్లు ఆమెతో మాట్లాడడానికి ప్రయత్నించాడు? ఆమె సౌందర్యం ఆ ఆకర్షణకి కారణం

కావచ్చు, లేక ఆమెలోని సౌమ్యత కావచ్చు. అసలు ఆమెపట్ల తన కెలాటి భావం ఉంది? ఆ ప్రశ్నమాత్రం తెగలేదు. ఎందుకో తా నామె నభిమానిస్తున్నాడు. అదిమాత్రం వాస్తవం.

ఇప్పుడు ఆమె తన వదిన. తనని ప్రాణాలతో సమంగా చూసుకొంటూన్న అన్నయ్యకి భార్య. 'అదృష్టవంతుడు' అనుకున్నా డత నొక్కసారి.

సముద్ర తరంగాలు విజృంభిస్తూ తీరం చేరేసరికి నామ రూపాలని నశింప జేసుకుంటున్నాయి. అతని మానసికాంతరంలో అనేక ఆలోచనా తరంగాలు బయలుదేరుతున్నై. కాని, బయటికి వచ్చేసరికి వాటి రూపమంతా శిథిలమౌ తోంది

తానామెని ప్రేమించాడా ?

అత నీ ప్రశ్నకే సమాధానం చెప్పుకోలేక పోయాడు. కొద్ది నిమిషాలామెతో మాటలాడితే తన భావా లెలాగ పరివర్తన చెంది ఉండేవో! ఆమెయెడ తన కున్న అభిమానం ఒక ముద్దగా ఉన్నది. దానిలోనుంచి కాలం ఏ స్వరూపాన్నీ తయారుచెయ్యకుండానే అది తన చేతిలోకి వచ్చింది.

ఆమెతో ఇటుపైన ఎలాగ వ్యవహరంచడం? ఒక్కసారిగా ఆ ఉన్నత పదవి నామె కెలాగ దత్తం చెయ్యడం? ఈ మార్పు కెలాగ అలవాటుపడడం ?

కాని, ఇంక తప్పని పరిస్థితుల్లో ఏదో ఒకటి చెయ్యాల్సి వుంటుంది—జీవితంలో ప్రతీపనీ మానవుడు ఇష్టంతోనే చేయకపోవచ్చును. విధి నిర్మించినదాన్ని తరుచు విధేయతతో అంగీకరించవలసి ఉంటుంది.

తన జీవితంలో మొదటి ప్రణయం ఇతరులకి ప్రేయసితోసహా—తెలియకుండా, అపచారం చెయ్యకుండా, అంతం అయింది. తన నాయకత్వం ఎవ్వరికీ తెలియకుండా ఓడిపోయింది.

సూర్యాస్తమయం కావస్తూన్నది. కనుచూపు మేరలో ప్రత్యక్షమైందిశ్యామల. ఎవరో కుర్రవాడిని చేత నడిపించుకుంటూ తన దారినే వస్తున్నది.

అతని గుండెలు తీవ్రంగా స్పందించసాగాయి. ప్రక్కన ఎవరు వున్నా అది వినిపించును. ఆమెను చూడనట్లు నటిస్తూ వీలైనంత ఆకర్షణీయంగా కనిపించ ప్రయత్నిస్తున్నాడు రామం.

ఆమె రానే వచ్చింది.

"ఓహో, మీరూ ఈ దారినే వచ్చారా!" అని మాత్రం కష్టంతో అనగలిగాడు.

"ఊఁ...మా బాబీ ఏడుస్తూంటే కాస్త తిరుగుదామని ఇలాగ తీసుకు వచ్చాను."

శ్యామల నిలబడే నవ్వుతూ అన్నది

"కూర్చుంటారా ?"

"ఎందుకు ?"

"కొంచెం విశ్రాంతికోసం—సముద్రం, పరిసరాలూ ఎంత సౌందర్యంగా ఉన్నాయో చూశారా? కూర్చుంటే ఇంకా బాగుంటుంది."

"అది సరేగాని— 'అండి' ఎప్పటినుంచి ?"

రామం తన నిద్రలోనే ఉండిపోయాడు—అది గ్రహించుకుని సిగ్గుపడ్డాడు.

"మరిదానులే—అయినా చాలా పెద్దదానవయ్యావుగా ? ఏమంటే కోపం వస్తుందోనని !"

"నీ బడాయిలు కట్టిపెట్టోయ్—సరేకాని, ఇక్కడెందుకు కూర్చున్నావు ?"

ఏ యువకుడైనా భవిష్యత్తుకోసం ఎంతో చక్కగా ఉపయోగించుకోవాల్సిన పనికిరాని ప్రశ్న...రామారావు చాలా తెలివైన ప్రేమికుడు కాదు ఎక్కువ పాలు వేదాంతి...

శ్యామల కూర్చుని అజాగ్రత్తగా ఇసకలో జేరబడి మీదికి రాజూస్తూ రాలేక పోతున్న సముద్రతరంగాలని చూస్తూంది.

"ఏముంది? చెప్పానుగా—విశ్రాంతి తీసుకుంటున్నాను. చెప్పానుగా ఇక్కడ చాలా బాగుందని !"

చిలిపిగా నవ్వింది శ్యామల—ఏమీ జవాబివ్వకుండా, అలాగే అందంగా కూర్చుని సముద్రతరంగాలవైపు చూస్తూ ఆనందిస్తోంది. బాబీ ఇసకమేడలు కడుతున్నాడు—

రామారావు ఒక సందేహంలో పడ్డాడు—శ్యామల ఆ దారిన రావడమూ, అక్కడకు వచ్చి కూర్చోడమూ ఆమె తనని కల్సుకోవడంకోసం ప్రయత్నించి జయించిందని సూచిస్తున్నాయి. తా నా నిమిషంలో ఊరుకుంటే... ఏమనుకుంటుంది ?

అందుచేత చాలా ఆలోచించి, ఆమెకి కొంచెం దగ్గరగా జరిగి..."ఏమిటాలోచిస్తున్నావు, శ్యామలా?" అన్నాడు.

"చాలా లే—అయినా నీ కెందుకు ? కెరటాలని చూస్తూ ఆడుకో—ప్రియురాలు కన్పిస్తుంది" అంది.

కాలం నష్టపోకుండా—"కనిపిస్తూనే ఉంది" అన్నాడు సగం ధైర్యంగా రామారావు.

"ఎక్కడ?"

అతను నవ్వాడు. కాని, హటాత్తుగా ఆమె ముఖాన్న చిరునవ్వు మాయమైంది. అతని గుండె ఆగినట్లయింది.

"మగవాళ్ళకి ఒక జబ్బు ఉందోయ్...ఏకాంతంగానో మరెలాగైనానరే ఎవరైనా అమ్మాయి కనిపించిందనుకో. దానితో ఏదో ప్రణయవల్లరి ప్రారంభించడానికే ప్రయత్నిస్తారు. ఒక్క సినీమాలోనే ఇది తప్పదు—మాటలాడిన ఆడదల్లా ..."

శ్యామల ముఖం వివర్ణమైంది-తన పని అంత తప్పు అని అతనుఅనుకోలేదు. ఆమె క్రింది పెదవి వణుకుతోంది...

ఇక్కడ ఒక క్రొత్త స్త్రీరూపమే ప్రత్యక్షమైనది— అతని జీవితం సంబంధించినంతవరకూ కేవలం స్నేహంకోసం ప్రయత్నించే స్త్రీ...

ఒక్కసారిగా ఏదో నేరంచేసినట్లయిం దతనికి ఆమె కళ్ళనుంచి నీరు వస్తుందనుకున్నాడు. కాని అదృష్టవశాత్తు అదేమీ జరగలేదు.

శ్యామల ఒక్కసారి లేచి నిలువబడింది. బాటీని మళ్లా వెనక్కి తీసుకుంది వెళ్ళడానికి.

"క్షమించు శ్యామలా—సరదాగా అన్నాను. కాని, నిన్నేదో అవమానం చేద్దామని కాదు" అనిమాత్రం రామారావు అనగలిగాడు.

ఆమె ఒకసారి వెనుతిరిగి చూసి తనదారిన సాగిపోయింది. అతని మనస్సంతా పాడైపోయింది. ఆ సుందర పరిసరాలన్నీ అతనికి ఇప్పుడు నిస్సారంగా కనిపిస్తున్నాయి, ఎంత ఆలోచించినా ఆమె ప్రవర్తనకి అర్థం బోధపడలేదు. అంత చలాకీగా ఉన్న శ్యామల ఈ చిన్న సంఘటనకి ఎంత బాధపడింది!

అయిదేళ్ళక్రిందటి శ్యామలను ఒకసారి జ్ఞాపకం చేసుకున్నాడు. పరికిణీ, జాకెట్టూ వేసుకుని ఎంత చనువుగా మాటలాడేది! ఎన్నిసార్లు తనని చెవులు పట్టుకుని ఆడించేది! యౌవనంతోపాటు ఈ లక్షణాలన్నీ వస్తాయి కాబోలు! ముఖ్యంగా బాబాల్లాంటి మాటలు!

ఆమె తన దృక్పథం దాటిపోయింది. బహుశా ఈసరికి ఇంటికి వెళ్ళిపోయి ఉంటుంది...'ఎందుకమ్మా అలాగ ఉన్నావు?" అని వాళ్ళమ్మ అడిగితే...

నిశ్చయంగా జరిగినది దాస్తుంది...ఏవో అబద్ధాలు చెపుతుంది. స్త్రీ దేనికి సిద్ధంకాదు ?

చీకటిపడి, బాగా వెన్నెల వచ్చేసరికి ఇంక ఆలస్యం అవుతుందని బయలు దేరాడు రామం ఇంటికి. ఇల్లంతా హడావుడిగానే ఉంది. అతను గుమ్మం దాటు తూండగా ప్రకాశం వచ్చి—''ఎక్కడికి వెళ్ళావురా ? నీ కోసం సాయంత్రం అంతా చూస్తున్నాము" రాత్రి తతంగం ఏమీ లేదు-ఫిల్ముకి పోదా మను కున్నాము అన్నాడు.

కొంచెం కష్టంగా, "వెళ్ళలేక పోయారా? నేను బీచ్ కి పోయాను''అన్నాడు.

ఇంతల్లో మామగారు వస్తూ... ''అదేమిటోయ్! న్యాయంగా పెళ్ళి పెద్దవి. నువ్వు లేకుండా అందరూ ఎలాగ వెళ్తారు ? అసలు తీసికెళ్ళేవా రెవరంటే" అన్నారు. అందరూ నవ్వుతా రనుకున్నా డతను. కాని అలాటి దేమీ అవలేదు.

"సరే—సెకండ్ షోకి పోదాములే ! మడికట్టుకో."

అతను మేడమీద గదిలోకి వెళ్ళేసరికి గదిలో సావిత్రి తల దువ్వు కొంటూంది. పరధ్యానంగా గుమ్మందాటి రామం ఆమెనిచూసి ఆగిపోయాడు.

చిరునవ్వుతో... "రావోయ్... ఎందుకలా భయపడతావు ? వదిన అంటే పెద్దపులి అనుకున్నావా ?" అన్నది.

రెండో ఓటమికూడా రామారావుదె అయింది.

"ఆ భయంతోనేనా సాయంత్రం వెళ్ళిపోయావు !'' అని, సావిత్రి వాక్యం పూర్తిచేసింది-నవ్వుతూనే.

ఒక్కసారిగా తలుపులు తెరుచుకుని తన జీవితంలో ప్రవేశించిన వదినని సాశ్చర్యంగా చూస్తూ ... ''అదేమీలేదు వదినా—కొంచెం విశ్రాంతి కోసమని అలాగ వెళ్ళాను. ఏమైనా మీ రెవరూ రారుగా ?"

చివరిమాటలో కొంచెం ఎత్తిపొడుపు అతననుకోకుండానే వచ్చింది. సావిత్రి లేచి, బొట్టు పెట్టుకొని వెళ్తూ- "చాలానే ఉందే కోపం ! రేపటినుంచి వస్తాముగా భోజనానికి లే'' అంది.

ఆమె నిష్కృతిని పరికిస్తూనే అతను బట్టలు మార్చుకుని క్రిందికి బయలు దేరాడు.

## 3

అయిదు రోజులూ అయేసరికి రామారావు సావిత్రిని ఒక కొత్త దృక్పథం నించి చూడడం నేర్చుకున్నాడు. ఆమె ఇప్పుడు వదినగారు— ఇంటికి యజ







మానురా అన్నమాట. తన మంచిచెడలు కావలసిన వ్యక్తి, తాను గౌరవించ వలసిన వ్యక్తి.

ఏమైనా, వాళ్ళిద్దరిమధ్యా ఉన్న తెరలన్నీ తొలగిపోయి సాధ్యమైనంత పరస్పరం సన్నిహితు లయారు.

రామంలో ఏదో మార్పుని కనిపెట్టి దానికోసం బాధపడుతున్న ప్రకాశానికి ఈ క్రొత్త బంధుత్వం తమ్ముడి కిచ్చిన వెలుగు చాలా ఉపశమనకారణంగానే వుంది. "ఆ పరిస్థితుల్లో ఎవరైనా ఆ బాధ పడక తప్పదు" అనుకున్నాడు ప్రకాశం.

కాని, శ్యామల ప్రవర్తనమాత్రం ఆ అయిదురోజులూ చాలామందికి ఆశ్చర్యం కలిగించింది. ఒకనాడు సావిత్రే ఆమె నడిగింది—

"ఏమే, అలాగ వున్నావు ?"

"ఎలాగ ?"

"అంత బెంగగా ? ఎవరికోసమని— ?"

"ఎవరికోసమనీ లేదులే. కొంచెం తలనొప్పిగా ఉంది."

అంతకన్న ఆమెనుంచి సావిత్రి ఇంకేమీ రాబట్టలేకపోయింది. రామారావు మాత్రం ఆ కొద్దిక్షణాలూ ఊపిరి బిగబట్టుకున్నాడు.

ఇంక అక్కడ ఉండడం రామారావుకి సుతరామూ ఇష్టంలేకపోయింది. ఇంటికి వెళ్ళిపోవాలనుకుని ఆ సంగతి ప్రకాశంతో అన్నాడు.

"ఈ రెండురోజులూ అయ్యాక నేనూ వస్తాగా ? అందరమూ కలిసే పోదాము" అన్నాడు ప్రకాశం.

"కాదన్నయ్య ... ఏమైనా పని ఉంటే తప్పక ఉందును. కాని బొత్తిగా గడవటం లేదు కాలం."

"కాని అందరూ ఏమనుకుంటారు ?"

ఈ ప్రశ్న అన్ని మాటలవంతూ పనిచేసింది. "సరేలే—కలిసే వెళ్దాం" అన్నాడు రామారావు.

ఆ మధ్యాహ్నం సావిత్రి అతని గదిలోకివస్తూ, "ఏమయ్యా, మా ఊళ్లో తోచదంలా ?" అన్నది.

ఆమె కదంతా ఎలాగ తెలిసిందని ఆతను తెల్లబోయాడు. నవ్వుతూన్న ఆమె ముఖంలోకి చూస్తూ "నీతో అన్నానా వదినా?" అని మాత్రం అన్నాడు.

"అయినా తెల్సిందిగా-అలాటి పని ఏమీ చెయ్యబోకు. రెండురోజులూ ఎలాగో బాధపడితివా, సంతోషిస్తాము."

"బాధ ఏముంది వదినా ? ఉంటానుగా ?"

"మంచివాడివి-సరేకాని. శ్యామలతో ఇప్పుడు నువ్వు మాటలాడడం లేదా ?"

హటాత్తుగా వచ్చిన ఈ ప్రశ్న అతని బుద్ధిని మందగింపజేసింది.

"నే నొకప్పుడు మాటాడానా ?"

"దానికేమిలే—అదే నీతో మాట్లాడిందిగా. అయినా అది ఎందుకో బాధపడుతోంది. చెప్పదు. తలనొప్పి అని మాత్రం అంటుంది."

"నాకేం తెల్సును ?"

"ఆపాటి గ్రహించకపోతే ఎలాగ ?"

రామారావు తెల్లబోయాడు. అతను మళ్ళా స్వాభావికస్థితికి వచ్చేలోపున సావిత్రి వెళ్ళిపోయింది.

అత నాలోచిస్తూ ఉండిపోయాడు. నిజమే— శ్యామల ఇంతగా ఎందుకు దెబ్బతినాలి? వదిన అంతా కనిపెడుతూనే ఉందన్నమాట. ఆనాటి సంభాషణలో తాను తొందరపడినమాట వాస్తవమే కాని క్షమాపణ ఇచ్చుకున్నా మనస్సు మార్చుకోదేం ?

మొత్తంమీద రామారావు మళ్ళా ఇరుకునపడ్డాడు. శ్యామల స్థితి ఇంట్లో అందరి దృష్టినీ ఆకర్షించటం అతనికి చాలా బాధాకరంగా ఉంది. దానికి తోడు సావిత్రి దీనిని గ్రహించడం.

అక్కడినుంచి చాలా తొందరగా పోవాలని అనిపించిం దతనికి.

ఆ సాయంత్రం పిక్చర్‌కి పోదామని అత ననుకున్నాడు. నాలుగుకే కాఫీ త్రాగి బయలుదేరాడు. ఇంట్లో ఎవరికీ తెలియదు అతని నిష్క్రమణం,

ఆరుదాకా అతను సముద్రపు ఒడ్డున తిరిగి తిరిగి, తరువాతథియేటరుకి నడిచాడు. త్రోవలో హోటల్లో దూరి కొంచెం కాఫీ తీసుకున్నాడు—అక్కడ ఆలస్యం కావడం, అతను వెళ్ళేసరికి చిత్రం ప్రారంభించారు.

కేవలం కాలక్షేపం చేద్దామని వచ్చాడు. కనక ఆసంగతి అతని నట్టే బాధించ లేదు. టికెట్ తీసుకుని వెళ్లాడు. బాల్కనీ జనంతో నిండిపోయి ఉంది. ఎక్కడో ఒక సీటు చూపారు—పోయి కూర్చున్నాడు.

కథ ఏదో సాగుతోంది. పాటలుమాత్రం బాగున్నాయి. అతని బుర్రలోఅనేక ఆలోచనలు సాగుతూ మధ్యమధ్య పాటలు వినడానికిమాత్రం అగుతున్నాయ్.

ఇంటర్వెల్ అయేసరికి సిగరెట్ ముట్టించి వెనక్కి తిరిగాడు-ఊరికే తృళ్ళి పడ్డాడు. తన వెనకాల ఒక్క సీటుప్రక్కగా శ్యామల కూర్చుంది. ప్రక్కన వాళ్ళ అమ్మా, నాన్నా, ఇంకెవరో యువకుడూ కూర్చున్నారు.

ఎవరినుంచి తప్పించుకోడానికి అత నక్కడికి వచ్చాడో ఆ శ్యామల ఆనాడే సినిమాకి రావడం అతనికి చాలా బాధాకరంగా ఉంది. ఆమెకోసం తానక్కడికి వచ్చానని ఆమె అనుకోక తప్పదు; వాస్తవంగా దానికి పూర్తిగా వ్యతిరేక పరిస్థితులు...

ఎటూ చూడకుండా. తెరవైపే కళ్లు తిప్పి అలాగ ఉండిపోయాడు రామా రావు స్లయిడ్లు వేస్తున్నారు. పొరపాటున తల కదలకుండా వాటి నతను జాగ్ర త్తగా చదువుతున్నాడు. ఇంటర్వెల్ పూర్తయింది.

కాని అక్కడ వుండడమే అతనికి సమస్యగా ఉన్నది—ఆమె కళ్ళు అతనికి బాణాల్లా గుచ్చుకుంటున్నాయి.

కొద్ది నిమిషాలయాక అతను చివాల్న లేచి, గుమ్మందాటి, వీధిలో పడ్డాడు- అప్పుడుమాత్రం తా నేమిటిచేశాడో ఆలోచించుకోగలిగాడు.

అత నింటికి చేరేసరికి వాళ్ళ భోజనా లయిపోయాయి, అప్పుడే అందరూ లేస్తున్నారు. తన గదిలోకి తిన్నగా వెళ్ళి బట్టలు మార్చుకున్నాడు. సావిత్రి వచ్చి "సినిమాకి పోలేదా?'' అని అడిగింది.

"నేను వెళ్ళాననుకున్నావా?''

"ఔను—వాళ్ళంతా వెళ్ళారుగా..."

"అయితే వెళ్ళాను''

"మరి నీ వింత వేగంగా వచ్చేశావేం?"

"తలనొప్పివచ్చి—ఫిల్ము లాగ ఉందిలే."

"—కనిపించారు"

"వాళ్లెవరూ కనపడలేదూ?"

ఇంక ఏమీ అనకుండా సావిత్రి వెళ్ళిపోతూ భోజనానికి రమ్మని చెప్పి పోయింది. ఎందుకీ విషయాన్నింత పట్టిపట్టి అడుగుతూందో రామారావుకి బోధపడలేదు.

మర్నాడు అతను లేచేసరికి బాగా చీకటిఉంది. చాలామంది చుట్టాలు వెళ్ళి పోవడానికి సన్నాహం చేస్తున్నారు. ఇల్లు కాస్త సందడిగానే ఉంది. మేడమీద మాత్రం చాలా నిశ్శబ్దంగా ఉంది.

లేచి, తల దువ్వుకున్నాడు రామారావు. అలవాటు ప్రకారం. కిటికీ తలుపులు మాత్రం తీసి ఉన్నాయ్.

ఇంతట్లో తలు పెవరో తోసుకువచ్చారు. ఒక్కసారి అతను వెనుదిరిగాడు; అతనిగుండె ఒక్క అదటు తప్పింది కనిపించీ కనిపించని ఆ ప్రభాత పూర్వపు కాలంలో, పూర్తిగా అలంకరించుకుని లోనికి వచ్చింది...శ్యామల!

అతను ఏమీ మాటలాడలేకపోయాడు.

"నేను వెళ్తున్నాను రామారావ్" అన్నది శ్యామల.

"ఈ రైలుకేనా!" ఇంకేమనాలో అతనికి తోచలేదు.

"ఔను...నిన్నరాత్రి ఎందుకు హోలువదిలి పరిగెట్టావ్? అంత విసం అయ్యావా?"

మేఘంలేని ఈ పిడుగు అతన్ని పీలైనంతా చకితుణ్ణి చేసింది. అతనేమీ జవాబివ్వలేదు. మరుక్షణం ఆమె కళ్ళల్లో ఆ మసకకాంతులు ప్రతిఫలించాయి. ఆమె గొంతుక గాద్గదికమైంది:

"నీకంత కష్టంకలిగిస్తే క్షమించు రామారావూ. ఎవరిదారిన వాళ్ళం పోతూ ఈ కోపాలెందుకు?—మరి-వస్తానూ?"

ఆ మాటల నామె అంటూంటే ఒక్కసారి చేతుల్లోకి తీసుకుని, తన మనస్సుని విప్పి చెప్దామనుకున్నాడు రామారావు కాని, గతించిన విషయాలా పనిసాధ్యం కానీయలేదు.

"నీ మీద కోపం ఎందుకు శ్యామలా! నిన్న రాత్రి నాకు ఫిలిం బాగుండక వచ్చేశాను. నువ్వేం తప్పు చేశావు?"



"ఇంత అబద్ధాలు కూడా ఎందుకులే...కాని, నా చేత కన్నీరు పెట్టించే పని మాత్రం మరిచిపోకు"

శ్యామల వెనుదిరిగి తొందరగా వెళ్ళిపోయింది. ఆ మాట ఏదో శాపంలాగ వినపడిం దతనికి.

వాళ్ళు గుమ్మందాటి బండి ఎక్కేవరకూ అతను కిటికీలోంచి బయటికి చూస్తూనే ఉన్నాడు నిర్విణ్ణుడై. వాళ్ళని సాగనంపి వస్తున్న సావిత్రికి మాత్రం అతను తనకే తెలియకుండా దొరికిపోయాడు.

* * *

సావిత్రి ప్రకాశంతో చాలా చనువుగా మెలగడం మొదట రామారావుకి కొంచెం ఆశ్చర్యాన్నే కలిగించింది. ఎవరిమట్టుకు వాళ్ళు కొంత వ్యక్తిత్వంఉన్న జీవితాలను గడిపాక అంత వేగంగా ఒకరికోసం ఒకరు చిన్నవైనా కొన్ని త్యాగాలను, సర్దుబాట్లను ఎలాగ చేసుకున్నారో అతనికి అంతుపట్టలేదు. అధమం

మరికొన్నాళ్ళైనా వాళ్ళు కొత్తవాళ్ళల్లే ప్రవర్తించకపోవడం కొంత ప్రభావం చూపిందతనిమీద.

పెళ్ళయి ఒక నెల అయింది. సావిత్రిని తీసుకుని వచ్చేశాడు ప్రకాశం— వంటమనిషి చేతికూడు ఇంకా ఎన్నాళ్ళని.

ఈ మార్పు రామారావు జీవితంలో చాలా మార్పుని తీసుకురాలేదు. కాక పోతే, ఇప్పుడు వదిన వండుతోంది; ఇంట్లో మాటలాడడానికి మరో మనిషి ఉన్నది.

కాని, సావిత్రి రావడంతో రామారావుకి, ప్రకాశానికి మధ్య ఇద్దరికీ తెలియ కుండా కొన్ని తెరలు పడ్డాయి. సామాన్యంగా రాత్రి పదిదాకా అన్నదమ్ము లిద్దరూ కాలాకానీకొట్టి పడుకునేవారు. ఇప్పుడు ఎనిమిది దాటాక రామారావు మేడమీదికి వెళ్ళిపోతాడు. అదీకాక కాఫీతాగేటప్పుడు సావిత్రి కూడా ఉండ డాన్న ముగ్గురికీ కావలసిన విషయాలు మాత్రమే చర్చకి వచ్చేవి. రామారావు ఈ మార్పుని తప్పనిదానిగా స్వీకరించాడు.

వీటన్నిటికన్నా రామారావుమీద సావిత్రి ప్రభావం దినదినానికీ వృద్ధి పొందడం అతనికి కాలం గడిచినకొద్దీ బాగాతెలుస్తూంది. అనేకసార్లు తన కిష్టం లేనివీ, ఏ పరిస్థితుల్లోనూ చెయ్యనని అనుకున్నవీ కొన్ని పనులు సావిత్రి కోర గానే మంత్రముగ్ధుడిలాగ అతను చేసేవాడు— ఆ క్షణంలో తన ప్రవర్తన ఎంతో సహజంగా కనిపించేది. కాని, తరువాత ఆలోచించుకుంచే తన ప్రవర్త నకి, తానే ఆశ్చర్యపడేవాడు.

సెలవులు మూడునెలలూ ఇంటిదగ్గర ఉందామని లేదు రామారావుకి. ఒకసారి దేశం చూద్దామని బయలుదేరుదామనుకున్నాడు. పూర్వపు మిత్రులను కొంత మందిని కల్సుకుందామని అతని ఉద్దేశం ఆ ఉద్దేశం అన్నతో చెప్పాడు.

"ఎన్నాళ్ళలో వస్తావు?" అన్నాడు ప్రకాశం.

"ఈ నెల అయాక..."

కొంచెం తెల్లబోయాడు ప్రకాశం. లోకానికి పూర్తిగా భయపడే స్వభావం అతనిది. వాస్తవంగా తనలో తప్పు లేకపోయినా, నలుగురూ ఏ పని చేసినా ఏమనుకుంటారో ఆలోచించే తత్వం అతనిది. ఇప్పుడు తమ్ముడు వెళ్ళిపోతే ఇంట్లో పడక, వెళ్ళిపోయాడనుకుంటే? ఆదీకాక, సావిత్రికి రోజుల్లా కాలక్షేపం కూడా అతనే ఇంకా కొత్త కనుక ఒంటరితనం సావిత్రికే కష్టతరం కావచ్చు.

మొదటి భయంగురించి తమ్ముడితో ఏమీ అనకుండా, "నువ్విప్పుడు వెళ్లడం

తప్పదంటే నీ ఇష్టం...కాని, నాకు సుతరామూ ఇష్టంలేదు" అని మాత్రం అన్నాడు.

''ఎందు కన్నయ్యా?"

కొంచెం ఆగి, ''మీ వదినకీ ఈ జీవితం క్రొత్తే. ఇంట్లో పగలల్లా నేను ఉండనే ఉండను. నువ్వు ఉంటే దానికీ కాస్త కాలక్షేపంగా ఉంటుంది. నాకూ తోచదు. సంవత్సరంలో ఎన్నాళ్ళిక్కడ ఉంటావు కనక?"

రామారావు జవాబివ్వలేదు. ఇవ్వలేకపోయాడు.

"సరే, ఆలోచించి నీ కెలాగ తోస్తే అలాగ చెయ్యి."

అతను తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఆరోజు మళ్ళా ఆ ప్రస్తావన రాలేదు. మర్నాడు ఉదయం వీధిలోకి వెళ్ళుతూండగా రామారావుని సావిత్రి పిలిచింది. ఇది అలవాటు లేనిపనే. మెల్లిగా వెళ్ళాడు రామారావు.

"ఎందుకు వదినా?"

"నువ్వు వెళ్ళిపోతా నంటున్నావుట?"

అతను తెల్లబోయాడు.

"నే నలాగ ఏమీ అనలేదే!"

''మరేమన్నావు?''

"దేశం తిరిగి వస్తానన్నాను అంతే. ఎక్కడికి వెళ్ళిపోతాను?"

అప్పటిదాకా సావిత్రి నవ్వుతూనే మాదలాడింది కాని, అప్పు ఆమె ముఖం వివర్ణమైంది.

"ఇది నా కెలాగ ఉందో నీకు తెలీదు రామారావ్... మీ ఇద్దరి మధ్యా నేనేదో కలతలు తెచ్చానని అనుకోరూ ?"

ఆశ్చర్యంతో అతను మాట్లాడలేదు— తల దించుకుని ఆలోచించుకుంటు న్నాడు. తల ఎత్తేసరికి సావిత్రి కళ్ళు ఆర్ద్రాలుగా ఉన్నాయి అతనిగుండె ఒక్కసారి లాగినట్టయింది. అతనినోటిలో మాటలు నోటిలోనే మాయమయాయి

"అదేమీ ఆలోచించుకోలేదు వదినా—నేను వెళ్ళను."

ఆమె కన్నీళ్ళని గురించి అతనేమీ అనలేకపోయాడు. ఆ రోజంతా ఆ దృశ్యం అతన్ని బాధిస్తూనేఉంది చాలాసార్లు. ఆ ఉషస్సులో శ్యామల కళ్ళు అతనికి జ్ఞాపకం వచ్చాయి.

## 4

ఒక్క విషయంమాత్రం అతను గ్రహించుకున్నాడు. సహజంగా తనకీ, అన్నకీ మధ్య వచ్చిన తెరలని సావిత్రి లేకుండా చేయజూస్తుందని.

ఈ క్రొత్త పరిస్థితుల్లో మరో నెల గడిచిపోయింది. ఇంక సెలవులు నెల పూర్తిగాలేవు. ఇంట్లో అంతా మామూలుగా గడిచిపోతూంది.

ఒకనాడు సాయంత్రం రామారావు ఇంట్లోకి రాగానే సావిత్రి అతని గదిదగ్గిరికి వస్తూ 'శ్యామలకి పెళ్ళిట!' అన్నది. అతను ఆశ్చర్యంగా "ఆ!" అన్నాడు. తరువాత విచారించాడు తన భావాలు దాచుకోలేకపోయినందుకు.

"ఈ నెలే—పదిహేడో తారీఖున—రమ్మని ఉత్తరం వ్రాశారు."

సావిత్రి కంఠస్వరం ఆ విషయం ఆమెకి అనిష్టమైనదని స్పష్టంగా సూచిస్తూంది.

"మరేం?—వదినగారికి చిన్న కాంపు!"

సరదాగా అనాలని ప్రయత్నించినా, చివరికి కష్టపడికాని అనలేకపొయ్యాడు.

"నువ్వూ వస్తావా?"

"నేను రాను!!"

"ఏం? దానితో దెబ్బలాడావా?"

రామారావు తనకి తానే ఇరుసులో చిక్కుకున్నాడు. ఏమిటి చెప్పినా వదిన తరిచి తరిచి అడిగేలాగ ఉంది. ఈ రెండు నెలలూ చాలాసార్లామె, తను అంత గూమీగా ఎందుకున్నాడో అడుగుతూంటే తప్పించుకోవడానికి అసత్యాలాడవలసి వచ్చేది...ఇప్పుడు అన్నీ బయటపడతాయి.

అతనేమీ జవాబివ్వలేదు.

"ఇంక అయినవి ఎలాగా అయిపోయాయి. నీకు దాన్ని ఇస్తారని అనుకున్నాను. దరిద్రులు దాని గొంతుక కోశారు. వాళ్ళకి దాని సుఖం అక్కర్లేదు—పాపం!"

సావిత్రి కంఠంలో జాలీ, అసహ్యమూ ప్రతిధ్వనిస్తున్నాయ్. "నేను శ్యామల అంటే పడి చచ్చిపోటం లేదులే" అని రామారావు అందామనుకున్నాడు—కాని, మళ్ళీ ఆ కన్నీటితో శ్యామల జ్ఞాపకం వచ్చింది.

ఇంక ఆ విషయం గురించి ఆ రోజెవరూ మాట్లాడలేదు. కొంచెం ఆలస్యంగా ప్రకాశం ఇంటికి వచ్చేసరికి అతను చాలా సంతోషంగా ఉన్నాడు. ఏదో ఖూనీ కేసులో ముద్దాయి విడుదల అయ్యాడు నిర్దోషిగానని.

ఆ రాత్రి ప్రకాశంకూడా చాలా మౌనంగా ఉన్నాడు. ఉత్తరమే దానికి కారణమని రామారావు తెల్సు-తన రహస్యం అందరికీ తెలిసిపోయింది!

ఇప్పుడు శ్యామల విషయంలో ఆత్మపరీక్షకి అవసరం వచ్చింది రామా




రావుకి - మొదట శ్యామలని చూసేసరికి ఆమె చిలిపితనమూ, చలాకీ చూసి అతను చాలా గొప్పస్థానం ఆమెకిచ్చాడు. గదిలోకి టూత్‌బ్రష్షూ అవీ తెచ్చి నప్పుడు ఆమెలోని హృదయవైశాల్యతని చూచాడు. అప్పుడే ఆమె పూర్తి సౌందర్యం కూడా చూశాడు. తరువాత బీచిలో...అక్కడ అతను గట్టిదెబ్బ తిన్నాడు. హాస్యంలోకూడా ఆమె తన మోటుతనం సహించలేకపోయింది... చివరికి ఆమె వెళ్ళిపోతూ తనతో అన్నమాటలు...ఆమె కన్నీళ్ళు-వీటికి అర్థం ఏమిటి?

ఔను. ఆమె తనని ఋజుమార్గంలో పెట్టజూసింది. తా నపార్థం చేసుకున్నాడు. చివరికి ఆమె అంటే తాను అసహ్యం నటించాడు. ఆమె సహించలేకపోయింది...

తన చేతులనుంచి జారాక శ్యామల ఔన్నత్యం అతనికి మరీబాగా కనిపిస్తోంది. కాని, ఈ సంఘటనకి తనకేమీ పూచీలేదు. జరిగినదంతా తన కతీతంగానే జరిగిపోయింది.

కాని, ఇప్పుడు తన కోపం ఎవరిమీద?

శ్యామల ఎలాగా అమాయకురాలే. దీనికి బాధ్యులైన వాళ్ళామె తల్లిదండ్రులు. వాళ్ళు మాత్రం పెళ్ళికొడుకులని కలగంటారా? వదిన ఉద్దేశం వాళ్ళు కలగనాలనేగా?

"నాది చాలా దురదృష్ట జాతకం కాబోలు!" అనుకున్నాడు రామారావు. సిగరెట్టు ముట్టించాడు ఈ ఆలోచనలని పూర్తి చెయ్యడానికి.

చివరికి శ్యామల పెళ్ళికి వెళ్ళక తప్పలేదతనికి. తాను బయల్దేరకపోతే

వాళ్ళిద్దరూ బయలుదేరమన్నారు. అదీగాక ఈ విధంగా తాను సాధించేదీ ఏమీ లేదు!

తాను అక్కడికి వెళ్లినా, ముహూర్త సమయంలో పెళ్లిపందిరిలో ఉండక పోవడం అతను జాగ్రత్తగా ఏర్పరచుకున్నాడు. అక్కడికి విడిది ఫర్లాంగుపైన ఉంది. తోట మధ్య మేడ. అక్కడికివచ్చి కూర్చున్నాడు.

ఉదయం ముహూర్తం అయిపోయింది. మధ్యాహ్నం పెళ్లివారింటికి అతను వెళ్ళక తప్పలేదు. వధూవరులు బంతులాట ఆడుతున్నారు.

శ్యామల రామారావు రాగానే ఒక్కసారి తలఎత్తి చూస్తుందని అతననుకున్నాడు. కాని, మొగ్గలు తొడిగిన సిగ్గుతో, సంతృప్తి ఒలికించే అందమైన కళ్లు దించుకుని సస్మితవదనం సరాగాలాడుతోన్న పూబంతివైపు తిప్పీ తిప్పకుండా, జీవిస్తున్న కళావృష్టిలాగ వుంది శ్యామల. ఆమె దృష్టి చేస్తూన్న పనినుంచి మరలలేదు.

కొంచెంసేపు వుండి వెళ్లిపోతూ మళ్లా ఆ దారినే వచ్చాడు రామారావు. అప్పటికి సావిత్రి శ్యామలతో ఏదో పరియాచకం ఆడుతోంది. ఒక్కసారి ఆమె కళ్లూ అతనికళ్లూ కలుసుకున్నాయి. ఏదో నేరం చేసినట్లు అతను తలదించుకున్నాడు -శ్యామల మాత్రం మామూలుగా ఉండిపోగలిగింది. అక్కడి రాటనో రాయినో మాత్రమే చూసినట్లు, ఈ క్షణాన్ని మగవాడిలాగ ఎదుర్కొనేందుకు రామారావు చేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలాలయ్యాయి ఇంకొకసారి రామారావు ఓడిపోయాడు.

పెళ్లివారి ఇంటినుంచి సరాసరి షికారుకని బయల్దేరాడు రామారావు గడిచిన క్షణం అతన్ని వెంటాడుతోంది. నిర్మానుష్యంగా ఉన్న చోటులకు కరువులేదు అక్కడ. ఒక దగ్గరికిపోయి కూర్చున్నాడు.

అతను ఆలోచనల్లో సాగిపోతూండగా ఇంకొక యువకుడు అటేవస్తూ అతన్ని పలకరించాడు, ''మీరు పెళ్లికి వచ్చినవారే కదూ?" అని.

ఆ యువకుడు చక్కని ఆకారంతో చూడగానే రామారావుకి మంచి ఉద్దేశం కలిగించాడు.

''ఔనండీ-మీ కెలా తెలుసు?" అన్నాడతను

"నేనూ అందుకే వచ్చానులెండి. పెళ్లికొడుకు నా మిత్రుడే. అతని తరపునే వచ్చాను కూడా."

"ఓహో! రమణమూర్తి మీ స్నేహితుడా? కూర్చోండి."

ఇద్దరూ సంభాషణకి ఉపక్రమించారు వేణుగోపాల్ మొదట దరిద్ర భారతంలో వివాహం ఖర్చు లింతింత ఉండటాన్ని గురించి లెక్చర్ చేశాడు. పాశ్చాత్యదేశాల వివాహ సంప్రదాయాలని గురించి అతను చాలా మంచి మాటలలో చెప్పాడు. చివరికి వధూవరుల గురించి అక్కడా ఇక్కడా విభేదాలు చెప్తూ వేణు నిజం చెప్పాలంటే ఈ పెళ్లి రమణమూర్తికిఇష్టంలేనేలేదు' అన్నాడు.

రామారావు తృళ్లిపడ్డాడు వేణు అది గమనించలేదు అది తెలిసి కొంచెం కుదుటపడ్డాడు

"వాళ్ల ఫాదర్ ప్రెస్ చేశాడు. ఈ సంబంధం వద్దని పీడి వాదన. కారణం చెప్పడు. చివరికి ఇలాగ—పాపం! ఆ అమ్మాయి గొంతుక కోస్తాడు కాబోలు!"

ఎలాగో సంభాషణ ఇంకో విషయంమీదికి మరలేసరికి రామారావు కొంచెం తేలికపడ్డాడు. వేణు తన స్టడీస్ గురించి చెప్తూ, ఇంటర్ అయ్యాక వాల్తేరులోనే డిగ్రీ చదవాలని ఉందన్నాడు.

'చాలా బాగుంది. మీరు ఎకనమిక్స్ తీసుకోండి. మంచి ప్రాస్పెక్ట్స్ ఉంటాయి" అన్నాడు రామారావు.

తరవాత వాళ్ళు ఎకనమిక్స్ మంచి చెడ్డలని చాలా విపులంగా చర్చించారు. చివరికి వేణు భవిష్యత్తు నిర్ణయం ఐపోయింది. రిజల్ట్సు రాగానే అప్లయి చెయ్య డానికి నిశ్చయించుకుని వేణు, రామారావు లేచారు; ఒకళ్ళ అడ్రస్ ఒకరు తీసుకున్నారు.

ఆ రాత్రి రామారావు వేణుని పదేపదే జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. అతని చక్కని సంభాషణ తీరూ, దైహిక సౌందర్యమూ అతని మనస్సున నాటి పోయాయి.

"మంచి మిత్రుణ్ని ఈ రోజు కలుసుకున్నాను" అనుకున్నాడు రాత్రి నిద్ర పోబోతూ రామారావు.

## 5

వదినతో వాదించడం రామారావుకి శక్తికిమించిన పని. ఆమెలోని ఏ శక్తి అతన్ని అంత విధేయుడుగా చేసిందో కష్టంతోనైనా అతను గ్రహించలేక పోయాడు, సామాన్యంగా అతనికి యిష్టమైనదాన్ని ఆమె చెప్పేదేకాదు! ఒకవేళ చెప్పినా రామారావు తన అయిష్టతని తెలియజేసేవాడూ కాదు.

అలాటి ప్రవర్తనకి ఒక్కనాడుమాత్రం రామారావు మార్పుతెచ్చాడు. ఆనాడు అతను గదిలో కూర్చుని ఖాళీగా ఆలోచిస్తున్నాడు.

ప్రకాశం ఆఫీసుకు వెళ్లిపోయాక సావిత్రి అతని గదిలోకివస్తూ,

"ఏమిటి రామారావ్ ఆలోచిస్తున్నావ్?" అని అడిగింది ఒక కుర్చీలో కూర్చుంటూ.

"ఏమిటుంది వదినా? సెలవులు వస్తున్నయ్. ఒక్క పుస్తకమైనా చదవలేదు. అంతపని నెత్తిమీద వేసుకువచ్చానూ అని."

సావిత్రి నవ్వుతూ "ఇంకేమిటి చదువులే – బెంగలో పడిపోయావు." అంది.

"ఎందుకు బెంగ?"

"పెళ్లికోసం."

ఇంకా నవ్వుతూంది సావిత్రి రామారావుకి నవ్వు వచ్చింది. గడిచిన రోజుల్లో తన ప్రవర్తన ఎవరికేనా విరహంలో పడినట్లే సూచిస్తుందని అతననుకున్నాడు. అయితే విరహం ఎవరికోసం?

ఇంతట్లో ఒక్కసారి నవ్వు ఆపి "నీ పెళ్లి ఈ యేడు చేస్తాము" అంది– సగం హాస్యం సగం సీరియస్‌నెస్‌తో.

"ఇప్పుడు పెళ్ళే తక్కువైంది...అవతల పరీక్ష ప్యాస్ అవకపోతే పెద్ద పెళ్ళి అవుతుంది"

"అదంతా నరేలే–నేను నిజంగా చెప్తున్నాను. మీఅన్నయ్యకి ఎలాగా బాధ్యత తప్పదుగా? చక్కటి పిల్లని వెదికి కట్టేస్తాం."

మళ్లా సావిత్రి నవ్వుతూంది. రామారావు సమాధానం ఇవ్వడానికి వీలులేక పోయింది.

"మా చెల్లెలు వస్తే అప్పుడు మమ్మల్ని మరిచిపోతావుకదూ రామారావ్? నన్ను కాకపోతే మీ అన్న ముఖంచూసి ఐనా కాస్త ఆలోచిస్తావా?"

ఆ మాటలు పూర్తిగా వేళాకోళం కాదని రామారావుకి ఆమె కంఠస్వరమే చెప్తూంది.

"పెళ్లిచేసుకుంటే విడిపోక తప్పదా వదినా?"

"నువ్వేం చేస్తావు పాపం? మా చెల్లెలుఐట్టి ఉంటుంది."

అర్థమైనట్లు చూశాడు రామారావు.

"సర్లే –ఎవరన్నా వింటే నవ్విపోతారు. ఆలూ లేదు చూలూ, లేదు. కొడుకు పేరు సోమలింగడు అన్నట్లు. ఇదంతా పెళ్ళి అయాకగా? అప్పుడు ఆలోచిద్దాం."

రామారావు ఇంక నిశ్శబ్దంగా ఉండిపోలేక పోయాడు. "ఈ రెండేళ్లూ అయే దాకా పెళ్లిమాట ఎత్తవద్దు వదినా."



మళ్ళా ఆమె నవ్వుతూంది తను చెప్పే విషయంలో గాంభీర్యం ఉందని అతను చూపలేకపోతున్నాడు.

"ఆలోచిద్దాంలే."

సావిత్రి వెళ్ళిపోయింది. రామారావు సిగరెట్టు ముట్టించాడు.

మూడునెలల సెలవులూ అయిపోయాయి. ప్రయాణానికి అన్నీ సిద్ధంచేసుకున్నాడు రామారావు. ఈ మూడుమాసాలలోనూ అతని జీవితంలో కలిగిన మార్పులు ఒకసారి అతన్ని ప్రయాణానికి విముఖుడిగానూ, మరొకసారి పూర్తిగా సుముఖుడిగానూ చేస్తున్నాయి. మళ్ళా హోటలు భోజనమూ, ఒంటరి జీవితమూ గడపాలనే విషయం అతనికి కష్టంగానే ఉన్నది.

కాని, ఆ ఇంటిలో ఎలాగో తాను ప్రాముఖ్యతలో తగ్గాననే విషయమూ, తన పోయిన స్వేచ్ఛా అతనికి కాలేజీలో ఎక్కువ సౌఖ్యాన్ని చూపిస్తున్నాయి. ముఖ్యంగా స్నేహితులు.

రేపు బయలుదేరుతాననేసరికి మాత్రం రామారావు మనస్సు కొంత బరువ

యింది. ఇంతకుముందు వెళ్లిపోయే ఉదయాన్న కూడా కష్టంగా ఉండేదికాదు. అప్పుడిలాటి ప్రయాణాలవి చాలా అలవాటుగా చెయ్యగలిగేవాడు - కాని యీనాడు కొత్త బంధుత్వాలు అతనిని బంధిస్తున్నాయి. అభిమానంతో తన మంచిచెడ్డలు చూసే వదినకి దూరమవడం అతనికి చాలా కష్టంగా ఉన్నది.

"ప్రయాణానికన్నీ సిద్ధంచేసుకున్నావా?"

హోల్డాలూ, సూట్ కేసూ, కాంప్‌కాటూ ప్రయాణానికి సిద్ధమైనాయ్. వాటిని చూస్తూనే వదిన అడిగింది - వాటిని చూస్తూనే రామారావు "మరి, రేపు వెళ్ళాలిగా'' అన్నాడు.

"వెళ్లాక కాస్త వదినని కూడా జ్ఞాపకం పెట్టుకో అమ్మా - పూర్తిగా మర్చిపోక."

"ఎందుకు మరిచిపోతాను వదినా?"

కొద్ది క్షణాలామె మాట్లాడలేదు - పరీక్షగా ప్రయాణపు సామానులవైపే చూస్తూంది. విషయాలు కూడా ఇవ్వని వ్యథని కొన్నిసార్లు వాటి సూచన లిస్తాయి - సావిత్రి కళ్ళు ఆ విషయాన్ని చెప్తున్నాయి.

తరువాత తలవంచుకునే, ఒక్కసారిగా వచ్చిన గాంభీర్యంతో, "ఈ మూడు నెలలూ అలవాటైపోయింది - ఇంక ఒక్కర్తినే ఉండటమంటే బెంగగానే ఉంది...కాని, సెలవులివ్వగానే వస్తావుగా?"

సావిత్రినుంచి ఈ మాట అతనెప్పుడూ వస్తాయనుకోలేదు. ఆమె ముఖంలో కనిపిస్తూన్న బెంగ అతన్ని కలవరపెట్టింది.

"తప్పక వస్తాను."

సావిత్రి వెళ్లిపోయింది - రామారావు హృదయానికి తన గుండెల బరువు తెలిసింది.

మరునాడు ఉదయం ప్రయాణం. ప్రకాశం స్టేషనుదాకా వస్తానన్నాడు. కాని రామారావు దానియ్యలేదు. వీధిగేటు దాటేదాకా మాత్రం ప్రకాశం వచ్చాడు. బండి కదిలింది - వెనక్కి తిరిగిచూసిన రామారావు. గుమ్మంలోకి మళ్ళుతూ కళ్ళు తుడుచుకున్న సావిత్రిని చూశాడు. తన కళ్ళు చెమర్చుతాయనుకున్నాడు -కాని ఆ ప్రమాదం రాకముందే అతను స్టేషనుచేరి, మరో ఆలోచనల్లో పడిపోయాడు.

## 6

విశాఖపట్నం చేరేసరికి లాడ్జిమాట సమస్య అంది రామారావుకి. హోటల్లో సామాన్లు పెట్టించాడు. లాడ్జిదొరికేదాకా అక్కడే ఉందామని.

సాయంత్రం ఊళ్ళో తిరుగుతూంటే హటాత్తుగా వేణు కనిపించాడు. ఒక్కసారి ఇద్దరూ ఆశ్చర్యపడ్డారు - అనుకోని తమ కలయికకి. ఏ రోజున వస్తానో తెలీదని రాశాడు వేణు.

"ఎక్కడికి వెళ్తున్నారు?" అన్నాడు వేణు.

"ఇల్లుకోసం - మీరు ఇల్లు చూసుకున్నారా?''

"మహారాణీపేటలో వారం క్రిందటే తీసుకున్నాను లెండి ఆ ఎదురుగానే ఒక గది ఖాళీ ఉంది. మీరు తీసుకోవచ్చు."

ఇద్దరూ సరాసరి ఆ ఇంటికి వెళ్ళారు. పైన ఎవరో వృద్ధురాలు కూర్చుని ఉంది. ఇంటికోసం వచ్చామని చెప్పారు.

ఇల్లు చాలా చిన్నది - అయితే మేడగది మాత్రం విశాలంగానే ఉంది. తూర్పుకి సముద్రమూ, మిగిలినవైపు ఆవరణ దాటాక ఇళ్లూ కనిపిస్తున్నాయి.

ఆమె ఉంటూన్నవాటా కాక, ఖాళీగా వున్నది ఆ గది ఒక్కటే. చాలా మంది అడిగినా ఆమె ఇవ్వలేదట.

వృద్ధురాలు రామారావు వృత్తాంతం అంతా అడిగాక ఇరవై రూపాయలు అద్దె అని చెప్పింది. రామారావు అడ్వాన్సు ఇచ్చి తాళం తీసుకున్నాడు

"మీరు ఇంటికి వెళ్ళండి -నేను హోటలుకిపోయి సామాను తెచ్చుకుంటాను." అన్నాడు, రామారావు. తమ నూతన పరిచయం మనస్సులో పెట్టుకుని. వేణు అంగీకరించక, "నేను వెళ్లి చేసేదేముంది? పదండి" అన్నాడు.

సామాను తెచ్చాక అది సర్దడంలో వేణు చేయగలిగినదంతా చేశాడు. రాత్రి భోజనానికి హోటలుకి వెళ్ళనివ్వక రామారావుని తన ఇంటికి తీసుకువెళ్ళాడు - "రేపట్నించి మీ కెలాగా హోటలు భోజనం తప్పదుగా?'' అంటూ.

ఆ సంధ్యాసమయంలో మొట్టమొదట రామారావు వేణు ఇంటి గుమ్మం త్రొక్కాడు. గుమ్మం దాటగానే సావడిలో కూర్చుని చదువుకుంటూన్న అమ్మాయిలేచి, ''రండి" అన్నది. ఆమె ప్రవర్తన రామారావుకి చాలా ఆశ్చర్యమే కలిగించింది.

"చెల్లెలు పద్మ" అని పరస్పరం రామారావునీ, పద్మనీ పరిచయం చేశాడు వేణు. ''చాలా చదువుకున్నవాళ్లు" అనుకున్నాడు - రామారావు ఆమె కలువు గోరుతనంచూసి.

"మా అన్న మిమ్మల్ని గురించి చెప్పాడండీ. వాడు ఏం చెయ్యాదం అని వేవర్ అవుతూంటే మీరు డిసైడ్ చేశారు" అన్నది పద్మ.

"దానికేముంది లెండి. ఎలాగా తెలిసేదేగా?" అన్నాడు రామారావు. అతని దృష్టి అంతా ఆ అమ్మాయి పోతపోసిన విగ్రహంలాటి దైహిక సౌందర్యంమీదే ఉన్నది.

ఆమె ముందు రామారావులో ఉన్న బిడియమూ, పిరికితనమూ త్వరగా కరిగిపోతున్నాయి. రాత్రి భోజనానంతరం ముగ్గురూ మళ్ళా సంభాషణ ముగించేసరికి వాళ్ళలో ఎవరూ ఎవరికీ దూరంగా ఉండిపోలేదు.

మర్నాడూ, ఆ మరునాడూ రామారావుకి మిత్రుల పునస్సమాగమంతో అయిపోయింది. వేణు చేరాడు. అతనూ తన స్నేహితులని పరిచయం చేసుకున్నాడు.

వారం రోజులు గడిచేసరికి రామారావు ఇంటిపట్టున రోజులో కొంచెంసేపైనా ఉండగలిగాడు.

ఒకనాడతను నిద్రలేచేసరికి, గదిలో ఎవరో పాపాయి తన జోళ్ళతో ఆడుకుంటున్నాడు. బొద్దుగా, చూడడానికి ముద్దొస్తూన్న వాడిని ఒక్కసారి చూడడం అతని ఆశ్చర్యం మేరలేక పోయింది. 'ఇంటివారి పాపాయి' అనుకున్నాడు.

వాణ్ణి తీసి మంచంమీద కూర్చోపెట్టి—"ఎవరమ్మా నువ్వు?" అన్నాడు రామారావు నవ్వుతూ. వాడూ అర్థమైనట్లు నవ్వుతూ చూశాడు. రెండు నిముషాలు వాడితో ఆడుకునేసరికి, తొందరగా ఒకామె అతని గదిలోనికి వచ్చి అతన్ని చూసి తెల్లబోయి నిలబడి, "ఇక్కడ ఉన్నావు? ఇల్లంతా వెతికాను" అన్నది— కొంచెం సిగ్గుగా.

ఆమె వాడి తల్లి అని అతననుకోలేకపోయాడు. కాని, ఆమె ముఖంలో ప్రతిఫలిస్తూన్న ఆత్రుతా, ఆ సంతసమూ అతనికి అనుమానం తగ్గిస్తున్నాయి.

"లేచేసరికి ఆడుకుంటున్నాడు ఇక్కడ" అని మాత్రం అని అతను లేచాడు మంచంమీదనుంచి.

ఆమె వాడిని తీసుకుంది. తొందరగా దిగి వెళ్ళిపోయింది. ఇంతట్లో ఇంటి ఆవిడ అతని గదిలోకి వస్తూ "నీ గదిలోను బాబూ వచ్చాడు? దాని మతి పోయింధి" అన్నది.

"ఔనండీ" అన్నాడు రామారావు.

"నీకేమైనా అవసరం ఉంటే నన్ను అడుగుతూ వుండూ బాబూ—కొడుకులాటి వాడివి, ఏదో అద్దె ఇల్లనుకోకు." అన్న దామె.

ఈ భాషణ అతని కేమీ బోధపడలేదు. ఒక్కసా రామెకి తనమీద ఇంత అవ్యాజమైన ప్రేమ ఎందుకో?

"అలాగే నండీ" అనిమాత్రం అనగలిగాడు.

"నాకూ ఈ పిల్ల ఒక్కతేను. వాడు మనమడు... అది చచ్చిపోయి రెండేళ్ళయింది నాయినా. ఇది కళ్ళల్లో వత్తులుపెట్టుకుని పెంచుతూంది. అల్లుడికి ఏమీ అక్కరలేకపోయె..."

అతను జవాబు చెప్పేలోగా ఆమె వెళ్ళిపోయింది. ఆ సాయంత్రానికి అ అమ్మాయి పార్వతి అనీ, పాపాయి హరి అనీ, తెలిసింది రామారావుకి.

ఆ రాత్రి మామూలుగా ఏడుగంటలకి ఇంటికి వచ్చేసరికి వరండాలో పార్వతి కూర్చుని ఏదో చదువుతూంది. పాపాయి చాపమీద కూర్చుని ఆడుతూ, రామారావుని చూసి, తొందరగా పాకివచ్చాడు దగ్గరికి. చేతులు చాచి, వాణ్ని ఎత్తుకుని మీదికి తీసికెళ్ళాడు రామారావు. అతనికి తెలియనిది ఏమిటంటే, ఎన్నో నాళ్ళ సహవాసం ఉన్నట్లు హరి తన దగ్గరికి రావటానికి కారణం!

కొంచెంసేపు పోయేదాకా ఆడుకున్నారు రామారావూ, హరిని. ఇంతట్లో మెట్ల మొదట నిలబడి, "వస్తావా హరీ. నిద్రపోదూ గాని" అని పార్వతి కేక పెట్టింది.

హరి కేక వచ్చినవైపు కళ్ళు పెద్దవిచేసి చూశాడు. "వెళ్తావా!" అన్నాడు రామారావు. వాడు నవ్వాడు. ఎత్తుకుని పార్వతికి ఇచ్చిరావడానికి క్రిందికి వెళ్ళాడు రామారావు. నాలుగు మెట్లు మీదికి వచ్చి తీసుకుంది పార్వతి వాడిని.

మర్నాడు ఉదయం టూత్‌బ్రష్ నోట్లో ఉంచుకుని దిగుతూంటే పార్వతి చంకన ఉన్న హరి దిగి అతనిదగ్గరికి పరిగెత్తాడు. అది ఇంక అలవాటు అయిపోయింది.

నాలుగు రోజులు పోయాక వేణు ఒక మధ్యాహ్నం రామారావు గదిలోకి వస్తూ, అతని చేతిలో ఒక ఇన్విటేషన్‌కార్డు ఉంచి "రేపు సాయంత్రం సరాసరి థియేటరుకే రండి. సీట్లు ఖాళీ ఉంచుతాను" అన్నాడు.

ఆ కార్డుమీద ఒక నాట్య భంగిమలో పద్మ ఫోటో ఉంది. మర్నాడు సాయంత్రం ఆమె నృత్యం.

తృళ్ళిపడినట్లయాడు రామారావు. జీవితంలో అలాటి షాక్స్ అతను చాలా తక్కువ తిన్నాడు. ఈ అందాలరాసి నాట్యకర్తె అన్నమాట!

అతని ముఖంలో ఆశ్చర్యాన్ని వేణు చదవగలిగాడు... "సారీ, మీ కింతకు ముందు తెలుసు ననుకున్నాను పద్మ నాట్యప్రదర్శన ప్రోగ్రాములు పత్రికలలో పడుతూనే ఉంటాయి" అన్నాడు.

"అలాగా! చాలా సంతోషం లెండి" అని మాత్రం అనగలిగాడు రామారావు. ఒకసారి వేల ప్రజలముందు గజ్జకట్టి నాట్యం చెయ్యబోయే దృశ్యాన్ని ఊహించు కున్నాక ఈ క్రొత్త విషయం అతను సరిపెట్టుకోగలిగాడు.

కాని, పద్మ అంటే అతనికి వున్న గౌరవం తగ్గినా, తగ్గకపోయినా, కేవలం సాంసారిక జీవనంలో గౌరవంగా బ్రతికిన పద్మకి ఇచ్చే గౌరవం మాత్రం ఈ పద్మకి ఇవ్వలేకపోయాడు.

తరవాత వేణూ, అతనూ కాలేజీ విషయాలు చాలా చర్చించుకున్నారు. ఈ మధ్యన హరి వచ్చి రామారావు వడిలో కూర్చున్నాడు.

"చాలా స్నేహం చేశాడే! ఎవరోయ్!" అన్నాడు సాశ్చర్యంగా వేణు.

"మా యింటామె మనవడులే... తల్లి చచ్చిపోతే పినతల్లి పెంచుతోంది," అన్నాడు.

"పోనీ—మంచి కాలక్షేపం" అన్నాడు నవ్వుతూ వేణు. తానూ నవ్వుతూ వాడి బుగ్గగిల్లుతూ "చాలాను" అన్నాడు రామారావు.

వెళ్ళిపోతూ మెట్లు దిగుతూన్న వేణుకి గుమ్మం ఇవతల పార్వతి ఎదురవ డమూ, అతను ఆగి, ఆమెవేపు ఒక్కసారి చూసి చిరునవ్వుతో వెళ్ళిపోవడమూ పార్వతి కూడా చిరునవ్వుతోనే వచ్చి కుర్చీలో కూర్చోవడమూ మళ్ళా రామా రావుని ఆలోచనలో పడవేశాయి.

మర్నాడల్లా వేణు ఇంటిదగ్గరలేడు. థియేటర్ దగ్గర ఏర్పాట్లు చేసుకుంటు న్నాడు. పద్మ కూడా మూడయేసరికి అక్కడికే వెళ్ళిపోయింది.

సరీగా ఆరుకి రామారావు థియేటర్ దగ్గరికి వెళ్ళాడు. జనం క్రిక్కిరిసి ఉన్నారు. వేణు రామారావుకోసం సీటు రిజర్వు చేశాడు.

"మీ కక్కడ కూర్చోవడంవల్ల బోర్ అయితే లోపలికి రండి" అన్నాడు వేణు. కాని గ్రీన్‌రూమ్ అంటే సహజంగా వున్న అయిష్టంతో రామారావు అక్కడే కూర్చున్నాడు.

నృత్యం ప్రారంభమయింది. ఆర్కెస్ట్రాతో కొంతసేపు పద్మ నృత్యం చేసింది. సంగీతంతో తరంగాలకి ఆమె చక్కగా లయవేస్తోంది. ఆమె వేసు కున్న బట్టలు యౌవనప్రదర్శనకి మాత్రం అనుగుణంగా ఉన్నాయి.

ఒకసారి తదేకదీక్షతో చూస్తూన్న రామారావు కళ్ళు పద్మ కళ్ళని కలుసు కున్నాయి. అతని శరీరంలో విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లుంది. అందులో ఎన్నో




వంతైనా అలజడి పద్మ పొందిఉంటే ఆనాటి ప్రదర్శనం అంతా పాడవుననీ రామారావుకి తెలుసును— ఆమె మామూలుగా నృత్యం చేసుకుని పోతోంది.

తరువాత గోపికానృత్యం చేసింది. ఆమె నటించుతున్న జావళీలు శృంగార రసమయంగా ఉన్నాయి. పాట ఎంత శ్రావ్యంగా ఉన్నదో ఆమె భావ ప్రకటన కూడా అంత చక్కగా ఉంది.

ఒకసారి తనచుట్టూ కలయజూశాడు రామారావు. అందరూ బద్ధశ్వాసలతో చూస్తున్నట్లున్నారు. కొంతమంది కుర్చీల చేతులమీద పాటకి లయవేస్తున్నారు. మరికొంతమంది శిరఃకంపనలతో తమ రసగ్రహణ శక్తిని విదితం చేస్తున్నారు.

అయితే, సభాసదులలో ఎక్కువమంది కళ్ళలో అతనికి కనిపించినది నర్తకి ప్రదర్శిత యౌవనపు సమ్మోహం. అనేక భంగిమలలో ఆమె ప్రేక్షకుల నాకర్షిస్తోంది; అప్పుడల్లా రామారావు గుండెలు ఎవరో లాగుతున్నట్లు - ఏదో తన సొమ్ము పోయినట్లు బాధపడేవాడు.

మధ్యన వేణు అతనికి కాఫీ పంపాడు. నృత్యప్రదర్శన పూర్తి అయ్యేసరికి తొమ్మిది దాటింది.

అప్పుడుమాత్రం గ్రీన్‌రూమ్‌లోకి పోకతప్పలేదు - వేణు వచ్చి తీసుకుని వెళ్ళడం మూలాన్న ఆ సరికి పద్మ మేకప్‌తీసి మామూలుగా తయారై పోయింది.

సుమారు అరడజనుమంది విద్యార్థులూ, పురప్రముఖులూ ఆమెచుట్టూచేరి ఆనాటి నాట్యాన్ని తెగపొగుతున్నారు.

"మీరు భావోద్రేకంతో అంతా అభినయిస్తారు. అది ఎంతో తీవ్రమైన ఎఫెక్ట్ ఇస్తుంది" అన్నాడొక పెద్దమనిషి. ఆయన అక్కడ ఒక డాక్టరని పరిచయం చేశాడు వేణు పద్మకి, రామారావుకి.

మిగిలినవాళ్ళు సుమారు ఆ ఉద్దేశాన్నే కళ, సేవ, ఆదర్శం - మొదలైన చక్కటి మాటలలో కప్పెట్టి వెలువరించారు. దూరంగా ఉండి ఈ పొగడ్తలు వింటూ వింటూ రామారావు మధ్య మధ్య నవ్వుకుంటున్నాడు.

వాళ్ళంతా ఒక పట్టాన వదులుతారని ఎవ్వరూ అనుకోవడంలేదు. పద్మ ధన్యవాదాలకి వాళ్ళు పొంగిపోయి ఇంకా పొగడ్తలని కురిపించుతున్నారు.

చివరికి దిగ్గునలేచి అందరినీ ఉద్దేశించి పద్మ "సెలవు, నమస్తే" అన్నది... అందరూ అర్థంచేసుకుని అప్పటికి వదిలారు.

అందరూ వెళ్ళాక రామారావు దగ్గరకివచ్చి పద్మ "ఎలాగ ఉందండి?" అంది.

"అందరూ చెప్పారుగా? నేను కళారసికుణ్ణి కాదు...నా ఉద్దేశం ప్రకారం అద్భుతంగా ఉంది."

కిలకిలా నవ్వింది పద్మ..."ఈ పొగడ్తలంతటా మామూలేలెండి. కాని, నిర్మొహమాటంగా చెప్పాల్సివస్తే ఈ నృత్యాలకంటె చక్కగా నర్తించేవారు అజ్ఞాతంగా ఎందరో ఉన్నారు- " ఏదో చెప్పబోయి ఆగిపోయింది. రామారావు జవాబేమీ ఇవ్వలేదు.

తరవాత అందరూ కారులో ఇంటికి వచ్చేశారు. రాత్రి రామారావు వేణు ఇంటికి భోజనానికి వెళ్ళాడు. సంభాషణ మధ్య ఆ -నాటి ప్రదర్శనకి అయిదు వందలు వసూలైందని చెప్పాడు వేణు.

అప్పుడుమాత్రం రామారావు దృష్టిలో పార్వతి ఇంకొకమెట్టు ఎక్కింది.

అక్కడ భోజనం అయి అత నింటికి తిరిగివచ్చేసరికి హరి గుక్కపట్టి ఏడుస్తున్నాడు. పార్వతి వాడిని సముదాయించడానికి నానా అవస్థా పడుతోంది.

"ఒకసారి నాకు వాడి నివ్వండి. ఊరుకుంటాడేమో చూస్తా"నని రామారావు వాడిని తీసుకుని తనగదిలోకి వెళ్లాడు. అప్పటికి వాడు శాంతించాడు.

"గంటనుంచి ఒకే ఏడుపు — చంపేశాడండీ. బాగా అలవాటైపోయింది మీ దగ్గర" అంది పార్వతి గుమ్మం దగ్గర నిలబడి.

"ఎక్కడికి వెళ్లావు నాయనా ఈవేళ? హరిని వదిలి వెళ్ళిపోకు ఇంకెప్పుడూ ...తెగ ఏడ్చాడు" అన్నది వృద్ధురాలు.

ఊరుకున్నాడు కదా అని రామారావు వాడిని పార్వతిచేతికి ఇచ్చాడు మరు క్షణం వాడు గుక్కపట్టాడు. వెంటనే మళ్ళా వాడిని రామారావు తీసుకుని... "నిద్రపోయాక తీసుకెళ్దురుగానిలెండి" అన్నాడు గత్యంతరంలేక. పార్వతి "అలాగే లెండి" అని మాత్రం అని కిందికి వెళ్ళిపోయింది.

కిటికీ తెరలుదించి, హరిని మంచంమీద పడుకోపెట్టి కొంచెంసేపు జోకొట్టాక వాడు పడుకున్నాడు. తరవాత వృద్ధురాలు నెమ్మదిగా వాడిని తీసుకుని వెళ్ళి పోయింది.

తన క్రొత్త బంధువుని గురించి ఆలోచనలో పడ్డాడు రామారావు. తనకీ, వాడికీ ఏమిటీ అంతస్సంబంధం? సాయంత్రం నృత్యంలో ఉన్నంతసేపూ వాడిని తాను ఒక్కసారీ తలచుకోలేదు. కాని, నిష్కల్మషంగా తనని ప్రేమించిన ఈ పసివాడైతే తనని మరచిపోలేదు!

నెమ్మదిగా కన్ను మూశాడు - మేను వాల్చి రామారావు. "నీ అధరమాధుర్యమే గ్రోలగ బిరాన..." అంటూ నృత్యం చేస్తూన్న పద్మ కొంతసేపూ, అమాయకంగా, తనని చూడగానే సంతోషం తెచ్చుకున్న హరి కొంతసేపూ అతని కళ్ళల్లో కనుపించి నిద్రని దూరంచేశారు.

మర్నాడు ఉదయం లేచేసరికి రామారావు పక్కన హరి ఉన్నాడు. మంచం ప్రక్కన నిశ్శబ్దంగా ఆడుకుంటున్నవాడిని తీసుకుని, హృదయానికి హత్తు కున్నాడు రామారావు. అప్పుడతననుకున్నాడు తన జీవితంలో కొత్తసమస్య ప్రారంభమయిందని.

## 7

మూడు నెలలు గడిచేసరికి రామారావుకి ఫస్ట్ టరమ్ సెలవు లిచ్చారు. సెలవులిచ్చే వారం ముందే ప్రకాశం అతన్ని రమ్మని వ్రాశాడు. సెలవుల్లో పద్మ డాన్స్ ప్రోగ్రాం ఒకటి బెజవాడలో పడింది. దానికి ఎలాగైనా హాజరు కమ్మని వేణు కోరి, అలాగేనని మాట తీసుకున్నాడు. పద్మకూడా మరీ మరీ చెప్పడాన్ని రామారావు అంగీకరించక తప్పలేదు. ఈ మూడు నెలలలోనూ రామారావు ఆడవాళ్ళతో స్వేచ్ఛగా మాట్లాడడం నేర్చుకున్నాడు. కాని వాళ్ళు మరీ ఎక్కువగా ప్రార్థించిన విషయాలని నిరాకరించడం మాత్రం అతని చేత కాలేదు.

ముఖ్య సమస్య హరితో వచ్చింది. వాడెలాగ ఈ మూడు వారాలూ గడుపు తాడో నని అందరూ బెంగపెట్టుకున్నారు. ఏ బంధాలు జీవితానికి ' వెలుగునీ, విలువనీ ఇస్తాయో అవే తరచుగా మనస్సుకి ఎక్కువ బాధని కలుగజేస్తుంటాయి.

ప్రయాణం మానలేదు. బయలుదేరాడు. గుమ్మందాకా సాగనంపిన పార్వతికీ వృద్ధురాలుకీ కళ్ళల్లో నీరు నిండింది...వాళ్ల కళ్లతో తన కళ్లు కలియకుండా రామారావు చాలా జాగ్రత్తపడ్డాడు. "సెలవలవగానే రా బాబూ —" అని మాత్రం అనగలిదింది వృద్ధురాలు.

ఇంటికి వచ్చేసరికి తెల్లవారింది. రామారావు తా నేతేదీన వచ్చేదీ రాయలేదు. బట్కా దిగుతూనే ఒకసారి నిలబడి ఇల్లంతా కలయజూచాడు...ఏమీ మార్పు కనబడలేదు.

తిన్నగా లోపలికి వెళ్లాడు.

"ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నావా? రాళావుకావేం? రా..." అంటూ ఆప్యాయంగా ఆహ్వానించాడు ప్రకాశం చేస్తూన్న పని వదిలివస్తూ సావిత్రి "నయమే... రావేమో అనుకున్నాము ముఖం కడుక్కో. కాస్త కాఫీ త్రాగుదూగాని" అంది.

అతను ముఖం కడుక్కోవటం ముగించేసరికి ఒకసారి రోజూ అదే సమయంలో తనదగ్గర ఉండే హరి జ్ఞప్తికి వచ్చాడు. ఏదో నిర్మానుష్యమైన దీవిలో పడిపోయినట్లు ఫీలయ్యాడు రామారావు.

ఆనాడంతా రామారావు నిద్రలోనే గడిపాడు.

విశేషాలు లేకుండానే రోజులు గడిచిపోతున్నాయి. హరి జ్ఞప్తులు తప్పిస్తే అతనికి మానసిక సంక్షోభం కలిగించే విషయాలేమీ లేవు. మొదటివారం అయాక, పద్మ ప్రోగ్రాం కోసం విజయవాడ వెళ్తున్నానని చెప్పాడు రామారావు

"ఏమిటి సంగతి?" అంది వదిన.

"ఒక నర్తకి ప్రోగ్రాం ఉందిలే. చూడాలని" అంతకన్న సత్యానికి దగ్గరగా రాలేకపోయాడు.

"నాట్యాలంటే సరదా పుట్టిందా?"

"ఈమధ్య."

"మరి శ్యామలనీ, రమణమూర్తినీ చూసివస్తావా?"

"వాళ్ళక్కడే ఉన్నారా?"




"ఔను. అడ్రస్ తీసికెళ్ళు."

సావిత్రితో తా నలాటిపనేమీ చెయ్యనని చెప్పలేక అతను అడ్రస్ తీసుకుని, రైలెక్కాడు.

రామారావు ప్రయాణం మధ్య రమణమూర్తి ఏదో స్టేషనులో ఎక్కాడు అదే రైలులో - మొదట అతన్ని రామారావు పోల్చుకోలేదు. కాని రమణమూర్తి అతన్ని పలకరించేసరికి రామారావు గుర్తుపట్టగలిగాడు.

"ఎక్కడికి వెళ్తున్నారు?" అన్నాడు యధోచిత ఉపోద్ఘాతం అయ్యాక రమణమూర్తి.

ఉన్న సంగతి చెప్పడం రామారావుకి ఇష్టంలేదు. కాని వేణు అతనితో ఎలాగా చెప్తాడుగదా అని నిజమే చెప్పాడు.

బెజవాడలో దిగేదాకా ఇద్దరూ ఏవో విషయాలు చర్చించుకున్నారు. స్టేషను దాటాక రామారావు థియేటరుకి వెళ్ళి వేణుని కలుసుకోవా లనుకున్నాడు. కాని అలాంటిదేమీ సాగనివ్వనని హామీ యిచ్చాడు మూర్తి. ఎంత యిష్టంలేకపోయినా, మళ్ళా శ్యామలని కలియవలసిరావడం రామారావు కేమీ సంతోషకరంగా లేదు.

సాయంత్రం నాలుగైంది—మూర్తి ఇంటికి ఇద్దరూ చేరేసరికి. గుమ్మంలో అడుగుపెడుతూనే శ్యామలని పెద్దగా పిలిచి "మీ బావ వచ్చాడు...కాస్త కాఫీ ఇస్తావో లేదో ఆలోచించు. నేను ఇప్పుడే వస్తాను" అని చెప్పి అతను ఎక్కడికో వెళ్ళిపోయాడు.

కొద్ది క్షణాలు ఎవరూ మాటలాడలేదు. తరువాత శ్యామలే "చాలా దయ కలిగింది" అన్నది.

ఆమె ఆ మాటలంటూ ఒక్కసారి రెండు కళ్ళతోనూ అతని ముఖంలోకి చూసింది. ఆనాటి తడి కళ్ళు అతనికి ఒక్కసారి జ్ఞాపకం వచ్చాయి.

"నాకు నిజంగా రావాలనిలేదు శ్యామలా...మూర్తి బలవంతంకాకపోతే నేను రాకపోదును."

ఆ మాటల్లో ఉన్న కటుత్వం అతనికి తెలుసును - కాని శ్యామలతో ఆ మాట లనడానికి తను చాలా ప్రయత్నించనక్కర లేకపోయింది. అతనికి తెలియకుండానే ఆమెమీద ఉన్న కోపం ఇప్పుడు బయటికి వస్తోంది.

కాని, ఆమె తిన్నదెబ్బ అతనికి కనిపిస్తూంది.

"నే నంత ద్రోహం చేశానా రామం?"

అప్పుడు రామారావు దృక్పథాన ఆమె బుగ్గమీద ఉండిన గుర్తు కనుపించింది. ఒక్కసారి తప్పుదారిన పడిన సంభాషణకి చుక్కపెట్టి "మూర్తి చేతితో కూడా సరసం చేస్తున్నాడా?" అని అడిగాడు తీవ్రంగా - జాలితోనే.

తన రహస్యం బయటపడ్డాక శ్యామల దుఃఖం ఆగకపోయింది. క్రమంగా, ఆమె ఎంత బలవంతంగా ఆపుకొన్నా, ఆమె కళ్లు ఎర్రబడ్డాయి. పెదవులు చిన్నగా వణకసాగాయి. అతని గుండెలలో మంట పుడుతోంది.

కొద్ది క్షణాలయ్యాక "ఆడవాళ్ళయాక దేనికి సిద్ధంకానక్కరలేదు? అయినా ఇవి సంసారంలో అందరికీ వుండేవేలే" అని అర్థగాద్గదికంగా అని కాఫీ చెయ్యడానికి లోపలికి వెళ్ళింది శ్యామల.

ఇంకా మూర్తి రాలేదు, శ్యామల కాఫీ తెచ్చేసరికి, తల దువ్వుకొని, కొంచెం స్నో ముఖాన రాసుకుని వచ్చింది.

కాఫీ తీసుకుంటూ, "నీకు స్నో ఇందుకు పనికొస్తుందా శ్యామలా?" అన్నాడు రామారావు.

రెండో కప్పులో కాఫీ ఫ్లాస్కులో పోస్తూ..."పోనీలే ఆ సంగతి మరిచిపోవూ?" అన్నది శ్యామల బ్రతిమిలాడుతూన్నట్లు.

"పశువు: చూస్తూ ఎలాగ సహించడం?"

"కొంప ముంచుతావు సుమా! నీ కివన్నీ చెప్పానంటే బ్రతకనక్కర్లేదు."

అతనింక మాట్లాడకుండా కాఫీ త్రాగాడు. శ్యామల నిస్సహాయత అతనికి బల్లెపుపోటులాగ వున్నది.

ఇంతట్లో హడావుడిగా మూర్తి లోపలికి వస్తూ "బట్టలు మార్చుకోవే -



డాన్సుకి వద్దూగాని" అన్నాడు. ఫ్లాస్కులో కాఫీ అతనికిచ్చి శ్యామల లోపలికి వెళ్ళింది – ఆజ్ఞ శిరసావహించడానికి.

థియేటరు దగ్గర వేణు వీళ్ళకోసం కాచుకుని కూర్చున్నాడు. ఇంకా చాలా మంది రాలేదు. వీళ్ళు కుర్చీల్లో కూర్చున్నాక వేణు లోపలికి వెళ్ళిపోయాడు. లేత గులాబీ చీరా, నీలి బ్లౌజూ వేసుకుని శ్యామల అగంతకుల కళ్ళని ఒక్కసారి ఆకర్షించుతూంది. ఆ రూపం, ఆమె మనస్సూ సరిపోల్చుకుని బాధపడుతున్నాడు రామారావు. వేణూ, మూర్తీ, రామారావు ఏదో సంభాషణ జరుపుతున్నారు. మధ్యన లేచి, "మీరు ఉండండి – పావుగంటలో వస్తాను" అని మూర్తి బయటికి వెళ్లాడు. కర్టెన్స్ మధ్య ఖాళీలనుంచి, అతను గ్రీన్ రూమ్‌కి వెళ్లాడని తెలుసుకున్నాడు రామారావు.

"ఆయనకి పద్మ ఉంటే చాలు" అంది శ్యామల వెక్కిరిస్తోన్నట్లు చిరునవ్వుతో. ఆ చిరునవ్వుచాటున దాగిన కన్నీళ్లెరిగిన రామారావు "తెలిసింది"

అన్నాడు. తాను అప్పుడే వెళ్ళి అతన్ని పట్టుకుని నాలుగూ దులిపేద్దామని అనుకున్నాడు. కాని ఆలోచించి ఆ ప్రయత్నం మానేశాడు.

"అసలు నిన్నెందుకని కొడతాడు శ్యామలా?"

"ఏమీలేదు. ఏదో చిన్న కారణం కనిపిస్తూనే వుంటుంది ప్రొద్దుట రైలు టైముకి ఆయన ఎక్కడో పెట్టిన కాగితాలు కనబడలేదు - అందరూ వింటారు కూడా, ఇంక అదేమీ అడగకు రామారావ్."

* * *

"శ్యామల బాగా ఆదరించిందా, రావుగారూ?'' రైలులో అతని ప్రక్కనే కూర్చుని తీరుబాటుగా అడిగింది పద్మ.

"మీరు శ్యామలను అంత బాగా ఎరుగుదురా? మూర్తిగారినే అనుకుంటున్నాను."

"ఆయనని తెలిశాక ఆవిడే తెలియదా? ఆయన ఎప్పుడూ పరిచయం చెయ్యరనుకోండి— అయినా......" నవ్వుతో వాక్యం పూర్తయింది.

"శ్యామలని మీరు ఒక్క నిమిషం కలుసుకుంటే అంత తేలికగా ఆమెని చూడరు." అనుకోకుండా రామారావు మాటలో గాంభీర్యత వచ్చింది. పద్మ దెబ్బ తిన్నది.

"క్షమించండి... రాత్రి విజయంతో అంతగా ఒళ్ళు మరచిపోయాను. నేనామెని అవమానిద్దామని ఏమీ అనుకోలేదు."

కిటికీలోంచి ఆమె బయటికి చూస్తూ అన్నది.

"మీరేమీ నేరం చేశారని నేను అనడంలేదు. మీకు తెలియని ఒక్క విషయం మాత్రం చెప్పదలచుకున్నాను. శ్యామల బుగ్గమీద గుర్తులు చూస్తే నేను చెప్పే దానికి సాక్ష్యం వుండును."

"శ్యామలని—కొట్టాడనా అంటారు?"

"అక్షరాలా.''

రామారావు తన స్టేషనులో దిగిపోయేదాకా పద్మ ఏమీ మాటలాడలేదు. స్టేషన్‌లో దిగాక అతను పద్మతో "ఉన్నవిషయం చెప్పక దాచలేకపోయాను. మీ సంతోషం పాడుచేశాను. క్షమించండి" అన్నాడు.

''మీరు గొప్ప ఉపకారం చేశారు" అనిమాత్రం అనగలిగింది పద్మ. రైలు సాగిపోయింది తన మిగిలిన ప్రయాణంకోసం.

బెజవాడనుంచి ఇంటికి తిరిగి వచ్చాక జరిగిన సంఘటన రామారావుని కొన్ని

విషయాలలో వాస్తవిక జగత్తుకి తీసుకువచ్చింది. మామూలుగా సావిత్రి మెడలో ఉన్న చంద్రహారం కనపడక, "హారం పెట్టుకోలేదేం వదినా?" అన్నాడు.

"ఇంట్లో అస్తమానం ఎందుకు?" అన్నది సావిత్రి. ఆ జవాబులో ఏదో దాచుతూందని ఎందుకో రామారావుకి అనుమానం తట్టింది.

"నిజమేనా?" అన్నాడు.

నవ్వుతూ, "ఈ మధ్య నీతో అందరూ అబద్ధాలాడుతున్నారా యేం?" అంది వదిన.

కాని రామారావు చంద్రహారాన్ని చూడాలని పట్టుపట్టాడు. చివరికి, "కంసాలి దగ్గర ఉంది" అందామె.

"అన్నయ్యని అడుగుతాను" అన్నాడు—అలాగ తప్పక నిజం వస్తుందని. అక్కడ సావిత్రి లొంగి, "అలాంటి పనేమీ చెయ్యకు" అంది.

రామారావుకి తమ యదార్థపరిస్థితి కొంచెం బోధపడింది. ఒక్కసారి అన్న చేసిన పని— వదిన హారం తాకట్టుపెట్టడం... అతనికి చాలా నీచమైనదిగా కనిపించింది. కాని, అదంతా తనకోసమే! నెలకి నూటయాభై పంపడానికి రెండువందల యాభైయ్యో, మూడు వందలో వచ్చే ప్రాక్టీసు చాలదనే విషయం ఆ లా విద్యార్థికి కొత్తగా తెలియవచ్చింది. ఆ నాడంతా అతనికి ముళ్ళమీద ఉన్నట్లుంది.

శ్యామల పరిస్థితి అత నున్నదున్నట్లు చెప్పాడు. సావిత్రి కంటనీరు పెట్టుకున్నది... "దాన్ని రాక్షసుడి చేతిలో పెడతారని అనుకుంటూనే వున్నాను. ఎంత చిలిపిదో అంతకీ అనుభవిస్తోంది" అందామె.

మిగిలిన రెండురోజులూ అయాక, మళ్లా ప్రయాణంకట్టాడు రామారావు. "ఈ నెలనుంచి నూరుకంటె పంపకు" అన్నాడు ప్రకాశంతో.

"ఏం?"

"అంత అవసరం లేదు."

"సరేలే."

తరవాత సావిత్రి అతన్ని సాగనంపుతూ, "ఈ కొద్దికాలం నువ్వెంత బాధ పడాల్సిన అవసరం ఏమిటి? బంగారం నాలుగు చేతులు మారినా విలువలో చాలా తగ్గదుగా?" అన్నది.

## 8

రామారావు ఇంటినుంచి తిరిగి వస్తూనే గుమ్మం ఎక్కి గట్టిగా "హరీ!" అని పిలిచాడు, పైన ఎవరూ కనపడక. హరి లోనుంచి వచ్చాడు. అతను కంట

పడగానే పరుగునవచ్చి చంక ఎక్కాడు. వాడి స్పర్శ రామారావుకి ఎంతో శాంతి కలుగచేస్తూంది. అతి కష్టంమీద అతను కంటినీరు ఆపుకోగలిగాడు—హరి అంత ఆప్యాయంగా అతన్ని హత్తుకున్నాడు.

ఇంతలో వృద్ధురాలు బైటికివచ్చి కళ్ళకు వత్తుకుంటూ, "ఎంత అల్లరి చేశా డని! ఆ గదివైపు చూపుతూ ఒకే ఏడుపు. ఎందుకొచ్చిందో బాబూ ఈ బంధం! ఎవ రెవరికో ఆ పరాత్పరుడి ఏర్పాటు" అంది.

పార్వతి ఏమీ అనలేదు. కాని ఆమె ముఖంలో అతని పునరాగమనం కలిగించిన సంతోషం స్పష్టంగా కనిపిస్తోంది. తాళం తీసి, మీదికి వెళ్ళి తలుపు తీసింది. అప్పుడు మాత్రం మళ్ళా అలవాటు ప్రకారం హరిని మంచంమీద కూర్చోబెట్టి, తాను తెచ్చిన చాకొలేట్లూ, బిస్కట్లూ వాడికి ఇచ్చి, బట్టలు మార్చుకుని నిట్టూర్పు విడిచాడు రామారావు.

ఆ సాయంత్రం హోటలుకి పోవడానికి తప్పిస్తే రామారావు ఆ రోజంతా బయటికి పోలేదు— హరి అతన్ని వదలలేదు.

మర్నాడు ఉదయం అలవాటుప్రకారం ముఖం కడుక్కుని లుంగీ, చొక్కా వేసుకుని కాఫీకని రామారావు బయలుదేరుతూంటే పార్వతి కాఫీ తెచ్చింది అతని గదిలోకి.

"మీ రెందుకు తెచ్చారు? నేను హోటలుకి వెళ్తానుగా," అన్నాడు రామారావు.

"ఇవాళనుంచి మీరు ఉదయం కాఫీకి హోటలుకి పోవద్దంది అమ్మ" అని, పార్వతి హరిని తీసుకుని క్రిందికి వెళ్ళిపోయింది. కర్తవ్యం ఏమిటో తెలియక కాఫీ త్రాగి కుర్చీలో కూలబడ్డాడు రామారావు

యూనివర్సిటీకి పోయే టైము తొమ్మిది. అప్పుడు వెళ్ళి భోజనంచేసి బస్సెక్కే అలవాటు రామారావుకి. హరి తొమ్మిదికి పదినిమిషాల ముందు వచ్చి అతన్ని సాగనంపేవాడు.

ఆ రోజు వృద్ధురాలు హరితో కూడా మీదికి వస్తూ... "నీ కొకటి చెప్ప దలచుకున్నాను రామం" అంది చనువుగా.

"చెప్పండి మామ్మగారూ." అన్నాడు రామారావు నిలబడి.

"ఏమీ లేదు. నీకు హోటలు తిండి పడదు... మాకూ చిన్న సంసారమే. పరాత్పరుడు ఏ పూర్వ బంధాలనో ఈ నా డిలాగ మళ్ళా కూడవేశాడు. నీ ఖర్చు తగ్గుతుంది... నా కొడుకుగా నువ్వు నా ఇంట్లోనే భోజనం చెయ్యి నాయనా... కొంత ఖర్చు నువ్వూ పెట్టుకుందూగాని."

రామారావు ఆలోచనలో పడ్డాడు. ఈ పద్ధతిలో ఇంకా ఖర్చులు చాలావరకు తగ్గవచ్చును. హోటలు భోజనం ఎలాగా దరిద్రమే.

వృద్ధురాలి మాట నెగ్గింది. కొంతసేపు వాదించుకుని, చివరికి ప్రతీ నెలా నలభై అయిదు రూపాయలు ఇంటి అద్దెకీ, భోజనానికీ తీసుకోవడానికి అంగీకరించింది.

ఉండిపోయిన టిక్కెట్లు వాడడానికి రామారావు ఆ పూటా హోటల్లోనే భోజనం చేశాడు. గత దినంనుంచీ పద్మనీ, వేణునీ ఒక్కసారీ అతను కలుసుకోలేదనే విషయం పదే పదే జ్ఞప్తికి వచ్చి అతన్ని బాధిస్తోంది... కాని, అంతరంగంలో పద్మ అతనికో రాక్షసిలాగా, వేణు దాని నంటిపెట్టుకున్న పిశాచంలాగా కనిపిస్తున్నారు. అతనికి తెలియకుండానే శ్యామల పరిస్థితికి వీళ్లే కారణం అనే నిర్ణయానికి రావడమే దానికి కారణం.

కాని, బస్సుస్టాండు వేణుకీ, తనకీ ఒక్కటే కావడంమూలాన అక్కడ అతన్ని కలియక తప్పలేదు. వేణు తన మామూలు చిరునవ్వుతో అతని నాహ్వానిస్తూ: "ఎప్పుడు వచ్చారు?" అన్నాడు.

"నిన్నను" ముక్తసరిగా సమాధానం. కాని వేణు వదలలేదు.

"సాయంత్రం అలా రాలేదేం?"

"...నిన్నల్లా హరి వదలలేనిదే!"

"వాణ్ణి తీసుకురాలేకపోయారా? పద్మ ఎన్నిసార్లు అడిగిందంటారు? సాయంత్రం ఏ ట్రిప్‌లో వస్తారు?''

"మూడుం పావుకి."

"నేనూను-సాయంత్రం ఇంటికి వస్తారా? పిక్చర్‌కి పోవాలి."

"ఇంటికి వస్తాను-పిక్చర్ మాట ఆలోచిస్తాగా?"

బస్సు వచ్చింది. ఇద్దరూ ఎక్కారు.

''ఆవేళ మీరు ఫీల్ అయ్యారని చాలా బాధపడింది పద్మ" సంభాషణ వేణు పునఃప్రారంభించాడు.

"అదేం లేదే!"

"వాడు శ్యామలని అలా చూస్తున్నాడంటే దగ్గరికి రానిచ్చేవాళ్ళంకాదు. మిమ్మల్ని పద్మ అడగడం కూడా చాలా మనస్ఫూర్తిగానే!"

ఏ విధంగానూ సంభాషణ సాగించడం అతనికి ఇష్టంలేదు. యూనివర్శిటీ వచ్చేక బస్సు దిగి క్లాసుకి వెడుతూ వేణు మళ్ళా "మరిచిపోకండి" అన్నాడు.

సాయంత్రం వేణు దగ్గరవుండి రామారావుని ఇంటికి తీసుకుని వెళ్ళాడు. పద్మ ఎదుర్కొని, "నమస్తే'' అన్నది.

''నమస్కారం" అని మళ్ళా అని, రామారావు కూర్చున్నాడు. వేణు టీ పట్టుకొచ్చాడు. టీ కప్పు రామారావు ముందరికి తోస్తూ "పూర్తిగా మరిచి పోయారు? లేక-కోపం వచ్చిందా?" అన్నది పద్మ.

"కోపం ఎందుకూ?" ఆ సంగతి అతనికే తెలీదన్నట్లు అడిగాడు.

"ఆవేళ నేనలాగ అన్నందుకు.''

కొంచెంసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

"నిజానికి నేరం నేనే చేశాను పద్మా!"

పద్మ అక్కడ ఉండడమే అతనిచేత ఈ మాటలు అనిపించింది.

పద్మ చిన్నగా నవ్వింది... "అబద్ధం!" అంది గట్టిగా.

''కానేకాదు... శ్యామల పరిస్థితి నా మతి పోగొట్టి అలాగున అన్నాను."

''పొరపాటు పడుతున్నారు రామారావుగారూ! నాకు నాస్తవంగా జరుగు తూన్న కథ తెలీదు. మీ రెలాగ స్నేహితులో రమణమూర్తి అంతే. అత నలాగ చేస్తాడని అనుకోలేదు. మీ రింతగా కోపగించుకుంటారనీ అనుకోలేదు."

"నేనేం కోపగించుకోలేదు..."

అక్కడ వేణు, "ఈ విషయం మానేసి, మరేదైనా విషయం మాటలాడు కుందామా? పిక్చర్‌కి వెళ్ళడం...ఉదాహరణకి" అన్నాడు.

తన కొత్త ఏర్పాటుచెప్పి రామారావు తప్పించుకుందామని చూశాడు. కాని రెండో ఆటకి వెళ్దామన్న వాళ్ళ నిశ్చయాన్ని అత నెదిరించలేకపోయాడు.

ఇంక రామారావు దైనందిన జీవితం ఒక దారిలో పడి, యాంత్రికంగా సాగి పోతూంది. సాయంత్రం కాలేజీనుంచి రాగానే వేణు, పద్మలతో కలిసి షికారు అతని జీవితంలో ఒక భాగం అయింది.

కాని, అతనికి ఒక కొత్త సమస్య బయలుదేరింది... అది వేణు ప్రవర్తన. పద్మకి దాసుడిలాగ అతను నడచుకోవడమేకాదు; అతని ప్రతీ చేష్టలోనూ లోకాన్ని నిర్వికారంగా చూడగలిగే శక్తి కనుపిస్తూంది. గడచిన కాలమంతటి లోనూ వేణు చాలా సీరియస్‌గా ప్రవర్తించడం అతనేనాడూ చూడలేదు. ఎప్పుడూ అదే చిరునవ్వు... అదే నిర్వికారమైన దృక్పథం. అతను పూర్తిగా మూర్ఖుడో, వేదాంతో రామారావుకి బోధపడడంలేదు.

హరి కూడా ఒక యాంత్రిక దైనందిన కార్యక్రమానికి లోబడుతున్నాడు.



రామారావుని ఏ గంటలో కలుసుకోవాలో వాడికి తెలుసు. అత నెప్పుడు ఇంటికి వస్తాడో కూడా తెలుసును. కొంచెం కొంచెం మాట్లాడడం నేర్చుకుంటున్నాడు—"అమ్మా!" "అత్తా."

పార్వతిమాత్రం దూరంగాకాక దగ్గరగాకాక, అలాగే ఉండిపోయింది. హరికోసం ఆమె ఏ కాలంలోనైనా అతని గదిలోకి రాగలదు— ఏ విషయం గురించైనా రామారావుతో మాటలాడుతుంది. కాని, ఆ సంభాషణలో ముక్తసరిగా తెమలడం ముఖ్య లక్షణం.

ఆమెని గురించి అతనేమీ ఉద్దేశం ఏర్పరచుకోలేకపోయాడు. జీవించడం కూడా ఒక పనిలాగ చేస్తుంది. హరి ఆమెకి ప్రాణం. ఏ కొంచెం పరిచయం పార్వతికీ, రామారావుకీ ఉన్నా అది హరి మూలంగానే.

కాలం గడిచిపోతూంది. పద్మ ప్రతీ నృత్యప్రదర్శనకీ రామారావు విధిగా

వెడుతున్నాడు. ప్రత్యేకంగా, ఆ నాటి తన భంగిమని గురించి పద్మ అతని నడగటమూ, అతను మెచ్చుకుంటే సంతసించడమూ ఆమెకి అలవాటైపోయింది.

ఈ పరిచయం ఇలాగ ఉండిపోతుందనే రామారావు అనుకున్నాడు. ఒక సాయంత్రం చీకటిపడుతూండగా అతను వేణుకోసం వాళ్ళ ఇంటికి వెళ్ళాడు. పద్మ వాకిట్లో కుర్చీలో కూర్చుని ఏదో చదువుకుంటున్నది. తలంటుకున్న సౌందర్యం— రామారావు గుండెలో ఆమె నర్తన భంగిమ ఒక్కసారి ఝల్లు మన్నది.

ఒక్కసారి కుర్చీలోంచి లేస్తూ, "దయచెయ్యండి— ఇలాగ కూర్చోండి" అని, పద్మ తొందరగా తన కుర్చీ అతని కిచ్చి తా నింకొక కుర్చీలో కూర్చుంది. ఒక్కసారి ఆమెకి వచ్చిన తొందర రామారావుని ఆశ్చర్యంలో ముంచింది.

"వేణుకోసం వచ్చాను— ఉన్నాడా?"

అతను నిలవబడే అన్నాడు. పద్మ అతనికి మళ్ళా కుర్చీచూపుతూ, ''లేడు—ఎక్కడికో వెళ్ళాడు'' అన్నది.

"మీ చదువుని డిస్టర్బ్ చెయ్యడం ఎందుకు? వెళ్తాను" అని, రామారావు వెనుదిరిగాడు— పోవడానికి.

కొంచెం దెబ్బతిన్నట్టుగా పద్మ అన్నది: ''ఇష్టం లేకపోతే— 'నీతో మాట లాడడం నా ధర్మసూత్రానికి వ్యతిరేకం' అని చెప్పరాదా?"

"అదేమీలేదే? మీరలా అంటే నేను తప్పకుండా ఉండిపోతాను. ఇష్టంలేక పోవడం మాట లేనేలేదు"— నిర్విణ్ణుడై, ఆ కుర్చీలో నెమ్మదిగా కూర్చుంటూ రామారావు అన్నాడు.

కొద్దిక్షణాలు ఎవరూ మాటలాడలేదు. సంభాషణ ఎలాగ సాగించడమో ఆలో చిస్తూన్నాడు రామారావు. ఇంతలో పద్మే ప్రారంభించింది...

"పూర్వం దేవదాసీలు ఉండేవారట—ఇంకా అక్కడా అక్కడా ఉన్నారట. మీ రెవరినైనా చూశారా?"

అతను తెల్లబోయాడు.

"నా కలాంటి వాళ్ళెవరూ తెలీదు."

"నే నలాంటి దాన్నేగా?"

రామారావుని చెళ్ళుమని లెంపకాయ కొడితే అతనంతకన్న ఎక్కువ ఆశ్చర్య పడి ఉండడు.

"పద్మా!" అన్నాడు— బాధగా. "నే నలాటి ఉద్దేశం ఏమీ మనస్సులో పెట్టుకోలేదు."

పద్మ అతని మాటలు విన్నదో లేదో తెలియని విధాన, ఇంటి కప్పువేపు చూస్తూ, బాధిత వాక్కుతో అన్నది...

"అందరి దృష్టిలోనూ,... మీలాటి కులీనుల దృష్టిలోనూ నేనూ ఆ జాతికే చెందినదానిని. నా వృత్తి—నాట్యం. వేల ప్రజల ముందు నా భావాలకీ, వంటికీ రంగు పూసుకుని, వాళ్ళకి కావలసినట్లు ఆడాలి. అదంతా వాళ్ళిచ్చే డబ్బు కోసం...నాకు గౌరవం ఎలాగ వస్తుంది చెప్పండి? నా నాట్యాన్ని అందరూ మెచ్చుకోవచ్చు...మీరూ దాని నద్భుతంగా ఉందని ప్రశంసించవచ్చు. కాని, నా వృత్తిని కూడా ధనార్జన కోసమే చేసే వృత్తులలో సరిగా చూసి, నాకూ ఆ గౌరవం మీ రివ్వగలరా?"

"నాకు మీరంటే పూర్తిగా గౌరవం ఉంది."

"అంతరంగాన్ని వంచించుకుని అబద్ధం ఎందుకాడడం రామారావుగారూ? నా జీవితమార్గం చూసుకుని నేనేమీ విచారించడంలేదు. కాని మీలాటి విద్యాధికులు కూడా నా చుట్టుప్రక్కల కూర్చోడానికి భయపడతారని నా ఆవేదన. ఏ క్షణంలోనైనా నే నీ వృత్తి మానవచ్చును. కావలసినంత డబ్బుఉండనే ఉన్నది. కాని, నేను నా వృత్తి నేమీ గర్హించుకోవడంలేదు."

ఇంక రామారావు తాను మాట్లాడగలిగిన దేమీ లేదని తెలుసుకున్నాడు. నర్తకిగా పద్మమీద తనకి హృదయాంతరాలలో ఎక్కడో ఉన్న చిన్న అగౌరవాన్ని పద్మ ఘనతరం చేసుకుంది...తన ప్రవర్తన ఆనాడు ఆమెఉద్దేశాలకి అనుగుణంగా ఉంది.

పద్మ ఎటూ చూడడం లేదు, శూన్యంలోకి తప్ప. కాని, ఆమె హృదయాంతరాళంలో పనిచేస్తూన్న భావాలన్నీ ఆమె కళ్లద్వారా అతను చదవగలుగుతున్నాడు.

"మీ కాలం వృధాచేశాను, క్షమించండి. పని ఉంటే వెళ్ళిపొండి'' అంది పద్మ.

"క్షమాపణ కోరవలసినది నేను పద్మా! మీ మనసుని ఇంతగా కష్టపెట్టానని నేను ఏనాడూ అనుకోలేదు. నేను పొరపాటు చెయ్యడంవలన ఇంత బాధ పెట్టాల్సి వచ్చింది మిమ్మల్ని."

"అక్కడికి, నా బాధలన్నీ మీకు ఇష్టం లేనట్లు..."

"అక్షరాలా. పద్మా, అందుకే మిమ్మల్ని క్షమాపణ అడుగుతున్నాను."

ఆమె సమాధానం ఇచ్చేలోగా వేణు వచ్చాడు. ''అరే! మీరిక్కడికే వచ్చారా? ఇవాళ ఒక క్లాస్‌మేట్ ఇంటికి వెళ్లాల్సి వచ్చింది. అక్కడే ఆలస్యం అయిపోయింది. పద్మ తిడుతుందని తెలుసును. కాని – మీరు రక్షించారు."

పద్మ నిండుగా నవ్వింది. తీవ్రంగా వర్షం పడ్డాక తీవ్రతరంగా వచ్చే అరుణ కిరణాలలాగ అనిపించింది రామారావుకానవ్వు. ఒక్క నిమిషంముందు కన్నీళ్లకి తావివ్వబోయిన ఈమె – ఎంత విలాసంగా నవ్వుతోంది! అతను ఏదో నిస్సహాయత ఫీలౌతున్నాడు – సిగ్గుపడుతున్నాడు.

"అయనని చాలా సేపట్నుంచి శ్రమపెట్టానులేరా కొంచెం కాఫీ తెస్తాను; కూర్చోండి.''

ఆ రాత్రి పద్మ ప్రవర్తన అతనికి నిద్రపట్టనీయలేదు. ఆమెని దైవంగా ఆరాధించే వాళ్లెంతోమంది ఉన్నారు. 'కులీనులు' కూడా వున్నారు. డాక్టర్ కేశవరావు ఆమె నృత్యాలన్నిటికీ విధిగా హాజరౌతున్నాడు. అవివాహితుడు... విద్యావంతుడు. ఆమెను తను ప్రత్యక్షమూ దేవతలాగ చూసుకుంటున్నాడు.

వీరందరి ప్రవర్తనకీ సంతోషించక పద్మ తనలోని ఆ చిన్న గౌరవభావాన్ని పట్టుకుని ఎందుకిలా బాధపడాలి? నూటికి నూరుగురూ ఈమెను ఆరాధించాలనా?

చిమ్మ చీకటిలో మెరుపులాగా అతనికొక ఆలోచన తట్టింది. "ఆమె నన్ను ప్రేమిస్తోందా?''

## 9

ఒక సాయంత్రం రామారావు ఇంటికి వచ్చేసరికి వృద్ధురాలు ఎవరితోనో మాటలాడుతూంది. ఆ సంభాషణ పద్ధతినిబట్టి వాళ్ళు బంధువు అనిమాత్రం అతను తెలుసుకున్నాడు. అతను తనగదిలోకి వెళ్ళేసరికి హరి పరుగెత్తుకుని వచ్చాడు. మామూలుగా రామారావు మేడమీది మెట్లెక్కుతూ జోళ్ల చప్పుడు చేస్తే హరి వచ్చేవాడు. కాని ఈనాడు వాడు టైము తెలుసుకున్నాడు.

కాఫీకోసం చూశాడు రామారావు. మామూలుగా పార్వతి ఈ టైముకి కాఫీ తెచ్చి ఇచ్చేది. ఈ నాడామెని ఆగంతకుడిని గురించి అడుగుదామని అనుకున్నాడు. కాని, ఆమె అసలు రానేలేదు.

ఏదో పనిలో ఉందని నిశ్చయించుకుని, అతను బయటికి నడిచాడు, హరిని క్రింద విడిచిపెట్టి.




అతను హోటలుకి పోయి కాఫీ తాగాలనుకున్నాడు. కాని, తరువాత ఉద్దేశం మార్చుకుని వేణు ఇంటికే నడిచాడు.

అక్కడ కేశవరావు కూర్చుని వున్నారు. పద్మ మామూలు ఉత్సుకతతోనే రామారావుని ఆహ్వానించింది.

"కాఫీ కావాలా?'' అన్నది. అత నా ప్రశ్న వినడం ఆమె దగ్గర అదే ప్రథమం.

"కావాలి."

వేణు రెండోసారి రామారావునీ, డాక్టరునీ పరిచయంచేశాక, "మా సిస్టర్ మారేజి వుంది. పద్మ ప్రోగ్రాం ఏర్పాటు చేద్దామని వచ్చాను'' అన్నాడాయన.

"అలాగా?" అన్నాడు రామారావు. పెళ్ళికి రామారావుని కూడా ఆహ్వానించాడు డాక్టరు—రామారావు "తప్పకుండా" అన్నాడు. ఇంతట్లో పద్మ కాఫీ తెచ్చి ఇచ్చింది. రామారావు తీసుకుని, "మిగిలినవాళ్ళకో?" అన్నాడు.

"మేము మూడు గంటలనుంచి మాట్లాడుతున్నాం" అంది పద్మ. డాక్టరు గ్రహించలేదు. తన స్నేహితుడి ఫిల్ము కంపెనీలో తాను పెట్టబోయే పెట్టుబడిని గురించి అతను వేణుకి చెప్తున్నాడు.

* * * *

మరొక అరగంటకికాని కేశవరావు సెలవు తీసుకోలేదు. అతను గుమ్మం దాటగానే పద్మ "రెండున్నర గంటలు బోర్—అయిదు వందలు ఇన్‌కమ్'' అన్నది.

అంతా నవ్వుకున్నారు.

"కాని, మీ నాట్యం అంటేమాత్రం చాలా ఇంటరెస్టు అతనికి'' అన్నాడు రామారావు.

''అలాగా?" అన్నది పద్మ చిలిపిగా.

రాత్రి ఇంటికి వెళ్ళేసరికి బంధువు వెళ్లిపోయాడు. కథ అంతా వృద్ధురాలు చెప్పింది. వచ్చిన అతను హరి తండ్రికి మేనమామ. హరి తండ్రి మురారి, పార్వతి అక్క పోయాక, కొంతకాలం గురిలేకుండా తిరిగాడు. కాని, ఇప్పుడు-అనేక సంబంధాలకోసం ప్రయత్నించి విఫలుడయ్యాక— పార్వతిని అడగడానికి అతన్ని పంపించాడు.

"మాకు ఆస్తులేం వున్నాయి నాయనా? కట్నాలు మాత్రం ఎవరికి పొయ్య గలం? ఏదో అయ్యచేతిలో దాన్ని పెట్టాలి. దాని అదృష్టం దానిది. అలాగే నన్నాను" అని బావురున్నది ఆమె...

కాని, పెద్ద వ్యాపారం దివాళా తీసినట్టుంది రామారావుకి. అతను మళ్ళా సందిగ్ధావస్థలో పడ్డాడు.

తానెందుకు పార్వతి వివాహమంటే అంత బాధపడాలి? ఆమెన్నతాను ప్రేమిం చాడా?... ఏమో? కాని, ఈ కొద్ది మాసాలలోనూ ఎందుకో ఆమెమీద అతనికి అనురాగం కలిగింది. మురారిలాంటి నిరుపయోగికి ఆమెని కట్టబెడుతున్నారు. కాని, ఆమె అన్నట్లు కట్నం ?

అత నొక్కసారిగా తాను కట్నం తీసుకుని వివాహం చేసుకోగూడదనే నిర్ణయానికి వచ్చాడు.

కాని, హరి? వాడు పార్వతితో తనని విడిచి ఉంటాడా?

"ఏంరా హరీ? అమ్మతో పోతావా?'' అన్నాడు రామారావు వాడి కళ్లలోకి చూస్తూ. వాడు నవ్వాడు. తన తెలివితక్కువతనానికే నవ్వాడని అనుకున్నా డతను. వాడి విధి వాడు నిర్వర్తించక ఏమిటి చేస్తున్నాడు? తాను సెలవులకి పోతే ఏమిటి చేశాడు?

అతనూ నవ్వుకున్నాడు—ఏరవలేక.

మరి రెండురోజుల్లో పార్వతి పెళ్ళికి ముహూర్తం కూడా పెట్టి ఉత్తరం వ్రాశారు మురారి తరఫున. పార్వతి ఏడ్చింది—రామారావు విన్నాడు కాని, విననట్టే నటించాడు. తా నామెకి చేసే సహాయం ఒక్కటే—ఆ సహాయం తాను చెయ్యలేడు. తన పరిస్థితులు దానికి కుదరవు.

"అందని పండ్లకి అర్రులు సాచితే ఏం లాభమమ్మా? నీ కిది రాశాడు భగవంతుడు. నేనేం చెయ్యగలను?" అన్నది పార్వతితో వృద్ధ-పార్వతి జవాబివ్వ లేదు-ఏడ్చింది. ఆమెకు చేతనైన పని చేసింది.

కారణం తెలియకుండా, రామారావు మాత్రం దోషిలాగ ఫీల్ అవుతున్నాడు. పార్వతి కాఫీ తెచ్చినా, అతను తల ఎత్తకుండా ఉన్నాడు

ఒకనాడు పార్వతీ, తల్లీ, హరీ పెళ్ళివారింటికి బయలుదేరారు. పార్వతి కన్నీళ్ళతోనే గుమ్మం దాటింది. వృద్ధ రామారావును వివాహంనాటికి తప్పకుండా రమ్మన్నది. హరి ప్రయాణపు సందడిలో నవ్వుతూ, కేరుతూ బయలుదేరాడు.

గదికి తిరిగివచ్చి రామారావు తలుపులన్నీ తీసి, ఏడుస్తూ మంచంమీద పడుకున్నాడు. దుఃఖం అతనికి పొంగి, పొరలివస్తూన్నది.

చాలా వస్తువులను పోగొట్టుకునేదాకా వాటి విలువ తెలియదు. రామారావుకి పార్వతి విలువా, హరి విలువా వాళ్లు పూర్తిగా చెయ్యిదాటగానే తెలిశాయి.

ఆనాడు రామారావు కాలేజీకి పోలేదు. సాయంత్రం వేణు అతని గదిలోకి వచ్చేసరికి రామారావు కళ్లు తడిసి ఉన్నాయి. వేణు తన సహజమైన చిరునవ్వు తోనే అతన్ని జయించి ఇంటికి తీసుకెళ్ళాడు.

"ఏమైనాసరే కాని, నన్ను మీరు నమ్మడంలేదు" అన్నాడు దారిలో వేణు.

రామారావు ఏమిటని చూశాడు.

"మీరు మనస్సులోనే ఏదో ఉంచుకుని బాధపడుతున్నారు. నిజం చెప్పాలంటే ఏమిటి కారణం అని నేను ధైర్యంగా అడగలేకుండా ఉన్నాను. అధమం ఇప్పు డైనా ఎందు కలాగ బాధపడుతున్నారో చెప్తారా?"

రామారావు బలవంతాన నవ్వు తెచ్చుకుంటూ "మిమ్మల్ని నమ్మకపోవడమూ ఏమీ కాదు. నా అశాంతికి కారణాలు నాకే తెలియవు. ఒక రో జలాగ అనిపి స్తుంది, అంతే" నన్నాడు.

వేణు ఇంటి మెట్లని ఎక్కుతూ చిరునవ్వుతోనే, "నాకు తెలుసు. మీరు నమ్మలేరు'' అన్నాడు. సరిగా ఆ సమయానికే పద్మ గదిలోంచి వస్తూ వాళ్ళని చూసి, "నమ్మనంత అద్భుతం ఏమిటిరా?'' అన్నది.

"నేను" అన్నాడు వేణు.

పద్మ నవ్వింది. "ఆయన ఎవరినీ నమ్మరులే" అంది. రామారావుకి మాటలు గుచ్చుకుంటున్నాయి. అతని వైఖరిచూసి పద్మకూడా జాలిపడి ఆ మాటలు మార్చి, ''అలా షికారుకి పోదామా, చాలా రోజులైంది?" అంది.

అంతా అంగీకరించారు. నిజానికి రామారావు ఆలోచించే స్థితిలోనే లేడు.

వాళ్ళు ముగ్గురూ బీచ్‌కి బయలుదేరారు. సముద్రం ఉంది, చక్కటి బీచ్‌లేని ముఖ్యపట్టణాలలో విశాఖపట్టణం ప్రథమం. రోడ్డువెంటే నడిచి ఊరి పరిసరాలు దాటారు.

దారిలో పద్మ మళ్ళా సంభాషణ ప్రారంభించింది.

"మీ రంతగా బెంగపెట్టుకోకూడదు పరీక్షల ముందు-కొంచెం ధైర్యంగా ఉండకపోతే ఎట్లా?"

రామారావు శూన్యంగా చూశాడు. ''బెంగ ఎందుకు?'' అన్నాడు.

"నాకు తెలుసుగా? ముఖ్యంగా హరి."

ఒక్కసారి హాయిగా ఊపిరి వదిలాడు రామారావు.

"ఈ అయిదు నెలలూ మీరు జాగ్రత్తగా ఆరోగ్యం చూసుకోకపోతే పరీక్ష లెలాగ రాస్తారు? కొంచెం సర్దుకోవాలి" మళ్ళా పద్మ అన్నది. ఆ మాటలలో పసిపిల్లవాడికి చూపే మార్దవం ఉంది. అది రామారావుని ఆశ్చర్యపెట్టింది... 'ఈమె నన్ను నిజంగా ప్రేమిస్తోందా?' అనుకుని ఒకసారి ఆమె కళ్ళల్లోకి చూశాడు.

ఆమె నిశ్శబ్దంగా నడుస్తున్నది. రామారావు ఆలోచనలోపడి నిశ్శబ్దంగానే ఉన్నాడు.

సాయంత్రం తిరిగి ఇంటికి వచ్చేదాకా చాలా భాగం నిశ్శబ్దంగానే ఉన్నారు.

రూమ్‌కి తిరిగివెళ్ళేసరికి రామారావుకి ఏదో ఉత్తరం గుమ్మంలో ఉంది. పోస్టుమాన్ పడవేసి ఉంటాడు—అలవాటుగా.

అది ప్రకాశం దస్తూరీయే సావకాశంగా ఉత్తరం చదివాడు రామారావు. ఎవరో వెంకటరామయ్యగారు తమ అల్లుడుగా రామారావుని చేసుకోగోరుతున్నారనీ, ఒకసారి వచ్చి పిల్లనిచూసి వెళ్ళమనీ వ్రాశాడు. క్రిందని, వదిన మరీ మరీ చెప్పమన్నదని పోస్ట్ స్క్రిప్ట్

ఇంత హటాత్తుగా తన వివాహం సెటిల్ చెయ్యాల్సిన అవసరం ఏమిటో రామారావుకి బోధపడలేదు. పరీక్షలైనా అయిపోతే కొంత నయం. కాని, ప్రకాశం రాసిన ఉత్తరాలలో ఇంతకుముం దా సూచనే ఏమీ లేదు. ఇప్పుడు ఒక్కసారి ఈ విశేషం ఏమిటి?

తాను వ్రాస్తే రాననా వదిన చెప్పమన్నదని వ్రాయడం? అన్నయ్యకి నాలో విశ్వాసం నశించిపోయింది అనుకున్నాడు రామారావు.

ఈ వెంకటరామయ్యగా రెవరో, ఆ అమ్మాయి ఎవరో తన కేమీ తెలియదు. వెడితే తప్పక తన పీకకి ఈ సంబంధం తగులుకుంటుంది...వదినమాట వలననే వచ్చానని అన్నయ్య అనుకోవచ్చు.

ఒక్కసారి అతని మనసులో పద్మ మెదిలింది...ఆ సాయంత్రం ఆమె ప్రవర్తన అతనికి జ్ఞప్తికి వచ్చింది

"పద్మని వివాహం చేసుకుంటే?"

బాలా సంతోషిస్తుంది. ఈ నృత్యవృత్తి మానివేస్తే పద్మ దేవత కాదూ? ఆ చక్కని విగ్రహం, వెన్నలాటి మనస్సూ, ఎంత మంచి మనిషి! తానుచేసిన ఈ ఉపకారానికి—అధఃపాతాళంలో ఉన్న ఆమెని అత్యున్నత శృంగాలపై విహరింపజేసినదానికి, ఆమె కొక జీవిత మార్గం, గౌరవనీయమైన స్థితి కలుగ జేసి, ఆమె నీచత్వాన్ని పోగొట్టిన—ఉపకారానికి, ఆమె ఆజన్మాంతం కృతజ్ఞు రాలిగా ఉంటుంది! జీవితం వెన్నెల బాటలుగా, గులాబీ తోటలుగా—ఒక ఆటగా గడిపివెయ్యవచ్చును!

కాని, ఆమె తనని వివాహం చేసుకునేందుకు అంగీకరిస్తుందా?

ఎందు కంగీకరించదు? ఆమె తనను ప్రేమించింది—తన కొక ప్రత్యేక స్థానం ఇచ్చింది...తన దృష్టిలో ఉన్నతంగా ఉండడానికి ప్రయత్నిస్తోంది—తన ఉద్దేశాలని అడిగి అంగీకరిస్తోంది...ఎందు కంగీకరించదు?

ఆ నిమేషంలో అతనికి పద్మ ఒక అందాల రాణిగా, మట్టిలో ఉండిపోయి, తన ఉద్ధరణకోసం తహతహలాడే మాణిక్యంగా కనిపిస్తోంది - ఏదో ఉద్రేకం అతన్ని వశుణ్ణి చేసుకుంది.

అతను ఉత్తరాన్ని అలాగే వదిలి, మెట్లు దిగి తాళం వేశాడు. నాలు గడుగులలో పద్మ ఇంటికి వెళ్లాడు. పద్మ లోపల కూర్చుని చిన్నగా పాడు కుంటూన్నది వేణు జాడ లేదు.

రామారావు గుమ్మంలో అడుగుపెట్టేసరికి ఆమె అతని కంటికి రూపం ధరిం చిన అతని ఊహాలుగా కనిపించింది. ఒక్కసారి గోపికగా ఆమె రూపం అతను పునశ్చరించుకున్నాడు.

పద్మ అతని రాకచూసి ఆశ్చర్యపడింది. ఆమె అతన్ని వదలి అరగంట కూడా కాలేదే!

అతను నెమ్మదిగా వచ్చి పద్మ ప్రక్కన నిలబడ్డాడు. ఎంత ఉద్రేకాన్ని అతను భరిస్తున్నాడో అతని ఉచ్ఛ్వాసనిశ్వాసాలు చెప్తున్నాయి. ఆమె కళ్ళల్లోకి

అతను తేరిపార చూస్తున్నాడు - నిద్రలో నడుస్తూన్నట్లు, ఆ కళ్ళతో ఏదో అద్భుతం కనిపించినట్టు అతను చూస్తున్నాడు

పద్మకి అగమ్యగోచరంగా ఉందతని ప్రవర్తన. అతని కళ్ళల్లో ఆ చిక్కని కాంతు లామెని నిశ్చేష్టగా చేసినై. ఆమె అలాగే నిలబడిపోయింది.

రామారావు ఒకటో పదో క్షణా లామె కళ్ళల్లోకి చూశాడు ఆమె విగ్రహాన్న తను పరీక్షించాడు. అతని మనస్సు ఆమె మనస్సుని మదిస్తోంది...మోషలు ఇద్దరూ దాచుకుంటున్నారు.

బలంగా అత నామెని రెండు చేతుల్లోకి హృదయం మీదికి తీసుకున్నాడు. ఆమె విడిపించుకుందుకు ప్రయత్నించిందో లేదో తెలియనంత బలంగా అత నామె వక్షాలను - తన హృదయానికి హత్తుకున్నాడు. ఆమె వెచ్చని పెదవులకి తన పెదవులని కలిపాడు. ఇద్దరి గుండెలూ తీవ్రంగా పనిచేస్తున్నై. ఏక్షణం రాకూడదో అదే వచ్చాక ఇద్దరూ దానికి లోబడి, నిశ్చేతనులే అయారు.

కామేం చేశారో ఆ ఇద్దరికీ తెలిసేసరికి ఆమె నతను విడిచాడు. ఆమె క్రింది పెదవి ఇంకా వణుకుతూంది. రామారావు మనిషంతా వణుకుతున్నాడు... "ఏం చేశాను?" అత నాలోచించాడు... "ఎంతపని చేశాను?"

రూముకి వచ్చి రామారావు తలుపులన్నీ తీసి కుర్చీలో కూలబడ్డాడు. అతని నరాలన్నీ తీవ్రంగా పనిచేస్తున్నాయి. కొద్ది క్షణాల క్రిందట తనచేతిలో నలిగిన లావణ్యరాశి ఇప్పు డతనిని కనిపించకుండానే బాధిస్తోంది. "ఎంత తొందర పడ్డాను!" అని అతను పదే పదే అనుకుంటున్నాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. ఆ మరునాడు బహుశా పార్వతీ, వేణూ, అల్లుడూ, వృద్ధురాలూ రావచ్చును. ఆ సమయానికి తాను వేణుచేత నిందించబడుతూ ఉండవచ్చు.

మూర్ఖత్వం కాని, నాకూ, పద్మకీ ప్రేమ ఏమిటి? వివాహం ఏమిటి? అత ననుకున్నాడు. ఆమె డబ్బులకోసం నాట్యంచేసే వృత్తిగలది. తనది 'సంప్రదాయం' గల కుటుంబం. ఇలాంటి పనిచేస్తే అన్నయ్య ఎంత బాధపడతాడు? వదిన ఎంతగా విచారిస్తుంది. ఇలాంటి వివాహం చేసుకుంటే పుట్టేపిల్లలు-వాళ్ళకి భవిష్యత్తు ఏమైనా ఉంటుందా?

ఎనిమిది దాటింది.

పరీక్షలు ఇంక అయిదు నెలలు మాత్రం ఉన్నాయి. ఈ కొద్దికాలంలో ఇలాంటి బాధలు పెట్టుకుని పరీక్ష చదువుకూడా ఎగవేస్తే ఎలాగ? అలాంటి



ప్రమాదం—పరీక్ష పోవడం లాంటిదేమైనా జరిగితే ఎంత కష్టం! ఇప్పటికే డబ్బు పెట్టడం కష్టం అవుతూంది అన్నయ్యకి...

కాని, తాను చేసిన పని అంత సులువుగా తుడిచిపోయేదా? పద్మలాంటి వ్యక్తిని కౌగలించుకుని ముద్దుపెట్టుకోవడం అంత తేలికైన పని కాకపోవచ్చును. ఆమె పగ తీర్చుకోదా?

అతనిలాగ గత జిలాలకి సేతుబంధనం చేస్తూ, పదకొండుకి ఒక నిర్ణయానికి వచ్చాడు...జరుగవలసినది జరుగుతుంది - కాని, పద్మని పెళ్లాడడం అసంభవం అని.

ప్రస్తుతం తనకి రావడానికి వీలుగా లేదనీ, పెళ్ళి విషయంలో తమ ఇష్టం వచ్చినట్లు చెయ్యమనీ అన్నకి ఉత్తరం రాసి, పుస్తకం తీశాడు రామారావు.

## 10

మరునాడు వేణు కనుపించినప్పుడు అనేక మాటలు పడడానికి సిద్ధమయ్యాడు రామారావు. కాని, వేణు నవ్వుతూనే పలకరించి, మామూలుగా ప్రవర్తించడంతో, పద్మ గత సాయంత్రపుగాథ అతనికి చెప్పలేదనే నిశ్చయానికి వచ్చాడు.

ఆ సాయంత్రం పార్వతినీ, హరినీ తీసుకుని వచ్చింది ఇంటామె. రామారావు వచ్చేసరికి ఇల్లంతా సందడిగా వుంది.

గుమ్మంలో కాలు పెడుతూనే, వాళ్ళు వచ్చారని తెలుసుకుని రామారావు "హరీ!" అని కేకవేసి మేడ మెట్లదగ్గర నిలువబడ్డాడు. అప్పుడే అతను పార్వతిని చూచాడు...ఒక్కసారి నగంలో మునిగిపోయిన ఆమె అతనికి చాలా క్రొత్తగా కనుపించింది. నూతినుంచి లోనికివెళ్తూ, రామారావుని చూసి ఆగి, ఏమీ అనకుండానే లోనికి వెళ్ళిపోయింది.

ఆమె హరిని వెళ్ళమని చెప్తోంది లోపల – హరి పోనంటున్నాడు. అంతా వింటూ రామారావు ఏమనుకున్నాడో, మేడమీదికి వెళ్ళిపోయాడు. మరి కొంచెం సేపటికి పార్వతి హరిని తీసుకొచ్చి మెట్లదగ్గర ఉంచింది. రామారావు దిగి వెళ్ళి వాడిని తీసుకుని వచ్చాడు.

రూమూతో బిస్కట్లూ అవీ ఏమీ లేవు. హరీ మరో కృషిలేకుండా ఆడుకుంటున్నాడు.

రామారావు వాడి ప్రవర్తనలో కలిగిన మార్పు గ్రహించడానికి చాలాకాలం పట్టలేదు. చేతుల్లో ఉన్నప్పటికీ బెల్లం ముక్కతో ఆడుకుంటూ, రామారావు ఉనికినే గ్రహించలేదు.

ఈ మార్పు అతనికి గుండెల్లో పొడిచినట్లైంది

ఆనాటినుంచీ అతనిని మళ్ళా అక్కడే భోజనం చెయ్యమని ఇంటామె చాలా బలవంత పెట్టింది. కాని, రామారావు పరీక్షల దృష్టితో, ఆ ఇల్లే మార్చదలచుకున్నాడు, ఈ అయిదు నెలలూ ఏకాగ్రంగా చదవడంకోసం. ఊరిలో ఏదైనా రూమ్ తీసుకోవాలని అతని సంకల్పం. ఈ ఇంటిలో ఉండడంవల్ల ఏకాగ్రత పోతుందని అతని భయం – ఏమైనా ఆనాడు వాళ్ళ ఇంట్లో భోజనం చెయ్యలేదు.

తరువాత రెండు సాయంత్రాలు కష్టపడి డాబా గార్డెన్స్‌లో అతను మరొక

గది - చాలా ప్రశాంతంగా ఉన్నది—తీసుకున్నాడు. మూడవరోజు సాయంత్రం-బండిలో సామాను వేయించాడు.

వృద్ధురాలు కళ్ళనీరు పెట్టింది — పార్వతి నిర్వికారంగా ఉండిపోగలిగింది.

* * *

ఇంక అతని జీవితం అంతా పరీక్షల కొరడాతో దిన దినమూ దెబ్బలుతింటూ పరుగెత్తడంలోనే లీనం అయింది. అక్షరాలా పుస్తకాలలో అతను జీవించ సాగాడు. రోజుకి పదకొండు గంటలు చదువు. నాలుగ్గంటలు కాలేజీ—మూడు గంటలు దినకృత్యాలు — ఇవి అతని జీవితంలో నిత్య భాగాలయ్యాయి.

రామారావు కొత్తగదిలోకి వచ్చాక వేణు ఎప్పుడూ అక్కడికి రాలేదు. తొలి నాడు "రూం మార్చారటః ఏంః" అన్నాడు సాశ్చర్యంగా.

"ఔను...చదువు సాగడంలేదని" అన్నాడు రామారావు. కొత్త అడ్రస్ ఇచ్చాడు.

తరువాత రెండు నెలల దాకా, పద్మను రామారావు కలియలేదు మళ్లా. వేణు కూడా కాలేజీలో తప్పిస్తే మరెక్కడా అతన్ని కలిసేవాడు కాదు.

ఆ రోజు ఆదివారం. రామారావు చదువుకుంటూంటే, తలుపు ఎవరో చప్పుడు చేశారు.

అతను లేచి తలుపు తీశాడు ముందు పద్మా, వెనుక వేణూ, "నమస్తే" అంటూ లోపలికి వచ్చారు.

అతను పద్మను చూచేసరికి చాలా విస్మయం పొందాడు. "ఎంత అదృష్టం!" అన్నాడు.

"మీ దర్శనం అవడం మాదే అదృష్టం లెండి...అయితే, పరీక్షలకి చాలా జోరుగానే చదువుతున్నారే!" అన్నది పద్మ.

వేణు హటాత్తుగా లేస్తూ, "పిక్చర్ ఉందో లేదో కనుక్కుని వస్తాను. నువ్విక్కడ ఉండు" అని చెప్పి బయటికి వెళ్లాడు.

రామారావుకి పులినోట పడినట్లున్నది. వాళ్ళు పిక్చర్‌కిపోతూ తన గదికి వచ్చారు...వేణు తనని పంపినా బాగుండు ననుకున్నాడు.

వేణు బయటికి వెళ్ళినా పద్మ ఏమీ మారలేదు. మామూలుగానే, "ఒక్క సారి అయినా రావడానికి తీరుబడి లేకపోయిందా" అంది.

తడబడుతూ రామారావు-"పరీక్షలుగా" అని, అంతటితో తన మూర్ఖత్వాన్ని కప్పుకుంటూ, పెల్లుబుకుతూన్న సిగ్గుతో తలవంచుకుని, "ఆనాడు తొందర పడ్డాక..."అని, ఇక చెప్పలేకపోయాడు.

పద్మ కిల కిల నవ్వి, టేబుల్‌మీది మాఘమ్‌ని వేళ్ళతో ఆడిస్తూ, "అందుకే ఇక్కడికి వచ్చేశారా?" అంది.

"కాదు. అక్కడ నాకింక మనశ్శాంతి దొరకదని వచ్చాను."

"అయినా మీ తప్పేముంది? నేను డబ్బుకోసం బ్రతికే ఆడదాన్నేగా? దానికింత సిగ్గుపడటం ఎందుకు?"

ఉండేలు దెబ్బ...

"నన్ను మీరు అపార్థం చేసుకున్నారు—నాకు మీమీద తక్కువ అభిప్రాయం ఏమీ లేదు. మీ హృదయ వైశాల్యాన్నిబట్టి చూస్తే నేను మీకన్న ఎన్నో అంతస్థులు క్రిందని ఉన్నాను."

అతని కళ్ళెర్రబడినై...ఇంకా దూరం వెళ్లడం ప్రమాదమని, పద్మ, "చాలు ...చాలు నండీ. స్నేహితులుగా అన్నీ మరిచిపోదాం. పిక్చర్‌కి వస్తారా?" అంది.

ఇంతలో వేణూ వచ్చాడు టికెట్లతో సహా. అంతా బయలుదేరారు.

ఆ సాయంత్రం వాళ్లు చాలా సంతోషంగా గడిపారు. రాత్రి మంచంమీద వాలుతూ, నాటి పరిస్థితులకు భగవంతుడికి ధన్యవాదా లర్పించాడు రామారావు. ఇంకెప్పుడూ క్షణికోద్రేకాలకి తావివ్వకూడదని నిర్ణయించుకున్నాడు.

రామారావు పేపర్లన్నిటికీ వెళ్ళాడు. సెకండ్‌క్లాస్ రావచ్చును చివరి పరీక్ష నాడు విత్‌డ్రా అవుదామనుకున్నాడు. వచ్చే ఏడాదైనా ఫస్ట్‌క్లాసు వస్తుందని. కాని ఇంటిదగ్గర పరిస్థితి అతని నలాటిపని చెయ్యనియ్యలేదు.

"పరీక్ష లెలాగ ఉన్నై?" అని అడిగింది పద్మ.

సెకండ్ కాన్ వస్తుందేమో."

కొంచెం ఆగి పద్మ; "పెళ్ళికి వస్తారా?" అంది.

అతను తెల్లబోయి—"ఎవరిపెళ్ళి?" అన్నాడు.

"నాదే!...క్షమించండి ఇంతకుముందే చెప్పనందుకు వచ్చేనెల 17 న. మద్రాసులో."

అతను ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"డాక్టర్ కేశవరావు...ఎవరో ఒకరితో కలిసి జీవితంలో ప్రయాణం సాగించాలిగా?"

"ఆయన ఏవిషయంలోనూ తివ్వరికి తీసిపోరనుకుంటాను"

అని పిలుస్తారట!! నిజమేనంట్రా??



"ఆది అభిమానంతో కూడిన మీ ఉద్దేశం కావచ్చు అయినా, ఫిల్ముల్లో నటించాలని సరదా ఉండిపోయింది. ఇలా అయితే అన్నీ కలిసొస్తాయి."

"చాలా సంతోషం. మీ వివాహిత జీవితం సుఖదాయకం కావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను."

"థాంక్స్...ప్రార్థనే కాకుండా, మీరు తప్పక పెళ్ళికి వస్తారని అనుకుంటాను."

"వస్తాను."

రామారావు హృదయంలో మళ్ళా తుఫాను చెలరేగుతోంది. కేశవరావుని బోర్‌గా జమకట్టిన పద్మని అత నెలాగ జయించాడోనని అతని ఆశ్చర్యం. "చాలా అదృష్టవంతుడు!" అనుకున్నాడు.

"—ఇంక డాన్స్ చెయ్యడంలేదు."

"ఔను జీవితంలో ఎన్నాళ్ళని ఇలాగ? సినీమాలో మిమ్మల్ని చూసే తరుణం కూడా త్వరలో వస్తుందని ఆశిస్తాను."

పద్మ నవ్వింది అతనూ నవ్వాడు.

రామారావు ఇంటిదగ్గర దిగేసరికి అతనికి చాలా సంతోషం కలిగింది. ఈసారి ఎనిమిది నెలలకి ఇంటికి వచ్చాడు.

"పేపర్లు బాగా రాశావా?" అన్నాడు ప్రకాశం.

"బాగానే రాశాను. సెకండ్‌కాస్ రావచ్చును."

"అలా చిక్కిపోయావేం? పరీక్ష అంతా నీ ముఖాన కనిపిస్తూనే ఉంది... సరిలే. రేపు పెళ్ళికూతురు చూస్తే వద్దనకుండా ఉంటే అదే పదివేలు!" సావిత్రి నవ్వింది.

తన వివాహ ప్రయత్నం ఇంకా వాళ్ళు వదిలిపెట్టలేదని రామారావు గ్రహించాడు. నెమ్మదిగా సావిత్రి, విశేషాలన్నిటినీ అతని చెవిలో వేసింది.

"సంవత్సరానికి పదివేలు వచ్చే భూములు, ఇద్దరు ఆడపిల్లలు. ఈ అమ్మాయి రెండోది స్కూలుఫైనలు ప్యాసయింది. ఈయేడు ఎలాగైనా పెళ్ళిచెయ్యాలని ప్రయత్నం. నీకు వ్రాశాముగా? అప్పుడే నిశ్చయం చేసుకోవలసింది— మరి కుదరలేదు."

''ఈ సంవత్సరం ఆగకూడదా అన్నయ్యా?"

"వాళ్ళు తొందరపడుతున్నారుగా...మనదే ఆలస్యం. అయినా, నీ యిష్టం నా ఉద్దేశం ఈయేడు నీ పెళ్ళి అయిపోవాలనే."

"జీవితంలో సెటిల్ అయాక పెళ్ళిచేసుకుందామని అనుకున్నాను. కాని నీ మాటని ఆలోచిస్తాను...''

తరువాత సావిత్రి చెప్పింది వాళ్లకి ప్రకాశం మాట ఇచ్చినట్లే అని. రామారావు ఇంక తప్పించుకోలేకపోయాడు. అన్నని కాదని తప్పించుకోవాలి. లేకపోతే పెళ్ళికి వప్పుకుని తీరాలని.

అతను చాలా ఆలోచించాడు. చిన్నప్పటినుంచీ ప్రాణంగా చూసుకుంటూన్న అన్నని కాదనడం కష్టంగా కనిపించింది. అతనుమాత్రం ఎవరి మేలుకోసం చేస్తున్నా డిదంతా?

అతను అంగీకరించాడు. కట్నంమాట అతను తలపెట్టనేలేదు. ఒకసారి పార్వతి ఆ రోజున ఏడవటం జ్ఞప్తికి వచ్చింది. మరుక్షణం "ఎవరి ఖర్మ కెవరు బాధ్యులు?" అనుకుని ఊరుకున్నాడు.

అంతా జరిగిపోతోంది జూన్‌లో ముహూర్తం కూడా నిశ్చయించుకున్నారు.

రామారావు స్వర్ణకి అమ్మకం అయాడు. అయితే, కేవలం ఆలోచించకుండా కాదు. పెళ్ళి చూపులకని వెళ్ళాడు. ప్రకాశంకూడా వెళ్ళాడు. పిల్లని చూశాడు.

క్షణికోద్రేకాలకి లొంగిపోతే జీవితం అంతా పాడౌతుందని, స్వర్ణని అడిగాడు: "ఈ వివాహం నీ కిష్టమేనా?'' అని.

"నాకు అభ్యంతరం ఏమీలేదు" అన్నదామె.

అతను సంతోషించాడు. అందరూ సంతోషించారు. "ఏమైనా చదువుకున్న వాళ్ళు చదువుకున్నవాళ్ళే" అన్నారు... కొందరు రెండోలాగా అన్నారు. ఏమైతేనేం, వాళ్ళ పెళ్ళి నిశ్చయం అయింది.

* * * *

పద్మ పెళ్ళికి రామారావు వెళ్లాడు. తన వివాహాన్ని కామెనూ, కేశవరావునూ ఆహ్వానించి బొననిపించుకునే తిరిగి వచ్చాడు. రమణమూర్తితో చెప్పాడు... శ్యామలతో చెప్పడానికి వస్తున్నా నన్నాడు.

వేణుని పిలిచి పార్వతితో చెప్పడానికని వాళ్ళింటికి వెళ్ళాడు... పార్వతి అత్తవారింటి దగ్గరే ఉందని చెప్పింది వృద్ధురాలు...... "దేజేతులా దాని పీక గోశాను బాబూ... వాడు దీన్ని అష్టకష్టాలూ పెడుతున్నాడట" అంది. ఒక్క సారి రామారావుకి తాను చేజార్చుకున్న పార్వతి జ్ఞాపకం వచ్చింది... అడ్రస్ తీసుకుని లేచాడు పోవడానికి.

ఈసారి శ్యామలని చూడడానికి అతను వెళ్ళేసరికి ఆమె ఏదో చదువుకుంటూ, "రా బావా" అని ఆహ్వానించింది.

కుర్చీలో కూర్చుంటూ, "రమణమూర్తి లేడూ?" అన్నాడు రామారావు.

"ఇప్పుడే వస్తారు కొంచెం టీ తాగుతావా."

"వద్దులే" అని రామారావు ఆలోచనలో పడ్డాడు—శ్యామల జీవితం గురించి ప్రశ్నించడం, ఎంతవరకూ భావ్యం అని. ఆగలేక చివరికి "అత నేమైనా మారాడా లేక అంతేనా" అన్నాడు.

"ఇంక మారడమే... నేను ఇంటికే వెళ్ళలేదు. నీ పెళ్ళికి వస్తే అక్కడ మా వాళ్ళని కలియాల్సిందే."

శ్యామల బాధగా చెబుతూ... "సరే, నేనిదంతా పద్మ మూలంగానని అనుకున్నాను. ఏమీకాదు. ఆయన గుణం అంతే. మా వాళ్లనవసరంగా ఆయన్ని రెచ్చగొట్టారు" అన్నది.

ఆమె అసహాయతనీ దైన్యాన్నీ చూసేసరికి రామారావు మనస్సు కరిగి పోయింది... అతని కళ్లెర్రబడినై.

"పోనీలే బావా. ఏదో జీవితం వెళ్లకపోదులే. అయితే మా చెల్లెలు చాలా బాగుంటుందిటగా? చదువుకుందిట కూడాను. అదృష్టవంతుడివిలే" అంది శ్యామల... సంభాషణ మార్చడానికి ప్రయత్నిస్తూ.

ఇంతట్లో రమణమూర్తి వచ్చాడు. పలకరింపు లయ్యాక, శ్యామల లోపలికి వెళ్ళింది.

ఆ మాటా, ఈ మాటా అయ్యాక, "నేను వస్తాన్లే-శ్యామలా వస్తుంది. అదీ ఈసంవత్సరం అంతా ఇంటి కెళ్ళలేదు "

అతని సింపతీ అర్థంకాక, రామారావు సందేహంగా చూశాడు.

"ఏం చెయ్యమంటావోయ్. అది లేకపోతే ఒక్క నిమిషం గడవదు. పాపం అదీ అలాగ సర్దుకువస్తూందిలే. లేకపోతే ఈ భూములన్నీ ఎలాగ చూసుకోవడం? రోజూ అక్కడికి వెళ్లాలి-రావాలి."

రామారావు తెగేసి, "అయితే ఈ కొట్టడాలూ అవీ ఎందుకు?" అని అడుగు దామనుకున్నాడు. కాని, శ్యామల రహస్యం బయటపడుతుందని ఊరుకున్నాడు.

ఆ సాయంత్రం ఇంటికి వెళ్ళిపోదామనుకున్నాడు రామారావు. కాని, రమణ మూర్తి శ్యామలల బలవంతాన ఆ రాత్రి కక్కడ ఉండక తప్పలేదు. రాత్రి పదయేదాకా ఆ మాటా, ఈ మాటా మాట్లాడుకుని, రామారావు తన గదిలోకి వచ్చి పడుకున్నాడు. మర్నాడు తెల్లవారుఝామునే వెళ్ళిపోయే రమణమూర్తి దగ్గర సెలవు తీసుకుని.

కనుచీకటి ఉండగానే ఎందుచేతనో రామారావుకి తెలివివచ్చింది. మొదట స్వప్నం అనుకున్నాడు... తరవాత అతను తేల్చుకున్నాడు... నిజంగానే తన మంచంమీద కూర్చుని, శ్యామల తన తల నిమురుతోందని.

అతను కళ్లు తెరిచేసరికి ఆమె ప్రకాశవంతమైన కళ్ళు వాటితో కలిశాయి. అతడు తానే స్థితిలో ఉన్నాడో తానే తెలుసుకోలేకపోయాడు... ఆమె వేడి కన్నీరు తన గుండెమీద పడేదాకా. మాటలాడడం తనకి భౌతికంగా చేతనవునని కూడా అతనికి తెలియదు.

ఆ కన్నీరు బొట్లు బొట్లుగా కొంచెం పడింది అత నొక్కసారిగా లేచి, ఆమె రెండు చేతులూ తన చేతిలోకి తీసుకుని, ఆమె చీర చెంగుతో ఆమె కళ్ళు తుడి చాడు... అప్పు డత నేదో మాటలాడబోయాడు— హృదయం ఎన్నో మాట లను మాట్లాడుతోంది,...కాని, నోరు మాత్రం సత్యాగ్రహం చేసింది.

ఆమె చేతులు వణుకుతున్నై. అతని చేతులూ వణుకుతున్నై. కొద్ది క్షణాలు మూగగా గడిచిపోయాయి.

అప్పుడు శ్యామల లేచింది. తల వంచుకుని "నన్ను క్షమిస్తావుకాదూ, రామా రావ్?" అన్నది- ప్రయత్నంతోనే.

"క్షమించడం_ఎందుకు శ్యామలా?" అతనికి నిజంగానే తెలియదు

"నీ కేం తెలుసునులే!—నా రామం... ఒట్టి అమాయకుడివి— అందుకే నిన్ను క్షమాపణ అడగడం కర్మం అనుకుంటాను. నిన్ను చూచినప్పటినుంచీ నిన్ను ఏడిపించాలనే—దుఃఖంతో, నువ్వు కృంగిపోతోంటే చూడాలనే ఉండేది



నాకు. అన్నీ అందుకే చేశాను కాని, నా సంసారంలో నీ ప్రతిబింబం ఇప్పుడు తెలుస్తోంది—బాధపడడం. ముఖ్యంగా, మానసికంగా బాధపడడం ఎలాంటిదో."

అతను తల దువ్వుకుంటూ వింటున్నాడు. ఆమె కిటికీలోంచి బైటికి చూస్తూ అంటూన్నది.

"ఇంక నీ మంచితనంతో దోబూచులాడలేను కదూ! రామం! పాపం అక్క కలలు కనేది— మనం ఒకటౌతామని. కాని, ప్రవాహ వేగంమీద కర్రలకి శక్తి వుంటుందా?—నేను ఇంక తేలికపడతాను రామం—నువ్వు అంత అమాయకంగా నిద్రిస్తోంటే నా మనస్సు ఆ ఆనందంకోసం గట్టు తెంచుకుంది...అందుకే నీమీద ఈ ప్రవాహం."

మరుక్షణం శ్యామల క్రిందికి వెళ్ళిపోయింది.

తొమ్మిది గంటలకి రైలు. ఈలోగా శ్యామల కాఫీ ఇచ్చి, అతని సూట్‌కేసు పాక్ చేసింది.

వెళ్ళడానికి లేస్తూ, "సాధ్యమైనంత త్వరలో వస్తారుగా?" అన్నాడు—రామారావు ఏదో ఒకటి అనాలి కనుక.

"వస్తాము...కాని, నే నెవరని చెప్తావయ్యా మీ అధికారిణితో," అంది శ్యామల నవ్వుతూ.

"మా మరదలంటాను—కావు కనకనా?"

"అలా ఏమీ వద్దులే—చుట్టం అను."

అతను నవ్వుకున్నాడు. కాని శ్యామల గంభీరంగానే ఉండిపోయింది.

## 12

రామారావుచేత మంగళసూత్రం మానవ దైవ సాక్ష్యాలతో కట్టించుకుని స్వర్ణ అతని భార్య అయింది. పెళ్ళికి రామారావు సాక్షులుగా పద్మా, శ్యామలా, రమణమూర్తి వచ్చారు. తనకి చాలా పనులున్నా, పెళ్ళికొడుకు వాళ్ళ సౌకర్యాలకు స్వయంగానే ఏర్పాట్లుచేశాడు.

మూడు రోజులు చాలా వైభవంగా పెళ్ళి జరిగాక చాలామంది బంధువులు వెళ్ళిపోయారు— శ్యామలా, మూర్తికూడాను. పద్మని బలవంతంమీద మిగిలిన రెండురోజులూ ఆపాడు రామారావు. అయితే, విడిదిలో ఆమెభోజనాన్ని, ఆమె వసతులనీ వేరుచేయడం ఆమె కెలాగ కనిపించిందో అతనికి తెలియదు. బంధువులంతా ఈ స్నేహితురాలిని గురించి గుసగుసలాడుకొంటున్నారనీ అతనికి తెలియదు. అదంతా స్వర్ణ అతనికి చెప్పాక అతను నాలుక కరచుకొన్నాడు.

"ఆ పద్మ మీకు చాలా అభిమానవతి అయితే కావచ్చు—కాని, ఇవతల వాళ్ళేమనుకుంటారో అనే బాధ అక్కర్లేదా?"

నిర్మొహమాటంగా స్వర్ణ తొలి రాత్రే తన నిలాగ ప్రశ్నించగలుగుతుం దనుకోలే దతను. ఆమె చాలా సిగ్గునీ ప్రదర్శించలేదు— అందుకతను సంతోషించాడు. ఈ ప్రశ్నకి మాత్రం అతను సంతోషించలేకపోయాడు.

"—అయినా, ఇలాంటి స్నేహాలేమిటి మీకు?"

ఆ ప్రశ్నలో అధికారమూ ఉంది. చాలా తీవ్రంగా సమాధానం చెప్దామనుకున్నాడు రామారావు. కాని, ఒక్కసారి ఆమె వైపు చూశాక, ఆ గాజుల పేర్పులోనో, కాటుకరేఖలోనో, పెదవులలోనో అతని పట్టుదల అంతా కరిగిపోయింది. నెమ్మదిగా, "ఆమె చాలా మంచిదిలే—ప్రత్యేకం పిలిచానని వచ్చింది...నిన్నింతగా మెచ్చుకున్నదంటావే?" అని, చిన్న నవ్వుతో ఆమెని దగ్గరగా తీసుకున్నాడు.



పోలికలు

---

"అదంతా నాకేం తెలియదు. కాని, ఇలాంటి స్నేహాలు వద్దని చెప్పాగా!" అన్నది స్వర్ణ పట్టుదలగానే.

పూర్తిగా దిగజారి, "రాణిగారి ఆజ్ఞా అయితే..." అన్నాడతను ఆమె ముంగురులు సవరిస్తూ.

అక్షరాలా ఆ ధనవంతుల అమ్మాయి ఆ అబ్బాయికి సర్వాధికారిణి అయిందా క్షణంలో. ఆమె కోర్కెలో, అనుజ్ఞలో అతనికి అందాలు కనపడసాగాయి

ఆ క్షణంనుంచి రామారావు మారిపోసాగాడు

* * *

ఈ శృంగార సముద్రంలో అత్తవారింటిదగ్గర మునిగి తేలుతూంటే, రిజల్ట్సు వచ్చాయి—రామారావు థర్డుక్లాసులో ప్యాసయ్యాడు.

ఆ మరునాడు రిజల్టుకి విచారించవద్దనీ, సత్వరమూ తమ ఊళ్లో ప్రాక్టీసు పెట్టడానికి తాను సహాయం చేస్తాననీ ప్రకాశం వ్రాశాడు—స్వర్ణ ఆ ఉత్తరం చదివి క్రింద పడవేస్తూ, "ఆలస్యం ఎందుకు? ఇంక బయలుదేరండి. ఆయన ఏర్పాట్లు చేశారుగా!" అన్నది.

ఆమె నిజమైన ఉద్దేశం రామారావుకి బోధపడలేదు. అర్థంకానట్లే చూశాడు

"ఆ ఊళ్ళో ప్రాక్టీసేమిటంట? పట్టణంకాదు. పల్లెటూరుకాదు నాన్నగారి ఉద్దేశం మీరు బెజవాడలో ప్రాక్టీసు పెట్టాలని" అని తెల్పింది స్వర్ణ.

అతను తెల్లబోయాడు— "బెజవాడలోనా" అన్నాడు—నమ్మనట్లు.

''ఏం అంత ఆశ్చర్యం? నాన్నగారు ఆపాటి సాయం చెయ్యరనుకున్నారా? మా ఇల్లు ఉండనేఉంది."

స్వర్ణ దగ్గరగా వచ్చాక రామారావు చాలా ముఖ్యమైనదీ, తప్పనిదీ ఒక పాఠం నేర్చుకున్నాడు— ఏ పరిస్థితుల్లోనూ ఆమె స్వీయోద్దేశం మార్చుకోదని. ప్రకాశానికి సహాయంగా, ఆ వూళ్ళోనే ఉండిపోయే ప్రయత్నం అతను మాను కున్నాడు.

ఆ వేళే అతను అన్నకి ఉత్తరం వ్రాశాడు. రెండోవారంలో అతను స్వర్ణని తీసుకుని ఇంటికి వచ్చాడు.

సావిత్రి స్వర్ణతో ప్రవర్తించే విధానం చూసి, స్వర్ణ తన ఉదేశం మార్చు కుంటుం దనుకున్నాడు రామారావు. అనుదినమూ ఆమె నలంకరించడం, ఇంటి పనులతోపాటు సావిత్రి దినచర్య చేసుకొంది. చాలాసార్లు ఈ పద్ధతి రామా రావుకి కష్టం అనిపించింది. కాని, స్వర్ణకి ఎదురుచెప్పడం అతను స్వాప్ని కంగా కూడా చెయ్యలేకపోయేవాడు.

రామారావు వదినతో ముఖాముఖీ మాట్లాడాల్సి రావడాన్ని గురించి చాలా భయపడుతున్నాడు. తాను చాలా హీనంగా ప్రవర్తించాననే బాధవదిన ముఖం చూచాక అతనికి కలుగుతోంది—ఇంట్లో పరిస్థితులు కూడా ముఖాముఖీ రామా రావునూ సావిత్రినీ ఒకచోటికి తీసుకురావడంలేదు.

వారంరోజులయ్యాక, ఒకరాత్రి మాటల వరుసలో నవ్వుతూ స్వర్ణ, "నేనంటే ప్రాణం ఇస్తారు మీ వదిన'' అన్నది.

రామారావు కా మాటలు పట్టుకొమ్మగా కనుపించి, వాటి వెనక రాబోయే మాటలకోసం ఎదురుచూశాడు ఆశగా...ఆ మాటలు తనని బాధిస్తోన్న సమ స్యని పరిష్కరించవచ్చునని.

"దానికి కారణం నాకు తెల్సును"అన్నది మళ్ళా స్వర్ణ. నిద్రపోతూన్నట్లే వింటున్నాడు రామారావు...అతనికా కారణం తెలీలేదు. ప్రశ్నిస్తూ చూశాడు...

"అక్కడికి మీకు తెలియనట్లు!" అని స్వర్ణ నిశ్శబ్దంగా ఉండిపోయింది. ఎన్ని ప్రశ్నలకీ ఇంక సమాధానం రాలేదు...విసుగుకుని ఊరుకున్నాడు రామా రావు అతని మనస్సులో చాలా ఆలోచనలు మాత్రం ప్రవేశించాయి. స్వర్ణ

అంటే ఆ క్షణంలో అతనికి చాలా కోపం వచ్చింది...అది పెదవులనైతే దాట లేదు.

రెండునెల లక్కడ తీరుబాటుగా గడిపాక రామారావు బెజవాడ ప్రయాణం కట్టాడు. ప్రకాశం నిర్వికారుడుగా ఊరుకున్నాడు రేపు ఉదయం ప్రయాణం అనగా సావిత్రి అతని గదిలోకివచ్చి, "రేపు వెళ్తావా రామం?" అంది.

"ఔను వదినా" అన్నాడు రామారావు తల వంచుకుని— అతని తలమీద ఈ అవమానభారం అంతా ఉన్నది.

"నువ్విక్కడఉండి ఆయనకి సహాయం చేస్తావనుకున్నాను-కాని, ఏది ఎలాగ జరగాల్సిందో అలా జరగాలిగా!" అంది సావిత్రి.

"నేను చేస్తూన్న పని నాకు తప్పని తెలుసును..." అన్నాడు రామారావు గుండెలనిపెట్టి ఉన్న బాధని వదిలించుకుంటూ

"ఆదేంకాదోయ్...ఎవ్వైనా కాపురాలు పాడుచేసుకుంటారా? నువ్వు మాత్రం ఏమిటి చెయ్యగలవు?"

అతను పరీక్షిస్తున్నట్లామె కళ్ళల్లోకి చూశాడు... కళ్ళల్లో ప్రశాంతతా, జాలీ కనిపిస్తున్నై.

"కాస్త సర్దుకోమని చెప్పడానికే వచ్చాను స్వర్ణ కూడా చిన్నది. నీకు కోపం వచ్చినా తొందరపడకుండా ఎలాగో ఆమెని మంచి చేసుకో—"

ఇంకామె ఏమీ అనలేదు. ఒక్కక్షణం ఆగి క్రిందికి వెళ్ళిపోయింది. ఆమెకి నమస్కరించే ప్రయత్నంలో అతను చేతులు జోడించబోయాడు. కాని, ఆలోచన లతన్ని వివశుణ్ణి చేసినై.

అనుకున్న ప్రకారమూ మరునాడు స్వర్ణా, రామారావూ బెజవాడ వెళ్ళి పోయారు.

## 13

ప్లాట్‌ఫారమ్ చాలా హడావుడిగా ఉంది...మదరాసునుంచి బెజవాడ తిరిగి వస్తున్నాడు రామారావు అప్పుడే స్టేషన్‌లో మెయిలు ఆగింది.

అతను కంపార్ట్‌మెంటులోంచి పైకివచ్చి, బెడ్డింగ్ కూలీనెత్తిన పెట్టివస్తూ ఒక్కసారి ఆగాడు. ఎదురుగా పార్వతి వస్తూంది.

మొదట ఆమె నతను గుర్తుపట్టలేకపోయాడు. కాని, ఇద్దరికళ్ళూ కలుసుకున్నాక వాళ్ళిద్దరూ యాంత్రికంగా ఆగిపోయారు...

"ఎక్కడినుంచి రావడం?"

తెచ్చిపెట్టుకున్న సంతోషంతో రామారావు ప్రశ్నించాడు—ఆమె వైఖరిని పరీక్షిస్తూ.

"చూస్తూన్నారుగా ? మీ ఊరినుంచే?"

బెజవాడలో ఎవరో చుట్టాలను చూచిపోతున్నానని, మళ్లా ప్రశ్నించాక చెప్పింది పార్వతి...

''హరి ఏడీ?"

ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకుని అడిగాడు నిర్విణ్ణుఅయి, పార్వతి "మూడు నెలలైంది— పోయాడు" అన్నది... "వాడూ ఆయనా గోదావరి బోటులో వస్తూ."

"ఆయన కూడానా?"

"ఔను—"

పార్వతి కొంచెం బాధపడినట్లు కనుపించినా, కన్నీళ్ళు పెట్టలేదు."

"మీ అమ్మగారు?"

"కాశీ వెళ్ళింది—వార్త తెలియదు ఏమైందో."

రాయికి ప్రాణం వచ్చినట్టు మాట్లాడుతోందిపార్వతి. అతని మనస్సు తీవ్రంగా పని చేస్తూంది

"టైమైంది—వెళ్తాను "

ఆమె ముఖంలోకి అతను పరీక్షగా చూశాడు అక్కడ బాధాసూచనలే మాయమయ్యాయ్. అతడాశ్చర్యపోయాడు.

"ఇప్పు డెక్కడ ఉండడం?"

"అత్తవారి ఊరే...ఆస్తంతా నాదేగా?"

అతనింక తెలుసుకోవలసిన దేమిటో తెలుసుకోలేకపోయాడు ఇంకేమీ మాట్లాడకుండాపార్వతి రైలుకి నడిచింది అతను పోర్టరు కేక విని, ముందుకి నడిచాడు.

'ఆసాయంత్రం—రాత్రి అతని ఆలోచనలని పార్వతివెంట తరుము సాగింది.. ఆమె జీవితం తన ఔదాసీన్యంవల్ల పాడైందని అతను మథ్యపడిపోయాడు... మళ్ళా తానేమిచేశానని ప్రశ్నించుకుని సరియైన సమాధానం ఇచ్చుకుంటున్నాడు.

కిటికీదగ్గర నిలబడి, దూరాన్ని చూస్తూ అతను ఎన్నిసార్లు తన జీవితాన్ని మార్చుకున్నాడో ఆలోచించుకుంటున్నాడు... స్వర్ణకి తా నెలాగ బానిస అయ్యాడో తలుచుకుంటున్నాడు. ఆనాడు పద్మని ముద్దుపెట్టుకున్న క్షణం.



శ్యామల తన బాధని వెళ్లబోస్తూ తన మంచంమీద కూర్చుని తల నిమిరిన నిమేషం, ఉదయం రాయిగా అయిపోయిన పార్వతితో మాట్లాడిన కాలం— అతనికి ఒకదాని వెనుక ఒకటి జ్ఞప్తికివచ్చి సూదులల్లే గుచ్చుకుంటున్నాయి.

మరునా డుదయం వర్షం పడుతోంది, జల్లు కొడుతోంది. అంతరుష్ణతతో క్రమ్గుతోన్న అతని తల కాచల్లదనం చాలా సౌఖ్యం ఇస్తూందీ. అతను ఆలోచనల్లోనే ఉండిపోయాడు. స్వర్ణవచ్చి గాజుతలుపులు వేసి. ఏదో అన్నది. అతనికి వినిపించలేదు. గతించిన జీవిత మార్గాలూ వాటి ఉపశాఖలూ అతని మనస్సులో మెదులుతూ ఇతర విషయాల కాస్కారం లేకుండా చేసివుంటై

"అలా తడుస్తున్నారేం? కాఫీ తాగండి."

స్వర్ణ అతని పరధ్యానాన్ని గమనించి, వెళ్ళి అతనిముందు నిలబడింది— తలుపులువేసి అతనిని కుర్చీలో కూర్చోపెడుతూ. "ఏమిటంతగా ఆలోచిస్తున్నారు? వచ్చి కాఫీ త్రాగండి."

అతను కూర్చున్నాడు. యాంత్రికంగా కాఫీకప్పు అతని చేతిలోకి వెళ్లింది.

మెరుస్తోన్న అతని వుంగరాల తలని ముద్దుగా నిమురుతూ, "రాత్రి ఎంత చక్కని కల వచ్చిందంటారు?" అంది.

"ఏమి?" టన్నట్లుత నామె కళ్ళలోకి చూశాడు.

"ఎవరో నాదగ్గరకి వచ్చాడు. బైరాగి అనుకుంటాను. నే నెక్కడ ఉన్నానో తెలుసా?"

"ఎక్కడ?"

"అందంగా పూచిన చెట్లక్రింద—ఉయ్యాలలో ఆ బైరాగి వచ్చి అడిగాడు.. 'మళ్ళా వెనకనించీ జీవిస్తావా?' అని."

అతని కళ్ళలో ఏదో వెలుగు కనుపించింది. ఆమె చెప్పుకుంటూ వెళ్తోంది.

"నే నెగిరే అంత సంతోషించాను...మళ్ళా జీవితం—మళ్లా ఎన్నో మధురతమ క్షణాలు... మళ్ళా..."

కాఫీకప్పు క్రిందపడ్డది. ఆమె అతని భుజంమీదకి వంగింది...

"కాని, అంతా కలే!"

ఆమె గొంతుకలో నిరాశ జీర కనిపించింది.

"అయినా, మళ్ళీ వెనకనుంచీ జీవిస్తే ఎలా వుంటుందంటారు?"

అతని కళ్ళలో ఆ కాంతి ఎక్కువైంది

"మీరైతే, అలా జీవించడానికి ఇష్టపడరూ?" గోముగా అన్నది స్వర్ణ— అతని మెడకి చేతుల పెనవేస్తూ.

"మళ్ళా, జీవితం ప్రారంభించడానికా!"

"ఆ!"

"ఎంత బాగుంటుంది!"

"నిజం కదండీ...మళా—మళ్ళా..."

"ఔను. చాలా బాగుంటుంది" అన్నాదతను ఆమె కళ్ళల్లో కనుపించని దేనినో వెదుకుతూ.





# అగ్నిమాల

వాసరి సుబ్రహ్మణ్యం

(గత సంచిక తరువాయి)

**14**

అగ్నిపాలుడు హిరణ్యపురప్రాంతాలకు చేరేసరికి, సూర్యాస్తమయం అయింది. కాని, యింకా చీకటి బాగా అలుముకో లేదు. చుట్టూ ఎత్తయిన ప్రహరీగోడలతో ఉన్న, ఒక పురాతన భవనాన్ని ధర్మనందుడు, అగ్నిపాలుడికి చూపుతూ, "మీరు వెళ్ళదలిచిన విజయరాజుండే గృహం అదే. అక్కడవున్న మిత్రుడితో, మీరు నిరభ్యంతరంగా మాట్లాడి రావచ్చును. మీరు తిరిగి వచ్చేవరకూ, నే నిక్కడే వేచివుంటాను,'' అన్నాడు.

''కృతజ్ఞుణ్ణి. త్వరలోనే తిరిగి వస్తాను,'' అంటూ అగ్నిపాలుడు గుర్రాన్ని అదిలించి, విజయరాజు గృహంకేసి బయలుదేరాడు.

ప్రహరీగోడకువున్న పెద్ద తలుపులు బార్లాతెరిచివున్నవి. అగ్నిపాలుడు గోడ దాటి గృహప్రాంగణంలోకి వెళ్ళేసరికి, ఆ ప్రాంతమంతా కోలాహలంగా వున్నది.

''ఛీ, నీచుడా! నీ కల్లబొల్లి మాటలతో నన్నుకూడా మోసం చేద్దామనుకుంటున్నావా? నువే గనుక సుక్షత్రియుడివైతే, ఒరనుంచి కత్తిదుయ్యి. నీ పాపానికి తగిన ప్రాయశ్చిత్తంచేస్తాను," అంటున్న దొకగొంతు భీకరంగా.

''మణిమంతా! తొందరపడకు. విష్ణు చెప్పేదికూడా విను. ప్రసేనుడి ఇంట వున్న వ్యక్తి తను కాదనేందుకు సాక్ష్యం చూపుతానంటున్నాడు గదా?'' అంటున్నది మరొక గొంతుక, సావధానపరిచే ధోరణిలో.

ఆ సంభాషణ వింటూనే అగ్నిపాలుడు, ఆ కోలాహలానికి కారణం అర్థంచేసుకున్నాడు. తను ఎవరైతే మరణించినట్టు భావిస్తున్నాడో...ఆ విష్ణుమిత్రుడు సజీవుడే! 'ఔరా, మాహూ! నీ బుద్ధిహీనతవల్ల నేనుకూడా మోసపోయానే!' అని అగ్నిపాలుడు తన నౌకరును మనసులోనే శపించి, ఒక్క దూకున గుర్రంమీదినుంచి దిగి, ''అయ్యా, మీరు తొందరపడకండి! కత్తులు ఒరలో పెట్టండి. మీ తగవుకు తగు కారణం లేదు," అంటూ వారికేసి పరిగెత్తాడు.

అగ్నిపాలుడు వారిని సమీపించేంతలో, ఓ పాతికేళ్ళ యువకుడు...సీరసించిన దేహం, పొట్టమీద బిగించివున్న కట్లతో,ఒకడుగు ముందుకువేసి,''ఇడుగో ఇతడే నాకు ఆ రోజున కూర్మశైలం దగ్గిర దాహంతీర్చి ప్రాణదానం చేసిన మహానుభావుడు!'' అంటూ ఎరిగి గంతేశాడు.

అతడితోపాటు వున్న ఇద్దరు వ్యక్తులూ, ఆశ్చర్యంగా అగ్నిపాలుడికేసి తలలు తిప్పారు. ఆ ఇద్దరూ సుమారు యాభైఏళ్ళ వయసుగలవాళ్ళు,

అగ్నిపాలుడు మందహాసం చేస్తూ వారిని సమీపించి, ''అయ్యా, మీ వాగ్వాదం నేను విన్నాను విష్ణుమిత్రుడు చెప్పినట్టు నేను కొన్నాళ్ళకిందట, ఆయనకు ఒకానొక పూరిగుడిసెలో... దాహార్తిగా వుండగా సహాయంచేసిన మాట నిజం! కాని, పొగరుబోతూ, బుద్ధిహీనుడూ అయిన ఒకానొక సేవకుడు చెప్పిన మాటలు నమ్మి...ఈయన మరణించారనుకున్నాను. ఆ తరవాత కొన్ని కారణాలవల్ల—వారిపేరు పెట్టుకుని నేను రాజాప్రసేనుడి గృహంలో ఆతిథ్యం పొందటం జరిగింది,'' అన్నాడు.

మణిమంతుడని పిలవబడిన వ్యక్తి, తనచేతగల కత్తిని అనుమానంగా ఒరలో పెడుతూ, "మీ పేరేమిటి? ఎక్కడివారు?'' అని అగ్నిపాలుణ్ణి గద్దించి అడిగాడు.

అగ్నిపాలుడు జవాబు చెప్పబోయేంతలో, విష్ణుమిత్రుడు ముందుకువచ్చి, ''అయ్యా, మీ సహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి. ఆనాడు మీరు దాహంతీర్చటం

వల్లనే, నేను కదబట్టిన ప్రాణాన్ని నిలుపుకోగలిగి ... ఆ తరవాత నా మిత్రుల కంట బడటంద్వారా, ఇప్పటికి యీవిధంగా బ్రతికివుండగలిగాను. తిరిగి యీనాడుకూడా మీరు, నాకు ప్రాణదానం చేశారు తన కుమార్తెకు నేనేదో ద్రోహం చేసి, ప్రసేనుడి కూతురును వివాహం ఆడేందుకు ప్రయత్నిందానని, మణిమం తుడు నామీద క త్తిదూస్తున్నాడు. ఇదేమీ నా కర్థంకావటంలేదు. ఆ ప్రసేనుడి ఇంటి ఛాయలకుకూడా, నే నేనాడూ వెళ్ళినదిలేదు. సమయానికివచ్చి, మళ్ళీ నన్ను కాపాడారు,'' అన్నాడు.

"విష్ణు చెపుతున్నది నిజమేనా? ఇంతకూ మీరెవరైనదీ చెప్పారుకాదు,'' అన్నాడు మణిమంతుడు కొంచెం కోపంగా.

"విజయరాజుగారు మీరేనా?" అంటూ అగ్నిపాలుడు, అక్కడవున్న మూడవ వ్యక్తికేసి చూశాడు.

"అవును,'' అన్నాడతడు.

"అయితే, మిమ్మ క్షమాపణ కోరుతూ, నేను చెప్పవలసిన సంగ తొకటి వున్నది. ఈ సమయంలో, యీ గృహానికి కొంచెం దూరంలోవున్న రాజమార్గంమీద, నవభోజుడి సైనికులు కొందరున్నారు. కనక, మనం అన్ని విషయాలూ మెల్లగా మాట్టాడుకోవటం మంచిది," అన్నాడు.

నవభోజుడి సైనికులపేరు వింటూనే, విష్ణుమిత్రుడూ, మణిమంతుడూ, విజయ రాజూ ఉలిక్కిపడి కత్తులను ఒరనుంచి బయటికి లాగారు. అగ్నిపాలుడు వారిని వారిస్తూ, "మీరు తొందరపడకండి. ఆ సైనికులకు, యిక్కడ మణిమంతుడు గానీ, విష్ణుమిత్రుడుగానీ వున్నట్టు తెలి యదు. ఎవరో మిత్రుడితో మాట్లా డేందుకు అనుమతి కావాలనిచెప్పి, వారి నాయకుడినుంచి అనుమతి సంపాదించి యిక్కడికి వచ్చాను.· అన్నాడు అగ్నిపాలుడు.

ఆ మాటలు ఆ ముగ్గురినీ శాంత పరిచినై. తరవాత అగ్నిపాలుడు తన దగ్గిరవున్న విష్ణుమిత్రుడి పత్రాలనుతీసి, అతడికి అందిస్తూ, "విష్ణుమిత్రా! ఇవి ...ఆనాడు మీరు నాకప్పజెప్పిన పత్రాలు. వీటిని నే నెవరికి అందజేయ వలసివున్నదో—ఆపేరు చెప్పేలోపలే, మీరు శోషతో కన్ను మూశారు. అది చూసిన, నా సేవకుడు, మీరు విగత జీవులయ్యారని, నాతో నమ్మబలికాడు. అందువల్ల యీ పత్రాలు యీనాటి వరకూ నా దగ్గిరే వున్నవి," అన్నాడు.

"విజయా! ఇందులో...విష్ణు ఆడు తున్న కపటనాటకం ఏమీ లేదుగదా? ఇదంతా మనం నమ్మవచ్చునా?" అన్నాడు మణిమంతుడు.

విజయరాజు ఓ క్షణకాలం వూరు కుని, "ఇందులో నమ్మదగనిది ఏమీ లేదు మణిమంతా! లలితాంగి, విష్ణుల



పోలికలు

ప్రేమ నాకు తెలియందికాదు. నువ్వే తొందరపడి విష్ణును చాలా దుర్భాష లాడావు. సరే, ఆ విషయం ప్రస్తుతానికి అలా వుంచుదాం..." అంటూ అగ్ని పాలుడికేసి అనుమానంగా కనుబొమలు ముడిచిచూశాడు.

అది గమనించిన అగ్నిపాలుడు, విజయరాజు ముఖంలోకి సూటిగా చూస్తూ, "విజయరాజుగారూ! మీకు, నామీద ఏదో అపనమ్మకంవున్నట్లుంది, అవునా?" అని అడిగాడు.

"అవును. ఇది ఎవరినీ నమ్మదగిన కాలం కాదు," అన్నాడు విజయరాజు.

"అంటే! కాస్తవివులంగా చెప్పండి," అన్నాడు అగ్నిపాలుడు,

"మీవెంట నవభోజుడి సైనికులున్నారని చెప్పారు. అదీగాక మీరు, యీ సమయంలో యిక్కడ మణిమంతుడుంటాడని ఎవరివల్ల తెలుసుకున్నారు?" అన్నాడు విజయరాజు.

ఆ ప్రశ్నకు అగ్నిపాలుడు నవ్వాడు: "ఈనాటి ఉదయం పదిగంటలవేళ, ప్రసేనుడి గృహంలో మణిమంతుడు ఒక ఉత్తరం యిచ్చిపోయారు. అది నా పేర ...అంటే—విష్ణుమిత్రుడి పేరుతో, ఆ ఇంటవున్న నా పేర రాయబడింది కనక, ప్రసేనుడు దాన్ని నాకు యిచ్చాడు. ఆ ఉత్తరంలో ఏమున్నదో, మణిమంతులే మీకు చెప్పగలరు."

"అవును, విజయా!...విష్ణుకు యీ రోజు సూర్యాస్తమయంలోపల యిక్కడ నన్ను కలుసుకోమని ఉత్తరంరాసి, దాన్ని ప్రసేనుడికి యిచ్చాను," అన్నాడు మణిమంతుడు.

"ఆ కారణంవల్లనే, నేనిక్కడికి




పోలికలు

కావటం జరిగింది,'' అన్నాడు అగ్నిపాలుడు.

"అయితే, వెంట నవభోజుడి సైనికులెందుకు? ఆ సంగతి చెప్పారుకాదు," అన్నాడు విజయరాజు.

ఆ నవభోజుడి సైనికులు, నా వెంట వుండటానికి కారణం—నేను ప్రస్తుతం వారిచేతుల్లో బందీని!" అన్నాడు అగ్నిపాలుడు.

ఆ జవాబు వింటూనే విష్ణుమిత్రుడు నిశ్చేష్టుడయాడు. "అయ్యా, మీరు ఆ క్రూరులచేతిలో బందీ ఎలా అయ్యారు? మీపేరేమిటి?'' అన్నాడు ఎంతో ఆదుర్దా పడిపోతూ.

"నన్ను విష్ణుమిత్రుడని భావించే, వాళ్ళు నన్ను పట్టుకోవటం జరిగింది. కనుక, మీరూ, నన్ను విష్ణుమిత్రుడనే ... ప్రస్తుతానికి సంబోధించవచ్చు,'' అన్నాడు అగ్నిపాలుడు.

ఆ జవాబుకు విష్ణుమిత్రుడు తృళ్ళిపడి, "అయ్యా, ఇది అన్యాయం! ఆ నవభోజుడి సైనికులు, నన్ను పట్టుకునేందుకు ఈ ప్రాంతంఅంతా గాలిస్తున్నారు. వాళ్ళకు ఏ కారణంవల్లనో, విష్ణుమిత్రుడని చెప్పుకుంటున్న మీరు దొరికారు. మా కాలభోజరాజు పక్షీయులను, మాను కోటలో రోజుకు ఎంతమందిని ఉరి తీస్తున్నారో మీకు తెలియకపోవచ్చు. నా కారణంగా మీరు ఉరికంబం ఎక్కటానికి, ఏ పరిస్థితులలోనూ, నే నంగీకరించను. నే నెవరినో తెలియబరుచుకుని, ఆ సైనికులకు బందీనవుతాను. మీరు క్షేమంగా, మీ మార్గాన వెళ్ళండి," అని బయలుదేరాడు.

అగ్నిపాలుడు, విష్ణుమిత్రుడి భుజం పట్టుకుని ఆపుతూ, "విష్ణుమిత్రా! నాకు

ప్రాణంమీద ఆశలేదని భావించకండి! విష్ణుమిత్రుడెవరో తెలియని, యీ సైనికులకు నేను బందీగా చిక్కినా, ఏ క్షణాన అయినా సరే, నేను నా నిజ నామం తెలియబరుచుకుని, స్వేచ్ఛగా వెళ్ళిపోగలను. కనుక, మీరు తొందర పడి, ప్రాణంమీదికి తెచ్చుకోకండి," అన్నాడు.

"అయ్యా, మీరు చేస్తున్నది చాలా ప్రమాదంతో కూడినపని. మా విష్ణుకోసం మీరు చిక్కుల్లో తగుల్కొంటారని, నాకు భయంగా వున్నది," అన్నాడు మణిమంతుడు.

అగ్నిపాలుడు జవాబు చెప్పబోయేంతలో, విజయరాజు, అతడిముందుకు వచ్చి, "మీ పేరు అంత అంత రహస్యంగా వుంచవలసినదైతే చెప్పకండి! కాని ఒక్కసంగతి; మీరుకూడా కాలభోజుడి పక్షీయులేనా?" అని అడిగాడు.

"ఈ ప్రశ్నకు నేనిచ్చే జవాబు, మీకు ఆశాభంగం కలిగించటమేకాక, కోపకారణంకూడా కావొచ్చు! కనుక, నేను జవాబు చెప్పను. కాని, యీ సందర్భంలో మీకొక సలహా యివ్వదలిచాను. మీరు నవభోజరాజుపై శత్రుత్వంమాని, రాజభక్తి కలిగివుండటం మీకూ, చంద్రగిరి రాజ్యానికూడా క్షేమకారణమవుతుంది," అన్నాడు అగ్నిపాలుడు.

ఆ మాటలకు, ఆ ముగ్గురూ ముఖముఖాలు చూసుకున్నారు. విష్ణుమిత్రుడు భక్తిగౌరవాలు ఉట్టిపడే కళ్ళతో అగ్నిపాలుడికేసి చూస్తూ, "అయ్యా, మీరు నాకింతవరకూ రెండుమార్లు ప్రాణదానం చేశారు. ఏ ప్రాణీ యింతకన్న ఎక్కువ సహాయానికి అర్హుడుకాడు. కనుక, ఆ నవభోజసైనికులకు నన్నే బందీగా దొరకనివ్వండి," అన్నాడు.

"అవును, విష్ణు చెప్పేదాంట్లో సత్యం లేకపోలేదు. మీరు సావధానంగా ఆలోచించండి," అన్నాడు విజయరాజు. మణిమంతుడు ఏమనేందుకూ తోచక తల దించుకున్నాడు.

అగ్నిపాలుడు ఆ ముగ్గురికేసీ గౌరవపురస్సరంగా చూస్తూ, "నామీద మీరు చూపిన గౌరవాదరాలకు కృతజ్ఞుణ్ణి. ఇంతకుముందే చెప్పినట్టు, నేను ఏ క్షణంలో అయినా, యీ నవభోజ సైనికుల చేతులనుండి స్వేచ్ఛగా బయటపడగలను. ఒకవేళ దైవేచ్ఛ మరొకవిధంగా వుండి, నేను విష్ణుమిత్రుడుగానే ఉరితీయబడినా...అందుకు మీ బాధ్యత ఏమీ వుండబోదు. నా స్వార్థంకొద్దికీ, నాకు నేనై—ఆ విష్ణుమిత్రం నామం పెట్టుకున్నాను. కనుక, అది తెచ్చిపెట్టే ఫలితాలు మంచివైనా చెడ్డవైనా అనుభవించకతీరదు, ఇక సెలవు!" అంటూ తెరిచివున్న వీధిద్వారంకేసి నడిచాడు.

"జయం! జయం! మిమ్ములను ఆ సర్వేశ్వరుడు సదా రక్షించుగాక!" అని ఆ ముగ్గురూ ముక్తకంఠంతో పలికారు.

# 15

హిరణ్యపురంలో వున్న ఒకానొక పెద్ద సత్రంలో, ఆ రాత్రికి విడిది చేయటం మంచిదని ధర్మనందుడు నిర్ణయించాడు. ఆ ఏర్పాటు అగ్నిపాలుడికి చాలా సంతోషం కలిగించింది. తను మానుకోట చేరేలోపల, ఆలోచించుకో వలసిన సంగతులు చాలావున్నవి. వకుళ మాల ఎక్కడికి ప్రయాణమైపోయింది? తనను నవభోజుడి సైనికులు బందీగా చేశారని తెలిసినప్పుడు, తనను గురించి ఆమె జాలిపడుతుందా లేక సంతోషిస్తుందా?

అగ్నిపాలుడు యిలాంటి ఆలోచనలతోనే, ధర్మనందునివెంట సత్రానికి వెళ్ళాడు. సత్రం బాటసారులతో కిటకిటలాడిపోతున్నది. వారిలో చాలామంది మానుకోటకు ప్రయాణమైపోతూ,దారిలో ఆ రాత్రికి అక్కడ విడిదిచేసినవాళ్ళు.

భోజనాల తరవాత ధర్మనందుడు, అగ్నిపాలుణ్ణి ఒంటరిగా గదిలో వదిలి, విడిది దిగినవాళ్ళ ద్వారా వార్తలు తెలుసుకునేందుకు వెళ్ళాడు. కొద్దిసేపట్లోనే అతడికి అనేక ముఖ్య వార్తలే గాక, వింత వార్తలూ, కేవలం పుకార్లూ కూడా తెలియవచ్చినై.

ధర్మనందుడు, అగ్నిపాలుడున్న గదికి తిరిగివచ్చాడు. అప్పటి కింకాకన్ను మూయక, ఆలోచనల్లో మునిగి తేలుతున్న అగ్నిపాలుణ్ణి చూస్తూనే, అతడు దగ్గరకుపోయి, "విష్ణుమిత్రా! సత్రం అంతా, చంద్రగిరినగరంనుంచి వస్తున్న వారితో కిటకిటలాడిపోతున్నది. వారందరి ప్రయాణం ఎక్కడికో తెలుసా?" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

అగ్నిపాలుడు అతడికేసి ప్రశ్నార్థకంగా చూశాడు. "ఆ వచ్చినవారిలో చాలామంది పనిపాటుల్లేని ధనికులు. వాళ్ళల్లో చాలామందికి మానుకోటలో ఉరితీయబడుతున్న రాజద్రోహు లెలా వుంటారో చూడాలని వున్నదట! ఒకరికి బాధ, మరొకరికి ఆనందం!" అన్నాడు మళ్ళీ ధర్మనందుడు.

"చంద్రగిరినుంచి వచ్చి యిక్కడ దిగినవాళ్ళలో, రాజోద్యోగు లెవరైనా వున్నారా?...బహుశా నన్నెరిగిన వాళ్ళెవరైనా వున్నారేమో అని అడుగుతున్నాను," అన్నాడు అగ్నిపాలుడు ఆశగా.

"రాజోద్యోగులు కూడా కొందరున్నారు. వాళ్ళల్లో ముఖ్యుడు అవజ్ఞవర్మ అనే ఆయన," అన్నాడు ధర్మనందుడు.

"అవజ్ఞవర్మా!" అంటూ అగ్నిపాలుడు నిశ్చేష్టుడై, "అతడూ మానుకోటకేనా ప్రయాణం?" అని అడిగాడు.

"అవును. అతణ్ణి నవభోజరాజుగారు, స్వయంగా—తన ప్రతినిధిగా వ్యవహరించేందుకు మానుకోట పంపుతున్నారట! అక్కడ కాలభోజుడి పక్షియుల్లోని ముఖ్యులు చాలామంది న్యాయ

స్థానంలో విచారించబడుతున్నారని మీకు తెలుసుగదా?" అంటూ ధర్మనందుడు, అగ్నిపాలుడికేసి జాలిగాచూస్తూ, "మీరు దురదృష్టవంతులు. మీవంటి ఉత్తముల్ని బందీగా పట్టుకోవలసిరావటం, నా దురదృష్టం! మీరు కాలభోజుడి పక్షంవారయినా, నా మిత్రుడైన జయసింగ్‌కు మిత్రులు కావటం ద్వారా...ఒక రకంగా నాకూ మిత్ర సమానులే!" అన్నాడు.

అగ్నిపాలుడు యీ మాటలేవీ వినటం లేదు. అతడు అవజ్ఞవర్మను గురించి ఆలోచిస్తున్నాడు. నవభోజుడి దృష్టిలో, యీ పనికి మాలిన అవజ్ఞవర్మ హఠాత్తుగా అంత గొప్ప విలువ... మానుకోటలో ఆయన ప్రతినిధిగా వ్యవహరించేంత విలువ, ఎలా సంపాదించుకోగలిగాడు? తను చంద్రగిరినగరం వదిలిన తరవాత, అక్కడ జరిగిన విశేషాలేమీ తనకు తెలియవుగదా!

"ధర్మనందా, ఒక్కమాట!"అంటూ అగ్నిపాలుడు, ధర్మనందుణ్ణి దగ్గరకు రమ్మన్నట్టు సౌంజ్ఞచేసి, అతడు రాగానే గొంతు తగ్గించి, "ఈ అవజ్ఞవర్మను నేనెరుగుదును. కాని, అతడికన్న నేను బాగా ఎరిగిన రాజాశ్రితులు మరొకరిద్దరున్నారు. అగ్నిపాలుడనే వ్యక్తినిగురించి ఎవరైనా మాట్లాడుకోవటం విన్నావా?" అని అడిగాడు.

"అగ్నిపాలుణ్ణి గురించి యివ్వాళ వినటమేం, లోగడే విన్నాను. అతడు నవభోజరాజు సలహాదార్లలో ముఖ్యుడు గదా! అతడు మరణించినట్టు మీరు వినలేదా?" అని ధర్మనందుడు ఆశ్చర్యంగా ప్రశ్నించి, "అతడు యీ ప్రాంతాలే ఎక్కడో మరణించి, రెండు మూడు వారాలు కావస్తున్నది. అతడు చంద్రగిరి నగరంనుంచి ఏదో పనిమీద యిటు వస్తూ, ఎవరికీ కనబడకుండా మాయమయాడు. కొందరు చెప్పటం, అతడు ఏ నదిలోనో మునిగిపోయి వుంటాడని; అతడి గుర్రం దొరికింది. అతడి సేవకులు దాన్ని గుర్తించారు," అన్నాడు.

"సరే, ఆ విషయంగురించి ప్రస్తుతం ఎవరైనా మాట్లాడుకుంటున్నారా? బహుశా, వారిలో ఒకరు అతడి శవాన్ని చూసివుండవచ్చు," అన్నాడు అగ్నిపాలుడు మందహాసం చేస్తూ.

"అతడు మరణించినట్టు మాత్రం చెప్పుకుంటున్నారు; అంతేగాని, శవాన్ని చూసినట్టు ఎవరూ చెప్పుకోగా వినలేదు," అన్నాడు ధర్మనందుడు. అగ్నిపాలుడి కుతూహలం చూసి ఆశ్చర్యపోతూ.

"ధర్మనందా! నువ్వు మొదటినుంచీ, నేనంటే ఎంతో గౌరవం చూపుతున్నావు. ఆ రుణం ఇప్పట్లో తీర్చుకోలేను. బందీ అయిన వారెవరికీ యివ్వని సౌకర్యాలూ, స్వేచ్ఛా నా కిచ్చావు. మరోలా భావించకపోతే... ఇప్పుడు నాకొక సహాయం చేయాలి," అన్నాడు అగ్నిపాలుడు.

"ఏమిటది? చెప్పండి" అన్నాడు ధర్మనందుడు.

''ఈ అవజ్ఞవర్మ, రాజప్రతినిధిగా మానుకోట వెళుతున్నట్లు చెప్పావు గదా. అతడితో నేను మాట్లాడాలనుకుంటున్నాను. నిజం దాయట మెందుకు, అతడు నన్ను బాగా ఎరుగును," అన్నాడు అగ్నిపాలుడు.

ధర్మనందుడు సంశయిస్తూ, ఓ క్షణ కాలం ఆగి, "బందీగావున్న మిమ్మలను యితర్ల దగ్గర స్వేచ్ఛగా తిరగనివ్వటం వేరూ... అదే, రాజప్రతినిధి దగ్గర అనుమతించటం వేరూ గదా? వారి దృష్టిలో రాజద్రోహి అయిన మీకు... లేనిపోని సహాయం చేస్తున్నానని, ఈ రాజప్రతినిధి భావిస్తే...''అంటూ, ఆ పైన మాట పెగలక తడబడ్డాడు.

ధర్మనందుడి సంకట పరిస్థితి అర్థం చేసుకున్న అగ్నిపాలుడు, ఎంతో కృతజ్ఞత కనబరుస్తూ, ''ధర్మనందా! నన్ను ఒంటరిగా, ఆ రాజప్రతినిధి అవజ్ఞవర్మ దగ్గరకు వెళ్ళనియ్య నవసరంలేదు. నేను బంధితుడననే అతడు గుర్తించే విధంగా మీరూ, మరిద్దరు సైనికులూ, నా వెంట కాపలావుండండి. నేను కోరేదల్లా... అతణ్ణి, కనీసం అంతదూరాన్నుంచయినా చూడగలగటం. బహుశా, అతడే ముందు నన్ను గుర్తించి, పలకరించవచ్చు. అప్పుడు మీరు పొందబోయే ఆశ్చర్యం అంతాయింతా కాదు!" అన్నాడు.

"ఇప్పుడాయన పానీయాలు తీసుకునే శాలలో వున్నాడు. అక్కడికే వెళదామంటారా? "అని అడిగాడు ధర్మనందుడు.

"అవును. ఈ సత్రంలోవున్న ఎవరైనా డబ్బు చెల్లించగలిగితే, ఆ శాలలో ప్రవేశించి, పానీయాలు సేవించవచ్చు గదా? ఇక, నేనా; మామూలు బంధితుణ్ణి కాదు—కూర్మశైలం దగ్గర, గొప్ప సైనిక విభాగానికి నాయకత్వం వహించిన సేనానిని!" అన్నాడు అగ్నిపాలుడు తాపీగా.

''ఇక లేవండి, వెళదాం. నేను హనుమప్ప సేనాని ఆజ్ఞప్రకారం మిమ్మలను బందీగా పట్టుకున్నాను కాని, ఈ అవజ్ఞవర్మగారివల్లకాదు," అంటూ ధర్మనందుడు లేచినిలబడ్డాడు.

ముందు ధర్మనందుడూ, వెనుక యిద్దరు సైనికులూ, మధ్య తనూ; ఈ విధంగా అగ్నిపాలుడు పానశాల ప్రవేశించేసరికి, అందరి దృష్టి ఒక్కసారిగా వారిమీదికి ప్రసరించింది. అగ్నిపాలుడు శాలలోని అన్నివైపులకూ తలతిప్పుతూ, అవజ్ఞవర్మకోసం పరీక్షగా చూడసాగాడు.

అవజ్ఞవర్మ మరి ఇద్దరితోకలిసి, ఒక బల్లముందు కూర్చుని పానీయాలు సేవిస్తున్నాడు.ముందుగా అతడిపక్కనవున్న వారిదృష్టి, అగ్నిపాలుడిమీద పడింది. వాళ్ళు కొద్దిగా ఆశ్చర్యపోయి, పాన

పాత్రలను చప్పున బల్లమీద పెడుతూ, "ఎవరూ? దుస్తులనుబట్టి చూస్తే...చాలా ముఖ్యమైన రాజద్రోహిలా వున్నాడే! కాలభోజుడి ముఖ్యానుచరుడు కాదు గదా!" అన్నాడు స్వగతంలా.

అవజ్ఞవర్మ చటుక్కున తల తిప్పి, అగ్నిపాలుడికేసి చూశాడు. ఒక్క లిప్తకాలంలో అతడిముఖంలో ఆశ్చర్యం, ఆందోళనా మిళితమై, అంతలోనే కరుడు కట్టిన క్రోధంలా మారిపోయింది. అతడి పెదాలు బిగుసుకున్నవి. ముక్కుపుటాలు అదిరినై. అతడు దృష్టిని అగ్నిపాలుడి మీదనుంచి, ముందు నడుస్తున్న ధర్మనందుడి మీదికి తిప్పి, తరవాత వెనక వస్తున్న సైనికులకేసి పరీక్షగా చూశాడు. ఆ వెంటనే అతడి పెదాలమీద చిరునవ్వు తళుక్కున మెరిసింది. నేత్రాలు కొత్తకాంతితో మిల మిలలాడినై.

అగ్నిపాలుడు,అవజ్ఞవర్మ ముఖభంగి మళ్ళి చూసి గతుక్కుమన్నాడు. ఆ చూపుల్లో అతడు తనను గుర్తించిన జాడలేమీ లేవు. అతిగా పానీయం సేవించటంవల్ల, అతడి నేత్రాలు మసకబార లేదు గదా? అనుకున్నాడతడు.

అగ్నిపాలుడు ఒక త్రుటికాలం నిశ్చేష్టుడై, ఏమిచేయటానికీ తోచక, మరుక్షణం సావధానుడై అవజ్ఞవర్మకేసి చిరునవ్వుతో నడుస్తూ, "వర్మా! ఇప్పుడే నీ ఉన్నతోద్యోగం గురించి విన్నాను, అభినందనలు!" అన్నాడు.

అవజ్ఞవర్మ తోక తొక్కిన తాచులా లేచినిలబడ్డాడు. అతడి కళ్లు నిప్పులు చెరిగినై. "ఎవడీతడు?" అంటూ అగ్నిపాలుడి పక్కన నడుస్తున్న ధర్మనందుడికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

ధర్మనందుడు వున్నచోటనే ఆగిపోయి, ఆశ్చర్యంగా, కొంచెం భయంగా అగ్నిపాలుడి ముఖంలోకిచూసి, అవజ్ఞవర్మకు జవాబివ్వబోయేంతలో, అగ్నిపాలుడు కోపంగా చేయివూపి, "వర్మా, యిది హాస్యమా? లేక నేనెవరినో గుర్తించలేనంత పానీయ మత్తుడుగా వున్నావా?" అని అడిగాడు.

"ఎవడీ ఉన్మాది? నేనింతసేపటి నుంచీ రాజద్రోహి అని మాత్రమే అనుకుంటున్నాను!" అన్నాడు అవజ్ఞవర్మ ఎంతో యీసడింపుగా.

"అయ్యా, యీయన విష్ణుమిత్రుడనే కాలభోజుడి పక్షీయుడు. మహా సేనాని హనుమప్పనాయకుడి ఆజ్ఞమేరకు, ఈ ఉదయమే బందీగా పట్టుకుని, మాను కోటకు తీసుకుపోతున్నాను. నా పేరు ధర్మనందుడు," అన్నాడు ధర్మనందుడు.

"అయితే, యీ రాజద్రోహికి, రాజభక్తులుండే పానశాలలో పనేమిటి? వెంటనే..."

"అవజ్ఞా! ఇక చాలు. ఆ దురుసు



మాటలు ఇంతటితో కట్టిపెట్టు!" అంటూ అగ్నిపాలుడు భీకరంగా గర్జించి, "నువ్వేదో నన్ను హతమార్చేందుకు కుతంత్రం పన్నినట్టుంది కాని, అది కొనసాగే అవకాశం లేదు. నా శక్తి సామర్థ్యాలు నీకు తెలియనివి కాదుగదా? ముందే హెచ్చరిస్తున్నాను," అన్నాడు.

"వీడెవడో రాటుతేలిన పిచ్చివాడిలా కనిపిస్తున్నాడు!'' అంటూ అవజ్ఞవర్మ తన మిత్రులకేసి, తరవాత చిరునవ్వుతో "ఉన్మాదీ! నీ పేరైనా నీకు గుర్తున్నదో లేదో నాకు తెలియటంలేదు. ఏమిటా పేరు... విష్ణుమిత్రుడా? చాలా మంచి పేరు!" అంటూ బిగ్గరగా నవ్వి, "నువ్వెవరివో నీకు తెలియకపోయినా, కనీసం నేనెవరైనదీ తెలిసినట్టున్నది. చాలా సంతోషం!" అంటూ ఆగి, ధర్మనందుడికేసి గుడ్లురుముతూ, ''ధర్మనందా, నీకు

సైనిక మర్యాదలుగాని, రాజమర్యాదలు గాని తెలిసినట్టులేదు. ఇటువంటి రాజ ద్రోహిని స్వేచ్ఛగా నేనున్న ప్రదేశానికి తీసుకురావటం..." అని యింకేమో అనబోయాడు.

అగ్నిపాలుడు యిక సహించలేక పోయాడు. మహోద్రేకంతో అతడు ఒక్క ఉదుటున ముందుకుపోయి, కను మూసి తెరిచేంతలో అవజ్ఞవర్మ కంఠాన్ని తన గుప్పెటలో పట్టుకుని, "ఛీ, దుర్మార్గుడా!" అంటూ గట్టిగా వెనక్కు నెట్టాడు.

అవజ్ఞవర్మ వేళ్ళూడిన మానులా దభీ మంటూ వెనక్కు పడిపోయాడు. అదే సమయంలో, యీ హఠాత్ సంఘటన కలిగించిన ఆశ్చర్యాన్నుంచి తెప్పరిల్లిన అతడి మిత్రు లిద్దరూ, అగ్నిపాలుడి మీద కలియబడ్డారు.

ఇది సమఉజ్జీలమధ్య జరిగే పోరు కాదని గ్రహించిన ధర్మనందుడు, తన సైనికులను హెచ్చరించి, ఒక్క దూకున అవజ్ఞవర్మ మిత్రులనుంచి, అగ్నిపాలుణ్ణి విడిపిస్తూ, "అయ్యా, యిక ఆగండి! ఒక వ్యక్తిమీద ఇద్దరు కలియబడటం ధర్మం అనిపించుకోదు," అన్నాడు కోపంగా.

ఆ సరికి అవజ్ఞవర్మ లేచి నిలబడ్డాడు. అతడి కళ్ళు నిప్పు కణాళ్ళా కణ కణ మంటున్నవి. అతడు మునిపళ్ళతో గట్టిగా ఓమారు పెదాలు కొరుక్కుని, "ధర్మనందా! ఈ రాజద్రోహిని విచ్చల విడిగా వదలటంలో, నీ ఉద్దేశ్యమేమిటో తెలియటంలేదు. నీవెవరి సేవకుడవు?" అన్నాడు.

ఆ పదజాలం ధర్మనందుణ్ణి రెచ్చ గొట్టింది. "నేను, నవభోజ మహారాజు గారి సేవకుణ్ణి. నా సైనిక దుస్తులు చూచిన ఎవరైనా తెలుసుకోగలరు! ఈ ప్రశ్న వేస్తున్న మీరు, ఎవరిసేవకులు?" అని అడిగాడతను.

"ఈ అవజ్ఞుడు దబ్బుకూ,అధర్మానికీ దురహంకారానికీ సేవకుడు!" అంటూ అగ్నిపాలుడు హూంకరించి, "అవజ్ఞా! నీవిప్పుడు నాకు చేసిన అవమానానికి, ఒకానొక రోజున చింతిస్తావు! ఆ రోజు కూడా ఎంతో దూరంలోలేదు," అంటూ గిరుక్కున వెనుదిరిగాడు.

అతడితోపాటే ధర్మనందుడూ, సైనికులూ బయలుదేరారు. వారు పాన శాల ద్వారం దాటి బయటికి వెళుతూం డగా, వెనకనుంచి అవజ్ఞవర్మ పెద్ద గొంతుతో, ఏవేవో ఆజ్ఞలు జారీచేస్తూం డటం వారికి వినిపించింది.

## 16

అగ్నిపాలుడూ, ధర్మనందుడూ సత్రంలో తాము బసచేసిన గదికిచేరారు. వారిద్దరూ అక్కడికి వెళ్ళేవరకూ, సత్రంలోవున్న అందరిదృష్టీ వాళ్ళ మీదే వున్నది.

గదిని చేరిం తరవాత అగ్నిపాలుడే




సంభాషణ ప్రారంభించాడు. "ధర్మ నందా! నాకోసం మీరు కూడా, ఆ అవజ్ఞ వర్మతో ఘర్షణపడ్డారు. ప్రస్తుతానికి అతడిదే పైచేయిగా వున్నది. మీరు మాత్రం మానుకోట చేరేవరకూ, తగు జాగ్రత్తలో వుండండి. ఆ తరువాత, అతడి అంతు నేను తేల్చి తీరతాను," అన్నాడతడు.

అగ్నిపాలుడి మాటలు, ధర్మనందుడికి చాలా ఆశ్చర్యం కలిగించినై. "విష్ణుమిత్రా! మీ మాటలు నాకు అంతుబట్టటం లేదు. ఆ అవజ్ఞవర్మతో మీరు సంభాషించినతీరు, నాకేమీ అర్థం కాలేదు. మీ మాటలనుబట్టి నేనూహిస్తున్న దేమిటంటే —మీరు నిజంగా విష్ణుమిత్రులై వుండరని, అవునా?" అన్నాడు ధర్మనందుడు.

అగ్నిపాలుడు యిక చేసేదేమీలేక, అవునన్నట్టు తల ఊపాడు.

"అయితే, మీరెవరు? మీ పేరేమిటి?" అని ప్రశ్నించాడు ధర్మనందుడు.

అగ్నిపాలుడు వెంటనే ప్రత్యుత్తరం యివ్వలేదు. ఇప్పటి సంకట పరిస్థితులలో, తానెవరైనదీ నలుగురికీ చెప్పుకోవలసిన అవసరం ఏర్పడినట్టు అతడు గ్రహించాడు. అవజ్ఞవర్మ ధోరణినిబట్టి తెలుస్తున్న దేమిటంటే, అతడు తనను విష్ణుమిత్రుడనే రాజద్రోహిగా ప్రకటించి, ఉరి తీయించాలని! అగ్నిపాలుడికి పందెం నాటి రాత్రీ, దానికి సంబంధించిన నియమ నిబంధనలతో రాసిన పత్రాలూ —వాటిని పరస్పరం మార్పిడి చేసుకోవటం—అంతా గుర్తుకొచ్చింది. తను వకుళమాలను భార్యగా పొందలేక

పోయినా, ఒకవేళ ఆ ప్రయత్నంలో మరణించినా, తన ఆస్థిపాస్థులు అవజ్ఞ వర్మకు సంక్రమిస్తవి; కనుక, అవజ్ఞ వర్మ తనను ఏవిధంగా అయినాసరే నాశనం చేయచూస్తున్నాడు. తను అతడి పన్నుగడనుంచి బయటపడాలంటే, తను అగ్నిపాలుణ్ణని చెప్పుకున్న మాత్రాన సరిపోదు; దాన్ని ధృవపరిచే సాక్ష్యం కూడా కావాలి;

ఆ క్షణాన అతడికి తన నౌకరు మాహూ గుర్తుకొచ్చాడు. బహుశా వాడు యీ ప్రాంతాలలోనే ఎక్కడో, తనకోసం వెతుకు తూండి వుంటాడు. అతడి విశ్వాసం గురించి అగ్నిపాలుడి కేనాడూ అపనమ్మకంలేదు. అదృష్టం కలిసి వస్తే, తను మానుకోట చేరేలోపలగాని, తన విచారణ ప్రారంభమయ్యే సమయానిగ్గాని, అతణ్ణి కలుసుకోవాలి. అలా జరిగితే, వాడు తనను గురించి సాక్ష్యం చెప్పగలడు అలా కానినాడు, రాజ ప్రతినిధిగా అవజ్ఞవర్మ, తనకు ఉరిశిక్ష పడేలా న్యాయాధిపతులద్వారా ప్రయత్నించి తీరుతాడు;

''ధర్మనందా; ఇప్పుడు నా ఊరు పేరుల గురించి నీకు చెప్పవలసిన సమయం వచ్చింది ఎందుకంటే, యిప్పటి పరిస్థితులలో అవజ్ఞవర్మ కుట్రనుంచి నేను బతికి బయటపడాలంటే, నాకు నీ సహాయం అవసరంఅవుతుంది," అన్నాడు అగ్నిపాలుడు.

ధర్మనందుడు, ఆశ్చర్యంగా అగ్నిపాలుడికేసి చూశాడు.

"నా పేరు అగ్నిపాలుడు; అగ్నిపాల సంస్థానాధిపతిని; ఆ పేరు ఎప్పుడైనా నీవు వినివున్నావా?'' అని అడిగాడు అగ్నిపాలుడు.

అగ్నిపాలుడన్న పేరు వింటూనే, ధర్మనందుడు నిశ్చేష్టుడయాడు. ఇది నిజమా అన్నట్టు అతడు, అగ్నిపాలుడి ముఖంలోకి గుచ్చి చూస్తూ, "మీరు నాతో హాస్యం ఆడటం లేదుగదా? అగ్నిపాలుణ్ణి గురించి, ఈ రాజ్యంలో తెలియని వారెవరు? ఆయన నవభోజరాజు ముఖ్య మిత్రుల్లో ఒకరని మాత్రమేగాక, జగ్గ రాజువంటి ఖడ్గప్రావీణ్యుణ్ణి, ద్వంద్వ యుద్ధంలో హతమార్చిన వీరుడని కూడా అందరికీ తెలుసు," అన్నాడు.

"అయితే, ఆ అగ్నిపాలుణ్ణి నేనే;" అన్నాడు అగ్నిపాలుడు చిరునవ్వుతో.

ధర్మనందుడు ఏమీ అనలేక, అలా చూస్తూ వూరుకున్నాడు అతడేదో సంశయంలో పడ్డాడని గ్రహించిన అగ్నిపాలుడు, "ధర్మనందా, నీవు నన్ను అగ్నిపాలుడని నమ్మి, బంధవిముక్తుణ్ణి చేయనవసరంలేదు. అది ఒకవిధంగా నీ గొంతుమీదికి తెచ్చుకోవటమే అవుతుంది. ఎందుకంటే, నీవు నన్ను బంధించవచ్చినప్పుడు, నేను విష్ణు మిత్రుడుగానే నీకు దొరికాను తరవాత



యీసంత్రంలో కూడా అందరూ నన్ను, విష్ణుమిత్రుడుగానే భావిస్తున్నారు. కనుక తగిన సాక్ష్యాధారంతో న్యాయాధిపతుల సమక్షాన, నేను అగ్నిపాలుణ్ణని ఋజువు పరచుకునేవరకూ, నీవు నన్ను రాజ ద్రోహిగానే భావించవలసి వుంటుంది. కాని, యీ మధ్యకాలంలో, కావాలను కుంటే నీవు, నాకు కొంత సాయంచేయ గలవు. అది ఏవిధంగానూ, నీకు కష్ట కారణంకాదు," అన్నాడు.

"సరే, చెప్పండి, ఏమిటా సహాయం? అని అడిగాడు ధర్మనందుడు.

"బహుశా, చంద్రగిరి రాజ్యంలో నా పేరు చాలామందికి తెలుసునేమో కాని, వ్యక్తిగతంగా నన్నెరిగినవారు బహు కొద్ది. ఆ మానుకోటలో నన్నెరిగిన వాళ్లొక్కరూ వుండరని, నా భయం. అదీకాక అలాంటివాళ్లెవరైనావుంటే... ఈ అవజ్ఞవర్మ ప్రస్తుతం తనకున్న అధి కారంతో, వాళ్ళనోళ్ళు మూయగలడు. అందువల్ల, నేను అగ్నిపాలుణ్ణని రుజువు చేసేందుకు, యిప్పట్లో నాకు సహాయ పడగలవాళ్ళు, నా సేవకులు మాత్రమే. వాళ్ళు నాకోసం, యీ ప్రాంతాలే ఎక్కడో తిరుగుతూవుంటారు. నీ వెంట వున్న సైనికులలో ఒకరిద్దరిని వెతక పంపితే, మాహూ అన్న నా ప్రధాన సేవకుడూ, యితర్లూ కనిపించకపోరు. వాళ్ళు నన్ను గుర్తించి, అవజ్ఞవర్మ కబంధహస్తాలనుంచి నన్ను రక్షించ గలరు." అన్నాడు అగ్నిపాలుడు.

"విష్ణుమిత్రా...అగ్నిపాలా! ఇందుకు

నేను తప్పక సహాయపడతాను. ఇప్పుడే యిద్దరు సైనికులను, ఆ పనిమీద పంపుతాను," అన్నాడు ధర్మనందుడు.

"చాలా కృతజ్ఞుణ్ణి!" అన్నాడు అగ్నిపాలుడు.

"అసలు మీరీ విషవలయంలో ఎలా చిక్కుకున్నారో, నాకు అనూహ్యంగా వుంది," అంటూ ఆశ్చర్యం ప్రకటించాడు ధర్మనందుడు.

అగ్నిపాలుడు నీరసంగా నవ్వాడు.

"ధర్మనందా? నీవన్నట్టు, నేను చాలా పెద్ద విషవలయంలోనే చిక్కుకున్నాను. దీనికి చాలావరకు నేనే బాధ్యుణ్ణి. అవజ్ఞవర్మవంటి తుచ్ఛుడూ, మూఢుడూకూడా నామీద విజయం సాధించినట్టు, ప్రవర్తిస్తున్నాడంటే—నామీద, నాకే జాలికలుగుతున్నది. కాని ఒకటి రెండు రోజుల్లో, యీ వలయం నుంచి, నేను బయటపడతాను. అప్పుడు, యీ అవజ్ఞవర్మ పడబోయేపాట్లు యిన్నీ అన్నీ కావు," అన్నాడు అగ్నిపాలుడు ఉద్రేకంగా.

"మానుకోటలో, కాలభోజుడి పక్షియులని చెప్పబడే వారిగురించి జరిగే న్యాయవిచారణ అంతా, కేవలం తంతు! గంటకు పదీ పన్నెండుమంది విచారించబడటం, శిక్షలు విధింపబడి, వెంటనే ఉరికంబం ఎక్కించబడటం — నేను స్వయంగా చూశాను. అదృష్టం కలిసి రాకపోతే, మీగురించిన న్యాయవిచారణా గంటలమీద తేలిపోతుంది!" అంటూ ధర్మనందుడు ఆగి, కొంచెంసేపు తల వంచుకు వూరుకుని, "మీ సేవకుడని చెప్పారే...ఆ మాహూ వెంటనే మన కంటబడితే, ఎంత బావుండును!" అన్నాడు.

"అవును, యిప్పట్లో నన్ను రక్షించగలిగినవాడు, మాహూ ఒక్కడే!" అనుకుంటూ అగ్నిపాలుడు పెద్దగా నిట్టూర్చాడు.

(సశేషం)





# పంజరం వదలని పక్షి

శ్యామలాంగి

అంజన టైము చూసింది, ఇంకా అయిదు పూర్తి కాలేదు. విసుగ్గా మొహం చిట్లించి 'అబ్బా, ఇంకా అయిదేనా' అనుకుంది.

ఆమెకు కాలం మహా ఘోరంగా నడుస్తున్నట్లుగా వుంది. ఎనిమిది అవడానికి ఇంకెంతసేపు నిరీక్షించాలో?

"అక్కా... అక్కా" పంజరంలోని రామచిలుక ముద్దుగా పిలిలింది ఉలిక్కిపడినా అంతలోనే సర్దుకుని పంజరం దగ్గరకెళ్ళి నిల్చుంది అంజన.

చిలుక దిగులుగా చూసింది. రెక్కలు విదిలించుకుంది. ఓ సారి ఆ మూలనుంచి ఈ మూలకు గిరగిర తిరిగింది. తిరిగి యజమానురాల్ని చూస్తూ నిల్చుంది పంజరంలో.

''ఆకలివేస్తున్నదా? పండు ఇవ్వనా?'' అంజన అలమరలోంచి చక్కెరకేళి అరటిపండు తీసి దానికి అంధించింది. కాని చిలుక దానివైపన్నా చూడలేదు. ఈసారి జామపండు అందించిందామె. ఓసారి ముక్కుతో దాన్ని పొడిచి వూరుకుంది చిలుక.

''నీకేం కావాలో నీకే తెలియదు నాలాగ, మనసులో అశాంతి తప్పించి.'' విసుక్కుంటూ పంజరం తలుపు మూసి, కిటికీ దగ్గరకెళ్ళి నిలబడింది అంజన రోడ్డుమీదకు చూస్తూ.

ఆ రోడ్డుమీద ఎంతమందో నడిచి వెళ్తున్నారు. వీళ్ళందరికీ తనలా అశాంతి లేదు కాబోలు ? ఎంత అదృష్టవంతులో! అంజన చూస్తుండగానే ఎదిరింటి డాబా లోంచి ఓ జంట ఇవతలకొచ్చింది. నవ్వుకుంటూ వెళ్ళే ఆ జంటను చూస్తున్న అంజనకు దుఃఖం ముంచుకొచ్చింది. "వాళ్ళెంత అదృష్టవంతులో, చక్కగా జంటగా ఎలా వెళ్తున్నారో సినిమాకో, షికారుకో'' అనుకుంది మనసులో. వాళ్ళ పెళ్ళయి ఇంకా నెలన్నా కాలేదు. చెట్ట పట్టాలేసుకుని తిరుగుతున్నారు హాయిగా.

''నీవూ తిరగొచ్చుగా అలా. నీ పెళ్ళయి ఆర్నెల్లు అయ్యింది తెలుసా'' మనసు లోతుల్లోంచి ఎవరో కవ్వించా రలా.

"ఊ ( అయ్యింది పెళ్ళి. ఆయనో జడపదార్థం. ఆ జడపదార్థంతో కాపురం చేయడానికి తీసుకురాబడింది తను. ఈ ఇంటికి ఇల్లాలు తను. అందంగా అలంక రించుకుని పంజరంలాంటి ఈ ఇంట్లో మ్రగ్గిపోవడానికే వచ్చింది తను. అంతే గాని ఓ ముద్దూ ముచ్చటా కూడానా తన భర్తకి. అయ్యోరాత'' భర్త జడత్వాన్ని తల్చుకుంటూ నిట్టూర్చింది అంజన.

"అమ్మాయ్ ఇక్కడున్నావా ?" అంటూ వచ్చింది అత్తగారు 'ఇక్కడ ఇలా కిటికీదగ్గర నిలబడొద్దని నీ కెన్ని సార్లు చెప్పాను' అనే భావంతో చూస్తూ.

అత్తగార్ని చూసి ఖంగారుపడలేదు అంజన. 'ఇక్కడ నిల్చుంటే ఏం? నా అందం కరిగిపోతుందా, తరిగిపోతుందా' అన్నట్లు పొగరుగా నిర్లక్ష్యంగా చూసింది అత్తగారివైపు. కోడలు ప్రదర్శించే నిర్ల క్ష్యానికి, దిమ్మరపోయింది అత్తగారు. అందానికి తగినట్లు 'వినయ విధేయతలు లేవు తన కోడల్లో. నిదానంగా దార్లో పెట్టాలి మరి. ఇంకాచిన్నతనం పోలేదు. అందుకే ఆ పెంకితనం' అని సమాధాన పడింది.

"చూడమ్మా" గొంతు మృదువుగా, సౌమ్యతగా పలికింది "ఈ వీధి మంచిదే కాని ఈ వీధిలో వుంటున్న జులపాల వెధవలు ఏమంత మంచివాళ్ళు కాదు. ఉద్యోగం సద్యోగం లేని సోమరి వెధ వలు అందమైన ఆడపిల్ల ఏ ఇంట్లో కని పిస్తుందా అని ఫోజులు కొట్టూ తిరుగు తుంటారు. ఆ రౌడీ వెధవల దృష్టి నీ మీద ఎక్కడ పడ్తుందో అని నా భయం" అందామె కోడలి అందాన్ని మనసులో మెచ్చుకుంటూ. ఈ అందం చూసే కాణీ కట్నం కోరకుండా కొడుక్కి పెళ్ళి చేసింది. రెండో పెళ్ళి అని పేరేగాని తన కొడుక్కి ఏమంత వయసు ముదిరి పోయింది. అసలు ఆ వయసుకి కొంద

రింకా పెళ్ళి చేసుకోవడం లేదుకదా. ఎంతమంది తిరిగారు తనచుట్టూతా కోరి కట్నం ఇస్తామన్నారు, సారె చీరెలు ఘనంగా ముట్టజెప్తామన్నారు కాని తను మొగ్గితేకదూ వున్న సంపద చాలు, పిల్ల దీపంలా తిరగాలి నట్టింట అనుకుంది. అలాంటి కోడలినే సంపాదించింది చివరకు.

"ఫేక్టరీ పనికిపోయే పిల్లనెలా చేసుకోనమ్మా. మన అంతస్థుకి ఆ పిల్ల తూగ లేదమ్మా" అని కొడుకు అడ్డుచెప్పబోయాడు. కాని తనే పట్టుబట్టింది'మనిషి పుట్టూ సంపద పట్టుకురాడు. చస్తూ తీసుకుపోడు. ఈ భూమ్మీద ఉన్నన్ని రోజులేను ఏది అనుభవించినాను. తామరపువ్వు బురదలోనే పుట్టుంది. అలా అని దాని అందం, ఆకర్షణా పోయాయా ? నాలుగురోజులు మన ఇంట్లో వుందంటే గొప్పవారి ఇంటి ఇల్లాలుగానే మారిపోతుంది. నేను మారుస్తాను కదా అలాగ' అని పట్టుబట్టి జరిపించింది పెళ్ళి.ఆవిడకు అందమైన కోడలిని చూస్తే గర్వం, తృప్తీను.

అత్తగారి మాటలకు ఎలాంటి సమాధానమూ చెప్పలేదు అంజన. మెదలకుండా చూడసాగింది. "మల్లెపూల పొట్లం, ఏవో పుస్తకాలు పంపించాడు అబ్బాయి. రేడియోబల్లమీద పెట్టాను. పూలు దండగుచ్చి పెట్టుకోలేక పోయావా?"

"కాస్సేపాగి పెట్టుకుంటాను."

వంటఇల్లు గుర్తుకొచ్చి లోపలికి వెళ్ళి పోయిం దత్తగారు.

గుండెలనిండా గాలి పీల్చుకుంది అంజన.

ఖరీదుగల చీర కట్టుకుని, నగలు పెట్టుకుని, తలలో పూలు సింగారించుకుని కూర్చోవాలి తను. ఎప్పుడో అర్ధరాత్రి దాటాక తాగినమైకంతో తూలుకుంటూ వస్తాడు భర్త. వచ్చి రావడంతోనే మంచంమీద పడి గొడ్డులా నిద్రపోతాడు. ఆ పాటిదానికి ఈ అలంకరణ అంతా దేనికో ? 'బహుశా తన భార్య అందం నలుగురూ చూసి మెచ్చుకోవాలని కాబోలు వెగటుగా నవ్వుకుందామె."

రోడ్డుమీద ఎవరో అబ్బాయి పాడుకుంటూ వెళ్తున్నాడు "ఎందుకే నీకింత తొందరా" అంటూ.

"ఇక కొన్ని గంటలే నీకీ పంజరపు బాధ. ఆ తర్వాత హాయిగా స్వేచ్ఛగా ఎగిరిపోతావు" వేగిరపడే మనసుని ఓదార్చు కుందలా. రేడియోకవర్లో దాచిన ఉత్తరం తీసి మళ్ళీ చదువుకుంది. ఆ ఉత్తరం నరహరిరాశాడు. అది ఉదయం తనకి ఇచ్చారెవరో. అసలు నరహరి ఆ ఊరు వస్తాడని, అంత ధైర్యంగా తనకి ఉత్తరం రాస్తాడని, తను కలలో కూడా ఊహించలేదు.

"ఎనిమిదిగంటలకు స్టేషన్ కి రావాలి, నీకోసం ఎదురుచూస్తూ వుంటాను. మన

స్నేహం శాశ్వతం కావాలనుకుంటే తప్పనిసరిగా వస్తావు. నీకోసం ఎదురు చూస్తూ వుంటాను. వస్తావుకదూ'' అని రాశాడు నరహరి.

అతన్ని చూసి ఆర్నెల్లు అయ్యింది. అసలు దేవుడు చిన్నచూపు చూడబట్టి గాని లేకపోతే నరహరీ, తనూ భార్యా భర్త లయ్యేవాళ్ళు. నరహరి ఎంతబాగుం టాడు.

ఆ రోజులు జ్ఞాపకం రాసాగాయి అంజనకు.

తను ఆ వీధిలో పిల్లల్తో కలిసి ఫ్యాక్టరీ పనికి వెళ్ళేది. కూలీలమీద మేస్త్రీ నర హరి. అక్కడే ఇద్దరికీ పరిచయం అయ్యింది. పరిచయం ప్రేమగా మారింది. ఒకర్నొకరు చూడందే ఉండ లేని స్థితికి వచ్చారు. పెద్దవాళ్ళతో చెప్పి పెళ్ళిచేసుకోవాలని కలలు కన్నారు. కాని తన నుదుటిరాత మరోలా వుంది.

ఆ రోజు అంజన వచ్చేస్తుంటే నర హరి ఆపి "మీ ఇంటికి మా తాతయ్యను పంపిస్తున్నాను" అన్నాడు. ఎందుకో తెలిసినా తెలియనట్టే "ఎందుకేఁవిటి" అని ఎదురుప్రశ్న వేసింది అంజన.

"ఇందుకు" అంటూ అటూ ఇటూ చూసి అంజనచేతిని పట్టుకుని గుండె మీద అదుముకున్నాడు నరహరి. ఆ మాటకి తోలెడంత సిగ్గుపడింది అంజన. మరక్కడ ఆగలేకపోయింది. ఎవతో తరుఁవుతున్నట్లు ఇంటిముఖం పట్టింది.

ఎప్పుడూరాని మేనమామ గుమ్మంలో ఎదురొచ్చాడు. ఉత్సాహంతో ఉరు క్కుంటూ వచ్చి మేనకోడలిని చూసి నవ్వుతూ" మన అంజన చాల పెరిగి పోయిందే" అన్నాడు.

పెరక్క నీలా పొట్టిగా వుండమం టావా" పెంకిగా అంది అంజన.

"ఊఁ మాటలు కూడా నేర్చింది" అన్నాడతను మాడ్చుకున్న మొహంతో.

''తప్పు. ఏఁవిటామాటలు''కూతుర్ని మందలిస్తూ వచ్చింది, తల్లి లోపల్నించి.

"నీ కూతురు అదృష్టవంతురాలేనే అక్కయ్యా"

''తన అదృష్టం సంగతి మావయ్య క్కూడా తెలిసిపోయిందా.''

నరహరి వాళ్ళ తాతయ్యను ఇవ్వాళే పంపించాడు కాబోలు. అందుకే అమ్మ అంత సంతోషంగా కనిపిస్తున్నది! అంజన బుగ్గల్లో మందారాలు పూయగా, తల్లి వైపు, మేనమామ వైపు చూసింది కొత్త పెళ్ళికూతురిలా.

"అలా చూస్తావేమే మొద్దూ! నీకు మొగుణ్ణి తెచ్చినందుకు నాకేం బహు మతి ఇస్తావో చూస్తాగా."

"జీవితాంతం నీకు రుణపడి వుంటుం దిరా తమ్ముడూ" అంది సూరమ్మ తమ్ముడి వైపు అభిమానంగా చూస్తూ.

"అక్కయ్యా! దీని అత్తారిల్లు ఎంత పెద్దదనుకున్నావూ... గదిగదికీ అద్దాల బీరువాలు, కుర్చీలు, బల్లలు, ఒకటేఁవిటి



ఇల్లు దేవేంద్ర భవనంలా వుంటుందంటే నమ్మ.

వింటున్న అంజన ఉలిక్కిపడింది. నరహరికి అంత పెద్ద ఇల్లు వుందా! వుంటే ఇంతచిన్నపనికి ఎందుకు కుదురుతాడు. ఆమె వూహాలు అలా సాగుతున్నాయి.

"అంత గొప్పవాళ్ళకి మనపిల్ల నచ్చుద్దో లేదోరా''సూరమ్మ అనుమానం.

"ఎందుకునచ్చదూ, మహాచక్కగా నచ్చుతుంది, నువ్వే చూస్తావుగా మన అంజన అదృష్టం ఎంతటిదో."

"ఏమో అంతా నీదేభారం" అందామె, కూతురి తల నిమురుతూ.

వాళ్ళిద్దరి మాటలు అంజనకు అంతు చిక్కడంలేదు. గుండెలో గుబులు, ఆదుర్దా, ఆందోళన.

కిష్టమ్మ వెళ్తూ అక్కగార్ని మరోసారి హెచ్చరించాడు. ''నీకేంభయమక్కర్లేదే అక్కయ్యా. నేను దగ్గరుండి అన్నీ సవ్యంగా జరిపిస్తాను కదా" అని.

"మావయ్య అంటున్నాదేఁవిటే ?" ఏఁవీ తెలియనట్లే అడిగింది తల్లిని.

"రామాయణమంతా విని, రాముడికి

సీత ఏమౌతుందని' ప్రశ్నించాడట నీలాంటి పిచ్చిమొద్దు ఒకడు. అలావుంది నీ ప్రశ్న. మామయ్య నీ కో సంబంధం కుదుర్చుకొచ్చాడు తెలుసా. వాళ్ళు బాగా ఉన్నవాళ్ళేనట. కట్నం కాణీ పుచ్చుకో రట. ఒక్కడే కొడుకట. ఉభయ ఖర్చులూ వాళ్ళవేనట. వాళ్ళకి పిల్ల అందంగా, సంప్రదాయ కుటుంబం లోంచి వచ్చిన పిల్లయితే చాలట. ఇదంతా నీ అదృష్టమేను. లేకపోతే ఎంతో గొప్పవాళ్ళకుగాను లభించని సంబంధం మనలోటి పేదవాళ్ళను వెతు క్కుంటూ వస్తున్నదంటె అదంతా మామయ్య నిర్వాకమేను" తీగలాగితే డొంకంతా కదుపుతుందామె. "నీ కాబోయే అత్తగారు రేపు వస్తుందట. నిన్ను చూసుకుని నచ్చితే ముహూర్తం కూడా పెట్టుకెళ్తుందట."

ఆ మాట వింటూనే నిర్విణ్ణురాల య్యింది అంజన. తనకు పెళ్ళిచూపులా? అందులోనూ వేరొకరితోనా? అసంభవం.

"ఈ పెళ్ళిజరగడానికి వీల్లేదు" గట్టిగా అరిచి చెప్పాలనుకుంది అంజన. "నేనూ, నరహరీ ప్రేమించుకున్నాము. అతన్ని తప్పించి మరెవర్నీ చేసుకోను. చేస్తే నూతిలో దూకి చస్తాను" అనాలనుకుంది. కాని ఆ మాటలు అనడానికి ధైర్యం చాల్లేదు. ఎంతయినా తను ఆడపిల్ల, అంత పట్టిగ్గా తన ప్రేమ, పెళ్ళిగురించి ఎలా చెప్పుకుంటుంది? మనసులో ఏడ్చు కుంటూ అలాగే నిలబడిపోయింది.

ఆ మర్నాడు వరుడి తల్లి రావడం, ఆమెకు అంజన బాగానచ్చడం, వెంటనే ముహూర్తాలు పెట్టుకోవడం, పెళ్ళిగుళ్ళో జరిగిపోవడం, వారం తిరక్కుండా అత్తారింటికి వెళ్ళిపోవడం అన్నీ చకచకా జరిగిపోయాయి.

కాస్త ముదరవయసులోవున్న అల్లు డిని చూసి మొదట్లో మూలిగినా, అల్లుని వెనకాలవున్న ఆస్థి అంతస్థూ చూసి, వాళ్ల పిల్లకు పెట్టిన నగలు, బట్టలు చూసి సంతృప్తిపడిన సూరమ్మ. నలభై ఏళ్ళు ఓ వయసేమిటి. అసలు పెళ్లాడే వయ సంటే ఇదేను, అని సమాధానపడింది.

తనకంటె రెండు రెట్లు పెద్ద వయ సులోవున్న భర్తనుచూసి అంజనే మొహం ముడుచుకుంది బాధగా. నరహరి ఎంత బాగుంటాడు అనుకోబోయి ఛ...నాకు పెళ్ళయిపోయింది. పరాయి మగాడిని తల్చుకోవడం మహాపాపం అని మనసులోనే రెండుచెంపలూ వాయించు కుంది. ఇష్టంవున్నా లేకపోయినా ఈ భర్తతో జీవితాంతమూ గడపాలి తను. అందుకు తగిన ఆత్మస్థైర్యం ఇయ్యి ప్రభూ' అని దణ్ణం పెట్టుకుంది. అత్త వారింట్లోకాలుపెట్టిన అంజనకుమరికొన్ని రహస్యాలుతెలిసాయి. తనభర్తకురెండో పెళ్ళి అని, ఆ మొదటిభార్య ఇంకా బ్రతికే వుందని, ఆమెకూ, భర్తకూ



మనసులు కలవక కోర్టుద్వారా విడిపో యారని, ఆమె మరో భర్తతో సుఖంగానే వుందని, తన వంశ వృద్ధికోసమే భర్త మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడని. అత్తగారు ఈ కోడలిని అందరికీ చూపెట్టి 'మా కోడలు నిజంగా బంగారుబొమ్మ సుమండి' అన్నట్లు మురిసిపోయింది. ఆ మర్నాడు అంజన గుమ్మంలో నిల్చుని వుంటే 'అయినింటిపిల్ల అలాతలవాకిట నిలబడకూడదు' అని ఆంక్ష పెట్టింది.

రాత్రి బాగా తాగివచ్చిన భర్తనుచూసి అసహ్యించుకుంది. అంజనకు తాగుబోతు లన్నా, జూదరులన్నా, వ్యభిచారులన్నా పరమఅసహ్యం వాళ్ళనుచాలా ఏవగించు కుంటుంది. కాని తన భర్తే తాగివచ్చా డిప్పుడు. ఆ భర్తను చూస్తుంటే తనమీద తనకే జాలి, దుఃఖం. అందరూ తన అదృష్టం గురించి చెప్పుకుంటున్నారు, 'పూటకు ఠికానాలేని పిల్ల తంతే బూర్లె గంపలో పడినట్లు ధనవంతుల కోడ లయ్యింది. అటువంటి అదృష్టం అందరికీ దొరకవద్దా. ఏ జన్మలోనో చేసిన పుణ్యం కొద్దీ ఈ జన్మలో అటువంటి అదృష్టం లభించింది' అంటూ. వాళ్లంతా మెచ్చు కునే అదృష్టం ఇదేనా? 'తాగుబోతయిన భర్త, నాలుగ్గోడల మధ్యా మగ్గిపోయే పంజరపు బ్రతుకు. వట్టి పంజరం కాదు. ఇది బంగారు పంజరం' గతాన్ని తల్చు కుంటూ బరువుగా నిట్టూర్చిం దామె.

ఆమె ఏకాగ్రతను చెదరగొట్టూ చిలుక మళ్ళా పిల్చింది "అక్కా... అక్కా" అని. దాన్నిచూస్తుంటే అకారణం

గానే కోపం ముంచుకొస్తున్నది అంజనకు. "నీ కీ చెర ఎందుకు?" పంజరం తలుపు తీసేసి వెళ్ళి మంచంమీద కూర్చుందామె. చాపిన చేతికి ఏదో పుస్తకం దొరికింది ఇంకోగంట కాలం గడవాలి, తర్వాత తనకి పంజరం బ్రతుకు దూరమైపోతుంది.

పుస్తకం పేజీలు తిరగవేసింది,'కాలు జారింది' అనే కథ చదవసాగింది. మధ్యాహ్నం ఆ కథని కొద్దిగా చదివి, విసుగుపుట్టి వదిలేసింది. అదే కథని పూర్తిచేయాలనుకుంది. 'కొత్తగా పెళ్ళయిన దంపతులు తిరుపతి వెళ్తారు. దేవుడి దర్శనమై తిరుగు ప్రయాణంలో కాలినడకను దిగి వస్తుంటారు. దారిలో ఓ బిచ్చగత్తె కనిపిస్తుంది. ఆ మనిషి వంటినిండా పుళ్ళు, వాటిమీద ఈగలు ఝుమ్మంటూ ముసురుతుంటాయి. ఆఈగలను తోలుకునే శక్తికూడా వుండదు ఆ మనిషికి. రోగంతో, ఆకలితో సొమ్మసిలినట్లు పడివుంటుంది. ఆ మనిషిని చూసి జాలితో డబ్బు ఇవ్వడానికి దగ్గరగా వెళ్ళిన యువతి త్రుళ్ళిపడుతుంది. ఆ మనిషిని పంతులుగారి భార్యగా గుర్తించి ఏవగింపుతో మొహం తిప్పుకుని ఇవతల కొచ్చేస్తుంది.

"ఆ మనిషి నీకు తెలుసా?" అని అడుగుతాడు భర్త.

"ఆఁ తెలుసు. మాపక్కింటి పంతులుగారి భార్య" అంటుందామె ఆర్ద్రమైన స్వరంతో.

"మరిక్కడ..." సందేహంతో ఆగిపోతాడు భర్త.

"కాలుజారిన మనిషికి చివరగా ప్రాప్తించే స్థితి ఇదేకదా" అంటుందామె. భార్య మాటల్లోనిశ్లేష గ్రహించలేదా భర్త. "అంటే" అన్నాడు.

మా పక్కింటి పంతులుగారు మొదటి భార్య పోతే మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు. ఆమెకు ఇద్దరు పిల్లలు పుట్టాక ఒక కాలేజీ స్టూడెంటుతో లేచిపోయింది. అక్కడనుంచి ఇంకెన్ని చేతులు మారి ఇంకెన్ని బాధలుపడో చివరకు బిచ్చగత్తెగా తిరుపతి కొండని ఆశ్రయించుకొన్నది. భార్య లేచిపోయిన అవమానంతో భర్త ఆత్మహత్య చేసుకుంటే లేచిపోయినదాని సంతానం అనే ముద్రతో అవమానంతో ఈమె పిల్లలు అక్కడ అడుగడుక్కీ బాధపడుతూ పంచలపాలై బ్రతుకుతున్నారు. ఇక్కడ ఈవిడ స్థితి ఇదీ. చూసారా తొందరపాటుతో, మోహోద్రేకంతో ముందూ వెనుకా ఆలోచించకుండా ఈమె వేసిన తప్పటడుగు ఎందరిని బాధపెట్టిందో? పోనీ తనకైనా సుఖం లభించిందా అంటే అదీ లేదు. కుక్కలు చించిన విస్తరిలా అయిపోయిందామె బ్రతుకు. ఛీ ఇటువంటివారిని కంటితో చూస్తేనే పాపం. పదండి పోదాం" అంటూ భర్తచేయి పట్టుకుని ముందుకి లాక్కుపోతుందామె.

అంతా విన్న ఆ బిచ్చకత్తె కూడా మొహంమీద చెంగేసుకుని రోధిస్తూ వుండిపోయింది, "కాలుజారిన ఆడదాని గతి ఇంతే తల్లీ" అనుకుంటూ.

కథ పూర్తిచేసిన అంజన ఆలోచన్లో పడింది. 'ఇప్పుడు నాతో వచ్చేయి' అని పిలిచిన నరహరి తనని జీవిత పర్యంతం ఆదరిస్తాడా? లేక మోజు తీరగానే వదిలేస్తాడా? అలా వదిలేస్తే ఈ కథలోని బిచ్చకత్తెలాగానే తన బ్రతుకూ మారిపోతుంది. అప్పుడు తనవైపు ఎవరూ కన్నెత్తి చూడరు. నేను కూడా పంతులు గారి భార్యలా తప్పటడుగు వేయబోతున్నానా?" తనని తను ప్రశ్నించుకుంది పిచ్చిగా. 'ముమ్మాటికీ తప్పటడుగేను' అంది అంతరాత్మ.

"ఇక్కడ, ఈ నాలుగ్గోడల మధ్యా, భార్యగా నీకు వుండే రక్షణ, గౌరవం, అక్కడ లభించవు. ఎందరి వాంఛలకో బలైపోతావు. నిన్ను నీవు నాశనం చేసుకోవాలంటే వెళ్ళు. ఇక్కడ నీకొచ్చిన లోటేవిటి? కోరిన చీరలు, కోరిన నగలు, కడుపునిండా తిండి, భర్తా, అత్తగారి ఆదరణా, అభిమానం గృహిణిగా నీకు లభించే మన్నన, మర్యాదా ఇవి చాలవా? ఆడదాని కింతకంటే కావాల్సిం దేవిటి? యవ్వనోద్రేకం, మోహం, పాలపొంగు లాంటిది, పొంగిన పాలు, పొయ్యపాలౌతాయి, నా మాట విని ఆగిపో..." హితబోధ చేసింది జ్ఞానం.

అంజన ఎటూ తేల్చుకోలేనట్లు గదంతా తిరిగింది, మతిపోయినదానిలా. ఆమె దృష్టి పంజరంమీద పడింది. పజరంలోని చిలుక 'స్వేచ్ఛ లభించింది కదా అని ఎగిరిపోయే వుంటుంది' అనుకుందామె. కాని ఆమె ఊహించినట్లుగా చిలుక ఎగిరిపోలేదు. పంజరపు బ్రతుక్కి అలవాటుపడిన పక్షి ఎక్కడికీ పోలేదనే సత్యాన్ని చాటుతూ చిలుక దానిలోనే కూర్చునివుంది బుద్ధిగా.

'నేను వెళ్ళను, వెళ్ళను. ఈ ఇంటిని, గృహిణిత్వాన్ని వదులుకుని నేను ఎక్కడికీ పోలేను. ఈ పంజరంలోనే ఆనందాన్ని వెతుక్కుంటాను' అనుకుంది. అలా అనుకున్నాక నరహరి రాసిన ఉత్తరం తీసి అగ్గిపుల్లగీసి అంటిస్తుండగా అత్తగారొచ్చింది, "ఏమిటమ్మా కాలుస్తున్నావు?" అంటూ. "ఈ కాగితాన్ని చెదపురుగులు పట్టాయి అత్తయ్యా. అందుకే అగ్గిపుల్లగీసి అంటించాను" అంది అంజన.

"మంచిపని చేసావు. రాభోంచేద్దాము. అబ్బాయి ఎప్పటి కొస్తాడో" అంది. "పదండి, వస్తున్నా!" నిశ్చింతగా ఆమె ననుసరించింది అంజన.

---



# నువ్వులూ తెలకపిండీ!

కొడవటిగంటి కుటుంబరావు

తెలకపిండి ఎట్లా వస్తుందో అందరికీ తెలుసు. నువ్వులు అదే నాగరికత లేని సరుకు. అది పొలాల్లో కష్టజీవుల చేతుల్లో పెరిగి మధ్యవాళ్ళకు అమ్ముడుపోయి బస్తీ చేరుతుంది. అక్కడ దాన్ని గానుగ ఆడి నూనె తీస్తారు. ఆ నూనె అందమైన సీసాలకూ, డబ్బాలకూ ఎక్కి అనేక వంటిళ్లను అలంకరిస్తుంది. తెలకపిండి చెక్కను నువ్వులొకవేళ చూసినా పోల్చుకోలేవు. అది గొడ్లకూ, పేదవాళ్లకూ ఆహార మవుతుంది.

నువ్వులు గానుగాడడం ఏమంత గొప్ప విషయం కాదు. నేను మనుషుల్ని గానుగాడగా చూశాను. ఎందుచేతో నాకా పద్ధతి రుచించలేదు.

* * *

సోమయాజులు నా ఆప్త స్నేహితుడు. వాడిపట్ల నా కున్న భావాన్ని గురించి ఏ కవులూ, ఏ కథకులూ రాయలేరు.

అటువంటి భావాలను మాటల్లో వ్యక్తం చేయటానికి ప్రయత్నిస్తే అబద్ధాలనో, అతిశయోక్తులనో అనిపిస్తాయి. నేను వాడికోసం ప్రాణం త్యాగం చేస్తానో లేదో పరీక్షకు రాలేదు అదృష్టవశాత్తూ. అటువంటి పరీక్షవస్తే ఏంచేస్తానో చెప్ప లేను. ఇటువంటి ప్రశ్నలకు అంతరాత్మ లను సమాధానా లడిగితే, అవి చెప్పే కబుర్లు కోటలు దాటాయి. సోమయాజు లును పులి వెంబడిస్తే వాణ్ణి తప్పించ టానికి పులితో కలియబడగలనని నా అంతరాత్మ చెబుతున్నది. కాని, పులుల్ని మించిన మనిషి వాడివెంటపడి కోరలతో పట్టుకుంటే నేను మంత్రానికి కట్టుబడ్డ వాడల్లే చూస్తూ నిలబడ్డాను... అయినా నా అంతరాత్మలో నాకు విశ్వాసం చావ లేదు. నిజానికి మనము పులులతోనూ, విష సర్పాలతోనూ ఎట్లావ్యవహరించాలో నిర్ణయించినంత బాగా, పులులవంటి, విషపదార్థాలవంటి మనుష్యులతో వ్యవ హరించటం గురించి నిర్ణయించలేం...

సోమయాజులు పేదకుటుంబానికి చెందినవాడు. నేను చిన్నతనంనుంచీ వాడితో కలిసి చదివినవాణ్ణి కనక నాకు వాళ్ళమ్మా, నాన్నా, వాడి తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ బాగా తెలుసు. వాళ్ళ ఇంటి వాతావరణాన్ని నేను కొంచెమైనా సహించలేకపొయ్యేవాణ్ణి. వాళ్ళు దరి ద్రంతో బాధపడటంకూడా దరిద్రాన్ని ఆరాధించటం లాగా కనిపించేది. వాళ్ళింటో అందరి సంస్కారమూ ఒకే ధోరణిలో ఉండేది- ఎట్లా పూచికపుల్ల దగ్గిర్నుంచీ పోగుచేతామా అని: అది ఇది దారిద్ర్యంతో సంబంధం లేకుండా వేరే వ్యక్తిత్వం సంపాదించుకున్నది. ముఖ్యంగా సోమయాజులు తల్లి అడ్డ మైన, పనికిమాలిన వస్తువులన్నీ సంపా దించటానికి దొంగతనం మినహాగా మిగి లిన యుక్తులన్నీ చేసేది. ఏ ఉదయం వీధిలో చూసినా ఆమె పేడకోసం ఎవరి తోనో ఒకరితో పోట్లాడుతూనే ఉండేది. తరవాత, ఆమెదగ్గర దేవిరింపు కూడా ఉండేది. ఆవిడ మా యింటికి వచ్చినప్పు డల్లా, "మీకు అక్కర్లేనిది ఏదన్నా ఉంటే ఇస్తురూ" అని పుచ్చుకుపోతూ ఉండేది. ఆ వస్తువు మా ఇంట్లో ఉండటం చూసే ఆవిడ అడిగేది అది మాకు అక్కర్లేని దన్నట్టు నటిస్తే మేం మరింత త్వరగా ఇస్తామని ఆవిడ విశ్వాసం. మా అమ్మకు ఆవిడ దేవిరింపు బొత్తిగా గిట్టేదికాదు. ఆవిడ అడిగిన వస్తువు నిజంగా అక్కరలేకపోయినా మా అమ్మ తనకు దానితో పనిఉన్నట్టు నటించేది. మా అమ్మయినా తక్కువ తిన్నది కాదు. కాని సోమయాజులు తల్లి యింటికి వచ్చినప్పుడల్లా వంటింటో డబ్బాలకేసి, కూరగాయలకేసి, పప్పుల కేసి ఆశగా చూస్తుంటేనూ, ఏదన్నా మా అమ్మ బాగుచేస్తుంటే చాలు. "అయ్యో, బియ్యంనూక పురుగు పట్టి

నట్టుందే!" "గోధమరవ్వ ముక్కిన ట్టుందే!" అంటేనూ భరించటం కొంచెం కష్టంగానే ఉండేది.

సోమయాజులు గారింటో అను క్షణమూ వస్తువులు ఆదా,- దమ్మిడీలో నూరోవంతు చెయ్యని వస్తువుల పొదుపు తపస్సులాగా సాగుతూ ఉండేది. యీ తపస్సులో నిమగ్నులై ఉన్న వాళ్ళకు మరో ఆనందం ఉండే అవకాశంలేదు. మనస్తత్వ రీత్యానైతేనేం, దృక్పథాలలో నైతేనేం వాళ్లు మానవులకంటె కాడి ఎద్దులకు సన్నిహితంగా ఉండేవాళ్ళు.

శ్రామిక వర్గానికి చెందవలసిన ఆర్థిక పరిస్థితులుండి కూడా బ్రాహ్మణ కుటుంబాలైన కారణంచేత మధ్యతరగతి హోదాతో నెట్టుకువచ్చిన వారిని నేను చాలామందిని చూశాను. కాని బ్రాహ్మలైన దోషంచేత మధ్యతరగతి అనిపించుకుంటూ శ్రామికులు పొందిన జీవితానందం కూడా సాధించలేక పోయిన కుటుంబం నా ఎరుకలో సోమ యాజులు వాళ్ళదే. రాను రాను బ్రాహ్మణ కుటుంబాలకు ఈ గతే హెచ్చుగా పడితే నేనాశ్చర్యపడను.

అప్పటికి సోమయాజులు కుటుంబం మధ్యతరగతి సంస్కారానికి చాలా వరకు ఉద్వాసన చెప్పేశారు. వాళ్ళింట అక్కరలు వచ్చేవికావు. ఒకవేళ వస్తే ఎవరికీ తెలిసేదికాదు. ఎవరన్నా పిలిస్తే వెళ్లేవాళ్ళు, కాని వాళ్ళను ఎదురు పిలిచే వాళ్లుకారు. పక్కవీధిలో ఉన్న చుట్టాలనే ఏడాదికొకసారి చూసేవాళ్లుకారు. ఉన్న దారిద్ర్యాన్ని చిన్న మాసిపాతతోనన్నా కప్పటానికి యత్నించేవారుకారు.

సోమయాజులు ఏ విధంగా వాళ్ళ ఇంటో మిగతావాళ్ళతో అతికినా నేను స్నేహం చెయ్యలేకపొయ్యేవాణ్ణి. లేక స్నేహం కారణంగా వాడు నాకు మరొక విధంగా కనిపించేవాడో! ఏమైనా నా కళ్ళకు సోమయాజులు దరిద్రం ఒక లోపంగా కనిపించేది కాదు. నాకు వాణ్ణి చూస్తే అవ్యాజంగా చెప్పరాని జాలి కలిగేది. కాని ఆ జాలి బాల్యస్నేహ లక్షణం. దానికి వాడి దారిద్ర్యంతోగాని, కష్టాలతోగాని సంబంధంలేదు. నిజంగా కష్టాలు చూచి జాలిపడేశక్తి అంత చిన్న వయస్సులో ఎక్కడుంటుంది.

స్కూలుఫైనలు దాకా నేనూ సోమ యాజులూ కలిసి చదివాం. కాని అంతటితో వాడు చదువు కట్టిపెట్టి వకీలు సత్యనారాయణగారి దగ్గర ప్లీడరు గుమాస్తా పని నేర్చుకునే వాలంటీరుగా చేరాడు. ఆ తరువాత నేను నాలుగేళ్లు కాలేజీ చదువు చదివి పైనా లోపలకూడా ఎన్నో మార్పులకు లోనయినా, ఏ మూలో వాడికోసం నా హృదయంలో కొంతమేర మార్పులేకుండా దాచి ఉంచాను. గడియారాల నెవరూ వెనక్కు తిప్పలేరు కాని కొంతవరకు వాటిని ఆపి ఉంచటం అసంభవం కాదు.

* * *

సోమయాజుల్ని గురించి చెప్పవల సిన విషయం చెప్పలేదు. వాడు పాడ గలడు. ఎవరంత బాగా పాడగలడని అడక్కండి. నిజంగా గొప్ప పాటకు సాటిలేదు. సంగీతంలో విద్వత్తును పోల్చ వచ్చు. సాధనను పోల్చవచ్చు. గొంతెత్తి మనస్సులు కరిగించే వాడి పాటతో ఆనందాన్ని ఇంకో దాంతో ఎట్లా పోల్చటం సోమయాజులుకు రాగ జ్ఞానం లేదు. స్వరజ్ఞానం లేదు. తాళ జ్ఞానం లేదు. పాటతో తన్మయత్వం తీసుకురావటానికి ఈ మూడూ అవసరం లేదని నాకు సోమయాజులు రుజువు చేశాడు. ఒక్క సాహిత్యంతో తప్ప తన్మయత్వం రాని నాకు వాడి పాట వెర్రెత్తించింది. అది అహోరాత్రాలు నన్ను రకరకాల పీడించేది. వాడి పాట వినే ఆనందంలో సుఖమే హెచ్చుగా ఉండేదో, బాధే హెచ్చుగా ఉండేదో నిర్ణ యించలేకపోయేవాణ్ణి.

సోమయాజుల పాట గురించి నేను చెప్పేది అతిశయోక్తి గాదని రుజువు చేయటానికి లేదు. కాని ఒక్కమాట మాత్రం చెప్పగలను. వాడి పాట విని చలించని వాళ్ళను చూశాను. నాకన్నా వెర్రెత్తినవాళ్ళను కూడా చూశాను; జయలక్ష్మి ఒక పెద్ద తార్కాణం.

నాకు జయలక్ష్మిమీద ఏవిధమైన అభిమానంగాని గౌరవంగాని లేదు. కాని ఆ పిల్ల వాడివెంట ఎందుకు పడిందో నే నూహించగలను. నేను ఆడదాన్నయి వుంటే సోమయాజులపట్ల సరిగా జయ లక్ష్మిలాగే ప్రవర్తించి ఉండేవాణ్ణేమో.

జయలక్ష్మి మరెవరో కాదు. వకీలు సత్యనారాయణగారి చెల్లెలు కూతురు. వాళ్ళ నాన్న పట్నంలో గొప్ప వ్యాపా రస్తుడు. ఆయనకు ఏమీలేదు. సత్య నారాయణగారి చెల్లెలు మల్లి కాంబను ఆయన కిచ్చినప్పుడు సత్యనారాయణ తండ్రిగారిని అంతా కోప్పడ్డారు – దారే పొయ్యేవాడికి పిల్లనిచ్చారని. సత్యనారా యణగారు ప్రాక్టీసుపెట్టి రెండు చేతులా సంపాదన ప్రారంభించగానే అత్తవారి దృష్టిలో గురునాథంగారు మరీ సులక నయినాడు. కాని జయలక్ష్మి పుట్టుటయే ఆరంభం, గురునాథంగారి దశ తిరిగి, పట్టిందల్లా బంగారం కాసాగింది. చూస్తుండగానే ఒకలక్ష వెనకవేసి రెండో లక్షకు నడుం బిగించాడు. చిన్నచిన్న బస్తీల వాతావరణంలో వదిలిపోయిన మొక్క పట్టణం వాతావరణంలో పెరిగి మహావృక్షమై ఊడలు దించసాగింది. జయలక్ష్మి సంపన్నుల పిల్ల. జయలక్ష్మి అన్న ఇంగ్లండులో చదివి వచ్చి పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు.

జయలక్ష్మి మేనమామ గారింట కొన్నిరోజులు ఉండటానికి వచ్చింది. సోమయాజులు పాడతాడని ఆమె ఎట్లా పసిగట్టిందో తెలియదు. తన మేనమామ దగ్గర గుమాస్తా కనకా, తను సంపన్న

రాలూ అతను బిదవాడు కనకా, ఆమె మొదట తన అధికారం వినియోగించి అతనిచేత పాడించుకున్నది. తన మేన మామ ఇంట్లో లేనప్పుడు అతన్ని మేడ మీది వరండాలోకి పిలిపించి పాడమనేది. సోమయాజులు పాడేవాడు.

నిజంగానే జయలక్ష్మికి మతి పోయింది సోమయాజులు పాటతో. అతను పాడనంటే బాధపడేది. క్రమంగా అతనిమీద తనకు గల అధికారాన్ని మరచిపోయింది.

"ఇదిగో, అమ్మాయి, ఇక నన్ను పాడమనకు. ప్లీడరుగారు నన్ను కోప్ప డ్డారు. 'పాటలే పాడతావా, పనిచేస్తావా?' అన్నాడు. నాకీ పాట కూడు పెడుతుందా గుడ్డ పెడుతుందా?" అన్నాడు సోమ యాజులు ఒక రోజు జయలక్ష్మితో.

"పోనీ పాడకు – నీ కిష్టంలేకపోతే" అన్నది జయలక్ష్మి నిర్భరంగా. కాని లోపల ఆమె మనస్సు దహించుకు పోతున్నది. నల్లమందు అలవాటైన వాడికి అది లేకుండా ఉండటం ఎంత దుర్భరమో, సోమయాజులు పాట విన కుండా వుండటం ఆమె కంత దుర్భర మయింది.

ఒక రోజు సాయంకాలం సోమ యాజులు కోర్టునుంచి ప్లీడరుగా రింటికి వచ్చాడు పనుండి ప్లీడరుగారు నేరుగా క్లబ్బుకు వెళ్లారు.

ఆఫీసు గదిలో సోమయాజులు పని చూసుకుంటుండగా, జయలక్ష్మి వచ్చి అతని ఎదురుగా మాటా పలుకూ లేకుండా నిలబడింది. ఆమెలో ఏదో మార్పు కనిపించింది సోమయాజులుకు. వారంరోజులు పస్తులున్న దానల్లే ఉన్న దామె.

"ఏమిటి?" అన్నాడు సోమయా జులు.

"నేను రేవు వెళ్ళిపోతున్నాను" అన్నది జయలక్ష్మి.

"అట్లాగా?" అన్నాడు.

"ఎంత అదృష్టం! నేను మళ్ళా కని పించనని నీకు విచారం లేదుకద!" అన్నదామె.

దీని కేమనాలో సోమయాజులుకు తెలియలేదు.

"ఒక్కసారి పాడు! మళ్ళీ వినను" అన్నది జయలక్ష్మి.

"ఇప్పుడా? పనుంది" అన్నాడు సోమయాజులు.

జయలక్ష్మి భరించలేకపోయింది.

"పని! పని! ఏం పని ఇది గొప్ప వాళ్ళ ఇళ్ళలో కుక్కచాకిరీకన్నా బాగా బతుకుతై. ఇదేనా పని! మా మామ నెలకు పది రూపాయలిస్తాడా? ఈ పది రూపాయలకేనా నీకు దేవు డింత పాట ఇచ్చాడు? నీకు ఆశలేదా? గొప్పవాడి వౌదామని లేదా?" అని ఘాటుగా ఎత్తి పొడిచింది జయలక్ష్మి.



"అందరూ గొప్పవాళ్ళయితే కొద్ది వాళ్ళెవరు?" అన్నాడు సోమయాజులు

"నువు కొద్ది వాడిలాగానే ఉండు. కాని కాస్సేపు పాడు. నీ యిష్టం, ఏదన్నా రాగం ఆలాపన చెయ్యి. నీకు పాటలు పాడటం చాతకాదు," అన్నది విజయలక్ష్మి.

సోమయాజులు సన్నగా నవ్వి పాడ సాగాడు. పైగా కేదారగౌళ ఆలాపన చేశాడు. వాడి శంకరాభరణంగాని, కళ్యాణిగాని కొంతవరకు తట్టుకోవటం చాలా కష్టం.

జయలక్ష్మికి నిజంగానే మతి పోయింది. వాడు పాడటం అవగానే "ఎట్లా పాడతా వింతపాట? ఎన్నో సార్లు నేను మోసపోయినా నను కున్నాను. నువు నిజంగా అంత బాగా పాడవని, నేనే ఊహించుకుంటున్నాననీ అనుకున్నాను. నేనింకా ఏ దెబ్బయ్యేళ్ళో బతుకుతాను. కాని నీ పాట వినలేను. నువు నిజంగా ఇంత బాగా పాడలేదనీ, నా భ్రమ అనీ మళ్ళీ నన్ను నేను నమ్మించుకుంటున్నాను. ఎట్లా సోమయా జులూ? రోజూ నీ పాట వినటం ఎట్లా

సోమయాజులూ? రోజూ నీ పాట వినటం ఎట్లా? మీ ఇంటోవాళ్ళంతా ఎంతఅదృష్ట వంతులు! రోజూ నీ చేత పాడించుకు వింటారు కాదూ?" అన్నది.

"నా చేత బలవంతాన పాడించే వాడిం కొక్కడే ఉన్నాడు'' అన్నాడు వాడు.

''అయితే నే నొక్కతినే కాదన్న మాట? నాకు మతి పోలేదన్నమాట? ఈ అనుమానంకూడా నాకు తట్టింది సుమా'' అన్నది జయలక్ష్మి.

* * *

సోమయాజుల్ని పెళ్లాడాలనే బుద్ధి జయలక్ష్మికి ఎప్పుడు పుట్టిందో నాకు స్పష్టంగా తెలియదు. సోమయాజులుకు ఆమె పట్నంనుంచి ఒక ఉత్తరం రాసింది ఉత్తరంలో చాలా కవిత్వ ముంది సోమయాజులు మనిషిఎదురుగా ఉన్నా చలించనివాడు కాస్తా ఆ ఉత్త రానికి చలించాడు. విశేషమేమంటే ఆ ఉత్తరంలో జయలక్ష్మి తనను పెళ్లాడ మని సోమయాజులు నడిగింది. వాడు ఒప్పుకుంటే తన తండ్రిని ఒప్పిస్తా నన్నది. వెధవ ప్లీడరుగుమాస్తాగిరి మానేసి తనదగ్గిరే ఉండవచ్చు నన్నది.

వాళ్ళిద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్త రాలు సాగినై. అన్ని ఉత్తరాలూ వాడు నాకు చూపలేదు. ఆ విధంగా అందులో ఏమున్నదీ నాకు తెలియజేశాడు

ఒకటి మాత్రం ఖాయం. గురునాథం గారు కూతురు పెళ్ళి ఆలోచనకు వెంటనే ఒప్పుకోలేదు. కాని జయలక్ష్మి చాలా మొండిది, ఆఖరుకు సోమయాజులును వాళ్ళు పట్నం పిలిపించారు వాళ్ళే రైలుఖర్చులుకూడా ఇచ్చారు ఇంతదాకా వచ్చినాక సోమయాజులు తల్లిదండ్రు లకు విషయం తెలిసిపోయింది. వాళ్ళ సంతోషానికి మేరలేదు. తమ కొడుకు పెళ్ళి అయినట్టుగా అందరితోనూ చెప్పే శారు.

వాడి తండ్రి నన్ను చాటుగా పిలిచి "చూడు బాబూ, మా వాడికి వాళ్లు బాగా కట్నం ఇచ్చేట్టు చూసుకోవద్దూ మనం? ఇవ్వగలవాళ్లేగా తీపురమా?'' అన్నాడు.

'మీ రిందులో జోక్యం కలిగించుకో కండి. అసలే దగ్గితే ఊడేమున్నట్టుగా ఉంది. ఈ పెళ్ళికి వాళ్ళెట్లాగూ ఒప్పు కోరు. ఒకవేళ ఒప్పుకొంటే అదే అన్ని కట్నాలూనూ. మీ రిందులో తొందర పడి వేలుపెట్టాకో అసలుకు మోసం వస్తుంది'' అన్నాను.

"అదేమిటోయ్? మనం మగపెళ్ళి వాళ్ళంగా? మన పిల్లవాణ్ణి వాళ్ళు పిలి పించటం ఏమిటీ?" అన్నా డాయన.

''ఈ పెళ్ళి జరిగితే, పెళ్ళివారంతా కలిసి మీ అబ్బాయి ఒక్కడే. ఆ చేసు కునే అమ్మాయి ఒక్క మొగుణ్ణే చేసు కుంటుంది గాని, అత్తగారినీ, మామ గారినీ చేసుకోదు" అన్నాను.

"అదేం? కాపరానికి రాదూ?"

"మనవాడే కాపరానికి పోతాడు."

"ఛా!" అన్నాడు సోమయాజులు తండ్రి, నామాట నమ్మలేకుండా.

గురునాథంగారూ వాళ్లూ సోమయాజుల్ని గురించి ఎంత తక్కువ అంచనాలు వేసుకున్నారో మనకు తెలీదు. అది సోమయాజులుకి లభించింది.

"కుర్రాడు బాగానే ఉన్నాడే!" అన్నది జయలక్ష్మి తల్లి మల్లికాంబగారు. గురునాథంగారికి కూడా అదే తోచి ఉండాలి.

అదీకాక సోమయాజులు అందరిపట్లా చాలా వినయ విధేయతలుగా ఉండేవాడు. ఎవరితోనూ యే విషయంలోనూ పేచీలు పెట్టుకునే వాడుకాదు. అన్నిటికన్నా ముఖ్యం—జయలక్ష్మి మీద చాలా అపేక్షగా ఉండేవాడు. వాణ్ణి బజారుకు తీసుకుపోయి జయలక్ష్మి వాడికి మంచి సూట్లు రెండు ఆర్డరు చేయించింది. ధోవతులూ షర్టులూ కొని పెట్టింది.

గురునాథంగారి ఇంట్లో జయలక్ష్మికి ఎటువంటి అడ్డూలేదు ఆమెకు వేరే గది ఉంది. ఆగదిలో ఇద్దరూ గంటలు తరబడి కూర్చునేవాళ్ళు. సోమయాజులు చేత గంటల తరబడి పాడించుకునేది. వాణ్ని అనుకొని కూర్చునేది మరీ ఆపేక్షవస్తే వొళ్ళోనే వచ్చి కూర్చునేది.

ఇంకా పెళ్ళి కాకపూర్వమే సోమయాజులుకు పాడటమంటే అసహ్యం పుట్టి పోయింది పాపం, జయలక్ష్మి, తన తృష్ణ సంతృప్తిపరుచుకోవటంలో సోమయాజులుకు అవగింజంతైనా స్వాతంత్ర్యం లేకుండా చేసింది. తనంతట తాను గొంతెత్తి ఎన్నో యుగాలైనట్లనిపించింది వాడికి ఈ సమయానికి. వాడికి జయలక్ష్మిమీద ప్రేమే ప్రజ్వలించక పోతే ఎవరితోనూ చెప్పకుండా ఇంటికి వచ్చెయ్య వలసినవాడే.

వాడు పట్నం వెళ్ళిన నెలరోజుల్లో పెళ్ళి అయిపోయింది. పెళ్ళికి వాడి తలిదండ్రు లెవరూ వెళ్ళలేదు. "మీరు వెళ్ళనవసరం లేద"ని నేను చెప్పినసలహా, డబ్బు ఖర్చవుతుందన్న వాళ్ళ తాపత్రయానికి కలిసి వచ్చింది.

* * *

జయలక్ష్మి సోమయాజుల్ని తప్ప పెళ్ళాడనని ఎందుకు పట్టుబట్టిందీ ఆమె ఇంటో వాళ్ళకుగాని, స్నేహితులకుగాని తెలియదు. పెళ్ళి అయినాక మాత్రం ఆమె, "మా ఆయన సంగీతం మీరు వినలేదు కదూ?" అని అందరి దగ్గరా వాడి పాట వినిపించసాగింది.

తన మొగుడి పాట విన్న వాళ్ళంతా తన మాదిరిగానే వెర్రెత్తి పోతారనీ, ఇంత పాటగాణ్ణి మొగుణ్ణి చేసుకున్నందుకు వాళ్లు తననుచూసి అసూయ పడతారనీ ఆమె ఆశించి ఉంటుంది. ఈ విషయంలో ఆమె నిరాశ అయింది.

సోమయాజులు పాట విన్నవాళ్ళలో చాలామందికి అందులో ఏమంత ప్రత్యే

కత కనిపించలేదు. కొందరు అతన్ని "ఆ రాగం పాడు. ఈ రాగంపాడు, ఆ కృతి పాడు, ఏమైనా సినిమాపాటలు పాడు, హిందీ పాటలు పాడు" అని అడిగి ఆశాభంగం పొందారు. కాస్త సంగీత జ్ఞానం కలవాళ్ళు సోమయాజులుకా జ్ఞానం లేదని తెలుసుకున్నారు.

పైకి అందరూ ఇంపైన పాట; చక్కని శరీరం; మంచి పొడుగు అన్నారేగాని జయలక్ష్మి లెక్కన తన్మయత్వం పొందలేదు.

పైగా సోమయాజులు తిరగబడ్డాడు. "నీ కోసం పాడమంటే పాడతానుగాని వీళ్ళందరి ముందు పాడమంటావు దేనికి? వాళ్ళకు నా పాట నచ్చకపోవచ్చు నువ్వు జిడ్డు తగిలిస్తున్నావనుకోరా?'' అన్నాడు.

''పాట అన్నతరవాత నలుగురికి గాని ఒక్కరికా?" అన్నది జయలక్ష్మి, తన కీర్తి కాంక్షను అభ్యుదయ నినాదంతో సమర్థిస్తూ.

ఈ అంధకారంలో జయలక్ష్మికి ఒక ఆశారేఖ అగుపించింది. గురునాథంగారి స్నేహితులలో ఒక పాటగా డొకాయన ఉన్నాడు. ఆయన కూడా సోమయాజులు పాట విన్నాడు. తన అభిప్రాయాన్ని జయలక్ష్మి వింటుండగనే గురునాథంగారికి చెప్పాడు.

''మనవాడు పూర్వజన్మ వాసనవల్ల మంచి గాత్రంతో పుట్టాడు. కాని సరిగమల దగ్గిర్నుంచీ కట్టుగా నేర్చుకుంటేగాని పాటగాడుగా రాణించలేడు''అన్నాడాయన.

"అట్లాఅయితే, సంగీతం చెప్పిద్దాం" అన్నాడు గురునాథం

సోమయాజులు గొప్ప పాటకాడు కావటానికి, పాడేశక్తి కోల్పోవటానికి అదేమొదలు.

సోమయాజులుకు చాల పెద్ద విద్వాంసుణ్ణి చూసి పెట్టారు. సాధన ప్రారంభించాడు. ఇంటిదగ్గర కూడా తంబురా పెట్టుకుని సాధన చేసేవాడు. అదివరకు తన మగడు గొంతెత్తితే పరవశమయ్యే జయలక్ష్మి ఈ సాధన బలవంతాన సహించవలసి వచ్చింది.

ఈ విధంగా సోమయాజులు మూడేళ్ల పాటు సంగీతశిక్షణ పొందాడు రాగాల్లో భేదాలేమిటో, మేళకర్తలేమిటో, జన్యరాగాలేమిటో, ఆరోహణావరోహణాలేమిటో తాళభేదాలూ, జాతులూ అన్నీ నేర్చుకుని కర్ణాటక సంగీత విద్వాంసుడైనాడు.

అదివరకు తాను పాడిన "గాలిపాట" తలుచుకుని వాడు సిగ్గుపడేవాడు. కాని ఇప్పుడు వాడి పాట చూసి పరవశమయ్యేవాళ్ళు లేరు. సంగీత పాండిత్యంలో వాణ్ణి తలదన్నిన హేమాహేమీలు ఉండనే ఉన్నారు ఏ రోజున రేడియోను మద్రాసుకుగాని, తిరుచునాపల్లికి గాని తిప్పినా సోమయాజులు



జన్మలో సంపాదించలేని కీర్తిని సంపాదించుకున్నవాళ్ళు వినిపిస్తారు ; సోమయాజులు ప్రత్యేకత ఏమిటి ?

ఇప్పుడు సోమయాజులు పాడితే జయలక్ష్మి గుండె తటతట లాడటం లేదు. ఆమె వాణ్ణిప్పుడు పాటపాడమని అడగదు వాడు రాగం పాడితే, గొంతెత్తగానే రక్తిగా ఉండేది. ఇప్పుడు గంటా గంటన్నర వింటేగాని అందులో ఏ రసమూ ఉత్పత్తి కాదు.

"ఏమోయ్ ? ఇంత కష్టపడి, ఇంత డబ్బు ఖర్చుచేసి నేర్చుకున్నావు సంగీతం దీనివల్ల ఫలిత మేమిటోయ్ ?" అన్నాడు మామగారు.

''పాట కచేరీలు చేసుకోవచ్చు— ఎవరన్నా చేయిస్తే" అన్నాడు అల్లుడు సంకోచంతో.

చిత్రమేమిటంటే, సోమయాజులు సంగీతం నేర్చుకున్నందుకు సంతోషించినవాడు సోమయాజు ఒక్కడే పాపం, వాణ్ణి పాట కచేరీలు చెయ్యటాని కెవరూ పిలవలేదు.

వాడికి విద్వత్తు లేకపోవటం ఒక్కటే లోప మన్నట్టు వెనక మాట్లాడినవాళ్ళు కూడా విద్వత్తు సంపాదించి వాడు పరిపూర్ణుడైననాడు హర్షించలేదు.

జయలక్ష్మి రేడియో ఎప్పుడన్నా పెడితే సినిమా రికార్డులు పెట్టుకు వినేది. కాని ఆమెకు సంగీతంమీద వెనకటి ఆసక్తి లేదు.

* * *

ఒక రోజు, జయలక్ష్మి అన్న ఉద్యోగం మానేసి ఇంటో ఉంటున్న రోజుల్లో, గురునాథంగారింటికి ఒక మనిషి వచ్చాడు. జయలక్ష్మి అన్న పరబ్రహ్మశాస్త్రి ఆయనతో ఏదో వ్యవహారం మాట్లాడాడు పరబ్రహ్మశాస్త్రి తన బావమరదిని పిలిచి ఆ పెద్దమనిషి దగ్గర పాడమన్నాడు. సోమయాజులు పాడాడు. ఆ తరవాత వాళ్లు వాణ్ణి పంపించేసారు.

సోమయాజులు భార్య నడిగాడు

"ఏవో నాటకాలు కంట్రాక్టు చేస్తారుట. మా అన్నయ్య చెప్పలా?" అన్నది జయలక్ష్మి అట్టే ఆసక్తి లేని దానల్లే.

"నన్నెందుకు పాడమన్నారు?''

"ఏమన్నా వేషం వేయిస్తారేమో? పాడగలరు గదా'' అన్నది జయలక్ష్మి.

ఆ మాట అక్షరాలా నిజమయింది.

ఈ సంఘటన జరిగిన నెలకల్లా పరబ్రహ్మశాస్త్రి పట్నంలో ఒక మూల ఇల్లు తీసుకుని నటులను చేర్చి నాటకం రిహార్సల్సు ఆరంభించాడు. ఆ పెద్దమనిషి-ఆయనపేరు శేషయ్య-పాటలు యెట్లా పాడాలో చెబుతూ వచ్చాడు సోమయాజులకు. చాలా పాటలూ పద్యాలూ గల పాత్ర ఇచ్చారు

"నీకేం బోలెడంతపాట ఉంది పాడేస్తే చాలు. నాటకం రక్తికడుతుంది. నటించనక్కర్లేదు. కాస్తో కూస్తో నేను చెబుతాను, రెండు నెల్లు రిహార్సల్సు నలిగితే తరవాత అసలు అనభవమంతా స్టేజీమీదవస్తుంది" అన్నాడు శేషయ్య.

"ఇంత కష్టపడి సంగీతం నేర్చుకుని నేను స్టేజీమీద పద్యాలు పాడటమేమిటి?" అన్నాడు సోమయాజులు బావమరిదితో

"అదే పొరపాటు. కోటివిద్యలూ కూటికొరకే. చెరువులో నీళ్లుండి ఏం లాభం? వాటిని మనం ఉపయోగించుకోవాలి" అన్నాడు శాస్త్రి.

రిహార్సల్సులో శేషయ్య సోమయాజులుకు పద్యాలెట్లా పాడాలో, ఎక్కడ నిలపాలో, ఎక్కడ రాగం తియ్యాలో, పద్యం ఎట్లా ఎత్తుకోవాలో, ఎట్లా ముగించాలో చెప్పాడు. శేషయ్యకు గొంతులేదు. పాట రాదు. కాని పద్యం ఎట్లా చదవాలో తెలును. పద్యం చదవటంలో కాక రాగా లాపన చెయ్యటంలో ఆసక్తి మెండుగా గల సోమయాజులుకు సంగీతం ఖూనీ అవుతున్నట్టు తోచింది. శాస్త్రితో వివాదు చేస్తే శేషయ్య చెప్పినట్లు చెయ్యమన్నాడు.

రెండునెలల్లో నాటకం పండింది. మొదటి ప్రదర్శనానికి అట్టే జనం రాలేదు గాని వచ్చినవాళ్లు సోమయాజులు పాటకు తన్మయులైనారు. కొన్ని పద్యాలు మూడేసిసార్లుకూడా పాడించారు.

"ఆ వన్సుమోర్లు నాకు- నీకుకాదు" అన్నాడు శేషయ్య.

"నాకు తెలుసు" అన్నాడు సోమయాజులు నిగర్వంగా!

ఈ నాటకం మొత్తంమీద రెండు వందల ప్రదర్శనాలు పడ్డాయి. శాస్త్రి.

శేషయ్యా కలిసి పాతికవేలు లాభం చేశారు. సోమయాజులుకు ఆంధ్ర దేశంలో స్టేజీమీద పాడగలవాడనే పేరు మాత్రం లభించింది.

అతనికి నాటకాలలో ఆఫర్లుకూడా రాసాగినై. ఆటకు యాభై మొదలు నూరు రూపాయల చొప్పున ఇస్తామని అతని వెంటపడ్డారు నాటకాలవాళ్ళు కాని వెళ్ళవద్దని శాస్త్రి అన్నాడు.

పరబ్రహ్మశాస్త్రికింకా పెద్ద ఆలోచన లున్నాయి. అతను గ్రామఫోనూ,సినిమా పాటల రికార్డులూ కొన్నాడు. ముఖ్యంగా హిందూస్థానీ సినిమాల రికార్డులు.

"ఇదీ రేపటి సంగీతం ఈ సంగీతంలో లక్షలున్నాయి. వీటిని బాగా పట్టుకోండి. ఈ బాణీ అలవాటైతే ఆ తరవాత ఏంచెయ్యాలో చెబుతాను" అన్నాడు శాస్త్రి

సోమయాజులు గొంతుకి పంజాబీ సంగీతం-ఒక రాగ లక్ష్యంగాని, ఒక శాస్త్ర నిబంధనగాని లేని యీ కలగా పులగపు సంగీతం—పచ్చి వెలక్కాయ అయి కూర్చుంది.

"ఇదేంసంగీతం? దీన్లో అర్థమేమిటి? దీన్ని నేర్చుకోవట మేమిటి? నా కిదెట్లా అబ్బుతుంది ?'' అని సోమయాజులు వాపోయినాడు.

"వినటానికి సుఖంగానే ఉంటుంది. అందులో ఏం లోపం ఉంది?" అన్నది జయలక్ష్మి.

"అందులో ఉన్న సంగీత మేమిటి కనక?" అన్నాడు సోమయాజులు

"అందులో ఏమీ లేదనీ మీరే అంటారు. అది ఎట్లా అబ్బుతుందని మీరే అంటారు; ఏది నిజం?" అన్నది జయలక్ష్మి సానుభూతి లేకుండా.

ఆకస్మికంగా సోమయాజులు సంగీతం విషయం ఆలోచించటం మానేసి, జయలక్ష్మిని గురించి ఆలోచించసాగాడు. తనకోసం తనవాళ్ళం దరితోనూ పోట్లాడి పెళ్ళాడిన జయలక్ష్మి తనకు దగ్గరగా ఉండికూడా ఎంత దూరమయింది? ఎందుకిట్లా అయింది? తను ఏ మహాసముద్రంలో ఏ దిక్కుగా ప్రయాణిస్తున్నట్టు? ఈ ఓడ ఏ రేవు చేరుతుంది? తను కష్టపడి కర్ణాటకం నేర్చుకున్నాడు. దాన్ని వదిలి నాటకం పద్యాల్లో పడ్డాడు. అవీ వొదిలేసి యిప్పుడు సినిమా పాటల్లో పడబోతున్నాడు? ఎవరికోసం? ఎవరు మెచ్చుకోవటానికి? తన కేపాటా రానప్పుడు తన పాట విని ఆనందించినవాళ్ళున్నారు. ఇవ్వాళ?

ఈ ప్రశ్నలకు నిజంగా సమాధానాలు లేవు ఉంటే సోమయాజులుకు తెలీవు.

వాడు ఏ పనీ సగంచేసే బాపతు కాదు. ఒక సంవత్సరమల్లా సినిమా సంగీతంలో మునిగితేలాడు. అందులో భావానికిగల ప్రాధాన్యం అర్థంచేసుకున్నాడు. వివిధ వాద్యాలు ఏ విధంగా ఉపయోగిస్తారో ఊహించాడు. అందులో కొన్ని వాయిద్యాలు ఎట్లా ఉంటాయో

కూడా వాడికి తెలీదు. కాని వాటి ప్రత్యే కతలు వాడి చెవిపట్టింది.

శాస్త్రి చాలా సాహసమైన ఎత్తు వేశాడు. ఎవరో సినిమా చిత్రం తీస్తుంటే, అందులో తాను రెండణాల వాటా తీసుకున్నాడు తన ఎత్తేమిటో శాస్త్రి సోమయాజులుకు చెప్పేశాడు.

"నేను పదిహేను వేలే పెడు తున్నాను. ఇది పోయినా నా కర్మం తరం లేదు. కాని నేను ఈ పిక్చరుకు గట్టి మ్యూజిక్ డైరెక్టరును పెడు తున్నాను. నువ్వు అతనివెంట వుండి సినిమా సంగీతం గురించి నేర్చుకో దగినదంతా నేర్చుకో. ఆ తర్వాత ఏం చెయ్యాలో నేను చెబుతాను'' అన్నాడు శాస్త్రి

ఈ కొత్త చిత్రంలో పన్నెండు పాట లున్నాయి. ముందు పాట తయారు చేశారు. సంగీత దర్శకుడు ప్రసిద్ధుడూ, సమర్థుడూనూ. పన్నెండు పాటలూ పూర్తిఅయి రికార్డు చెయ్యటానికి రెండు నెలలు పట్టింది. ఈ రెండు నెలలో సో మ యా జు లు సమస్త విష యాలూ చూశాడు. కొన్ని పాటలలో అక్కడక్కడా మార్పులు కూడా సూచించి, సంగీత దర్శకుడిచేత బాగుం దనిపించుకున్నాడు. చివర ఒకటి రెండు పాటలు తనే స్వయంగా రాశాడు కూడాను.

పాటలన్నీ రికార్డయినవై వాటిని విన్నవాళ్ళు చాలా మెచ్చుకున్నారు. అదొక గొప్ప విషయం కాదు. సోమ యాజులు రాసిన రెండు పాటలను ఎవరూ గుర్తించలేదు. మిగిలిన పాట లతో సమంగానే అవీ ఉన్నాయి. ఆ ఆధారంమీదే శాస్త్రి సినిమా కంపెనీ ఆరంభించాడు. వీళ్ళింకా చిత్రాలు తీయ లేదు కాని, తీస్తారు. వాటికి సోమయా జులు సంగీత దర్శకుడుగా ఉంటాడు. అచ్చగా సంగీతంమీదే పొయ్యే చిత్రాలు తీస్తారు. వాటిమీద వచ్చే లాభం గురు నాథంగారి మూడో లక్షలో చేరుతుంది. సోమయాజులు దేమీ ఉండదు. నాలు గైదు చిత్రాలవరకూ సోమయాజులుకు డోకా ఉండదు. ఆ తరవాత అతని పాటలు పాతబడ సాగుతాయి. ఆ తర వాత సోమయాజులు తెలకపిండి రూపంలో గానుగలోనుంచి తోడబడ తాడు. గురునాథంగారి వ్యాపార రథం చెక్కు చెదరకుండా ముందుకు సాగి పోతుంది.

ఎక్కడో అనామకుడుగా పడివున్న వాణ్ణి తెచ్చి ఇంతవాణ్ణి చేసిన కీర్తి ఏ విధంగానైతే గు రు నా థ ం గా రి కి దక్కిందో, ఆ విధంగానే సోమయాజు లులో సంగీతం—డబ్బు చేసే సంగీతం— ఇంకిపోయిన మర్నాటినుంచీ వాణ్ణి బతి కున్నంతకాలమూ పోషించే భారం కూడా గురునాథంగారికే దక్కుతుంది. అందుకుగాను సోమయాజులు యావ జ్జీవమూ వారికి కృతజ్ఞుడై యుండ గలడు.

---




మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా కథ చెప్పసాగింది.

అరేబియాలోని ఒకానొక నగరంలో ముగ్గురు మిత్రులుండేవారు. వారి వృత్తి జోస్యం చెప్పటం. ఆ జోస్యం ఎలాంటిదో ముందు ముందు తెలుస్తుంది.

ఈ ముగ్గురూ ఎంత జిత్తులమారి వాళ్ళంటే, వాళ్ళు తమ ఆనందంకోసం ఏ లోభివాడి సంచీయో కాజేసేవాళ్లు. కాని పట్టుబడేవాళ్లు కారు. వాళ్ళు ఏకాంతంగా ఉండే ఒక విడిది అద్దెకుతీసుకుని, రోజూ అక్కడ కలుసుకుని, మర్నాడు నగరంలో ఏం ఆగడం చెయ్యాలో ఆలోచించుకునేవాళ్ళు. అయితే వాళ్ళ ఆకతాయితనంలో దుర్జనత్వం ఏమీ లేదు. తెలివితేటలు ఎక్కువ ఉండేవి. వాళ్ళ ప్రవర్తన చాలా మర్యాదగా ఉండేది. వాళ్ళ ముఖాలు ఆనందకరంగా ఉండేవి వాళ్ళు ఎక్కువ సంపాదించినా, తక్కువ సంపాదించినా సమిష్టిగా వాడుకుంటూ, ఆ డబ్బును తిండికోసమూ, గంజాయికోసమూ ఖర్చు

చేసేవాళ్ళు. రాత్రిపూట వాళ్లు గంజాయి సేవించటానికి కూర్చున్నప్పుడు, గంజాయి తరిగిపోయేకొద్దీ, వాళ్ళ బుద్ధి వికాసంపొందేది; వాళ్ళలో హాస్యగుణం ప్రకోపించేది; అద్భుతమైన ఆలోచనలన్నీ అలాటప్పుడే వాళ్లకు తట్టేవి. అంతేగాని వాళ్లు ఎప్పుడూ పోట్లాటలకూ, తిట్లకూ దిగేవాళ్ళు కారు.

ఒకనాడు వాళ్ళ గంజాయినిషా ఎంతగా తలకెక్కిందంటే, వాళ్ళు ఎన్నడూ చెయ్యని సాహసం తలపెట్టారు. వాళ్ళు ఏంచెయ్యాలో బాగా ఆలోచించుకుని, రాజోద్యానపు ప్రహారీగోడను చేరుకుని, అక్కడ పెద్దగా పోట్లాడుకోసాగారు. ఆ పోట్లాటలో వాళ్లు ఒకరి నొకరు తిట్టుకుని, పొడుస్తామనీ, చంపుతామనీ శపథాలు చెయ్యనారంభించారు.

తోటలో పచార్లుచేస్తున్న రాజు, ఈ కోలాహలం విని, తెల్లవారుగట్ల శాంతి భంగం కలిగించే ఆ మనుషులను పట్టుకు రమ్మని తన కొజ్జాలను పంపాడు. ముగ్గురు జోస్యులూ వచ్చి రాజుముందు నిలబడ్డారు.

రాజు కోపంగా వాళ్ళతో, "దొంగ వెధవల్లారా, ఎవరు మీరు? మా ప్రహారీ దగ్గిరే కొట్లాడుకోవటానికి మీకెన్ని గుండెలు!" అన్నాడు.

"మహారాజా మేం మా వేరు వేరు విద్యలలో ప్రవీణులం. ఎవరి విద్య ఎక్కువ అన్నదాన్ని గురించి ఘర్షణ పడ్డాం. ఘర్షణ కొట్లాటకు దారితీసింది. కోపం పామరత్వానికి సన్నిహితం గదా! తమరు సమీపంలో ఉండవచ్చునన్న జ్ఞానంకూడా లేకుండా మేం అవాకులూ, చవాకులూ పేలాం. మహారాజా, మేం తప్పుచేశాం. మా తప్పుకు సమర్థన ఏమీ లేదు," అన్నారు వాళ్ళు.

"మీ విద్యలేవి?" అని రాజు అడిగాడు.

"నేను రత్ననిపుణుణ్ణి. రత్నాల జాతకాలు చెప్పటంలో నాతో సమానుడు లేడన్నట్టు విన్నాను," అన్నాడు మొదటివాడు.

"చూడటానికి నువు బిచ్చగాడిలా గున్నావు. అంతమాత్రంచేత నీలో విద్య ఉండదనుకోవటానికి లేకపోవచ్చు. ఏం చెయ్యగలవో చెప్పు," అన్నాడు రాజు.

"ప్రతి రత్నమూ ఎక్కడ పుట్టినదీ, ఏ జాతిదీ చెప్పగలను జాతి రత్నాలకూ, కృత్రిమ రత్నాలకూ తేడా తెలుసుకోగలను. ఆ తేడా నాకు ఒక్క చూపుతోగాని, స్పర్శతోగాని తెలుస్తుంది," అన్నాడు మొదటివాడు.

"నీ శక్తి పరీక్షచేస్తాను," అన్నాడు రాజు. ఆయన రెండో గంజాయిభాయిని అతని విద్య అడిగాడు.

"అరేబియాలో గుర్రాల జాతకాలు నాకు తెలిసినట్టు మరెవరికీ తెలియవంటారు. ఒక్కసారి గుర్రాన్ని చూడ

గానే అది ఏ జాతిదో, ఎలాటి పుట్టక గలదో, దాన్ని ఏజాతివాళ్ళు పెంచారో, ఏ ప్రాంతంలో అది మేసిందో చెప్ప గలను. అది ఎంత వేగంతో దౌడు తీయగలదో, నింపాదిగానూ, వేగం గానూ నడుస్తూ ఎంతసేపట్లో ఎంత దూరం పోగలదో చెబుతాను దానిలో ప్రచ్ఛన్నంగా ఉన్నవ్యాధులూ, రానున్న వ్యాధులూ చెప్పగలను దాని పూర్వు లైన గుర్రాలు అయిదు తరాలదాకా ఏ కారణంచేత చచ్చినదీ చెబుతాను. నయంకాదనే గుర్రాల వ్యాధులు నయం చేస్తాను; చావటానికి సిద్ధంగా ఉన్న గుర్రంచేత ఒక గంటలో పరుగుపందెం గెలిపించగలను. నన్నుగురించి నేను అతిగా చెప్పుకుంటే భావ్యంగా ఉండదు," అన్నాడు రెండోవాడు.

"చూడటానికిమటుకు ముష్టివాడి లాగున్నావు. అయితే నీ శక్తిని నేను పరీక్షించగలను," అని రాజు మూడో వాణ్ణి వాడి విద్యగురించి అడిగాడు.

మిగిలినవాళ్ళకన్న తెలివిగల మూడోవాడు ఇలా అన్నాడు :

"మహారాజా, నా విద్య మరింత గొప్పదీ, కష్టసాధ్యమైనదీనూ. ఎందు కంటే, నేను మనుషుల జాతకాలు చెప్ప గలను. మనుషుల జన్మరహస్యం చెప్ప గలను — సాధారణంగా చెప్పుకునేది కాదు, తల్లికి అరుదుగానూ, తండ్రికి బొత్తిగానూ తెలియని జన్మరహస్యం! ఒక మనిషిని ఒక్కసారి చూస్తే చాలు, లేదా అతని కంఠధ్వని వింటే చాలు, అతను ఔరసుడో, జారజుడో చెప్ప గలను అతని తల్లిదండ్రులూ, తోబుట్టు వులూ, వారి ముందు తరాలవాళ్ళూ ఎలాటి జన్మగలవారో చెప్పగలను. అల్లా నాకు ప్రసాదించిన ఈ విద్య సహాయంతో ఎంతోమంది ఘరానా వ్యక్తుల జన్మరహస్యాలు నిక్కచ్చిగా నిరూపించగలను. వాళ్ల తల్లులు గాడిదలు తోలేవాళ్ళతోనూ, వంటవాళ్లతోనూ, దొంగకొట్టాలతోనూ, బానిసలతోనూ ఏం చేశారో చెప్పగలను. బురఖా ధరించిన స్త్రీని నా ముందు నిలబెడితే, ఆమె జాతీ పుట్టుకా, ఆమె తల్లిదండ్రుల వృత్తీ చెప్పగలను. మహారాజా, నా విద్య అంతా వివరించి చెప్పదలిస్తే తమరు చాలా గంటలపాటు నా సోది వినవలసి వస్తుంది. ఒక్క ముక్కలో, నాలాగా నిర్దుష్టంగా జోస్యం చెప్పగలవాడు ప్రపంచంలో లేడు."

రాజు వాళ్ళతో, "మీ విద్యలు అద్భుతమైనవి మీ మాటలు నిజమైతే మిమ్మల్ని మించిన మహాజ్ఞానులు ఈనాడు ప్రపంచంలో లేరు. మిమ్మల్ని నావద్ద పెట్టుకుని, అవకాశం దొరికి నప్పుడు మీ శక్తులను పరీక్షకుపెడతాను. మీరు చెప్పినది నిజంకాకపోతే మిమ్మల్ని కొరతవేయిస్తాను," అన్నాడు.

ఆయన తన పెద్ద వజీరుకేసి తిరిగి,

రాజభవనంలో వాళ్ళ ముగ్గురికీ మూడు గదులు ఏర్పాటుచేయమనీ, తిండీ, నీరూ అమర్చమనీ చెప్పాడు. వాళ్ళు ముగ్గురూ వెళ్ళిపోతూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు వాళ్లకు తమ శక్తులలో సంపూర్ణమైన విశ్వాసం ఉన్నది

మర్నాడే రాజుగారికి పొరుగురాజు విలువైన కానుకలు పంపాడు. వాటిలో ఒక శుద్ధమైన వజ్రం ఒకటి ఉన్నది. రాజు మొదటి గంజాయిభాయిని రప్పించి, ఆ వజ్రం గురించి అతని అభిప్రాయం అడిగాడు.

"నేను దాన్ని చేతిలోకి తీసుకొని పరీక్షించనవసరంలేదు. కళ్ళు మూసుకుని వేలితో తాకనియ్యండి, చాలు," అన్నాడు మొదటి జోస్యుడు.

"పీడ బండారం ఇప్పుడు బయట పడుతుంది!'' అనుకుంటూ రాజు వజ్రం గల చేతిని జోస్యుడికేసి చాచాడు. జోస్యుడు కళ్ళు మూసుకుని, తన ఎడమ చేతి చిటికెనవేలు మొనతో వజ్రాన్నితాకి, వెంటనే చెయ్యి వెనక్కు తీసుకుని, ఏ తేలో కుట్టినట్టుగా చెయ్యి విదిలించుకుంటూ, ''మహారాజా, ఇది కాసు ఖరీదు చెయ్యదు. దీని పుట్టక అపవిత్రమైనదేగాక, దీనిలోపల పురుగుకూడా ఉన్నది." అన్నాడు.

రాజు మండిపడి, "ఎంతమాట అన్నావురా, తుచ్ఛుడా! ఇది ఒక రాజు మరొకరాజుకు పంపిన కానుక! పైపెచ్చు ప్రకాశవంతమైనది!" అని, ముందూ వెనకా ఆలోచించకుండా తన తలారిని పిలిచి, "ఈ అబద్ధాలకోరును కొరత వెయ్యి," అని ఉత్తరువిచ్చాడు

మహాకాయుడైన తలారి జోస్యుని అవలీలగా ఎత్తి కొరత వేయటానికి ఉపక్రమిస్తూండగా, వివేకంగల వజీరు అడ్డుపడి, "మహారాజా, ఈ మనిషి తన శక్తులను గోరంతలు కొండంతలుగా చెబితే చెప్పిఉండవచ్చుగాని, బొత్తిగా అబద్ధం ఉండకపోవచ్చు. అతన్ని కొరత వేసిన అనంతరం ఆ సంగతి బయట పడితే, అల్లా మీరు చేసిన హత్యను క్షమించడు. వజ్రాన్ని పరీక్షించినదాకా అతని ప్రాణం కాపాడండి. నూరు వజ్రాలకన్న మనిషిప్రాణం విలువైనది. ఈ వజ్రాన్ని పగలగొట్టించండి. అందులో పురుగు ఉండేట్టుంటే ఇతన్ని వదిలెయ్యండి లేనిపక్షంలో కొరత వేయించెయ్యండి," అన్నాడు.

ఈ సూచన సబబుగానే ఉన్నట్టు తోచి, వజ్రాన్ని పగలగొట్టమని రాజు తలారిని ఆజ్ఞాపించాడు. వజ్రం ముక్కలు ముక్కలుగా పగిలి, ఆ ముక్కల మధ్య నుంచి తెల్లని క్రిమి లుకలుకలాడి గాలి సోకగానే భగ్గున మండిపోయింది.

రాజు పరమాశ్చర్యంతో, "ఎలా కనిపెట్టావు?" అని జోస్యుణ్ణి అడిగాడు.

"నా వేళ్ళు చాలా సున్నితమైనవి.



వజ్రం వెచ్చగా తగిలింది," అన్నాడు జోస్యుడు

"అతన్ని విడిచిపెట్టి, అతని రొట్టెలూ, కూరా, నీరూ రెట్టింపు చెయ్యండి," అన్నాడు రాజు.

మరికొన్ని రోజులకు రాజుకు అరేబియాలో దూరప్రాంతంనుంచి ఒక నాయకుడు చాలా అందమైన ఎర్ర గుర్రాన్ని కానుకగా పంపాడు. రాజు అశ్వశాలకు వెళ్ళి ఆ గుర్రం అందచందాలు చూసి ఆనందిస్తూ చాలాసేపు గడిపి, రెండో జోస్యుణ్ణి పిలిపించి, "నీకు గుర్రాలను గురించి అంతా తెలుసుననే అంటావు గాదూ?" అన్నాడు

"అవును, మహారాజా," అన్నాడు జోస్యుడు

"సరే, నీకిప్పుడు పరీక్ష పెడుతున్నాను ఇందులో ఒక్క పొరపాటు జరిగినా నిన్ను చిత్రహింసకు గురి చేయిస్తాను ఏమంటావు?"

"అలాగే చేయండి, మహారాజా."

రాజు గుర్రాన్ని తెప్పించాడు జోస్యుడు ఒక్కసారి దానికేసి చూసి, మూతి బిగించి రాజుకేసి తిరిగి, చిరునవ్వుతో, "చూశాను, గ్రహించాను," అన్నాడు

"ఏం చూశావు? ఏం గ్రహించావు?" అన్నాడు రాజు.

"ఈ గుర్రం గొప్పపుట్టుకగలది అనేక మంచి లక్షణాలతో కూడుకున్నది. చాలా అందమైనది ఒక్క లోపం లేని పక్షంలో దీన్ని అశ్వాలకు రాజు అనటానికి సందేహంలేదు," అన్నాడు జోస్యుడు

మొదటి మాటలకు పరమానందం చెందిన రాజు చివరిమాటకు ఉగ్రుడై



పోయి, "ఏమిటా లోపం?" అని క్రోధంగా అడిగాడు

"మీరు ఆగ్రహించే పక్షంలో నేను చెప్పగలిగిన దేమీలేదు," అన్నాడు జోస్యుడు.

"చెప్పమని ఆజ్ఞాపిస్తున్నాను!" అని రాజు అరిచాడు.

"నాకు అభయమిస్తేనేగాని చెప్పను."

రాజు సరే నన్నాడు.

"తండ్రివైపు ఈ గుర్రం గొప్ప జాతికి చెందినదే గాని, దీని తల్లి మాత్రం సముద్రపు గేదె," అన్నాడు జోస్యుడు.

రాజు కోపంతో కప్ప ఉబ్బినట్టు ఉబ్బిపోతూ, "ఈ దుర్మార్గుణ్ణి కొరత వెయ్యి!" అని తలారితో అన్నాడు.

తలారి జోస్యుణ్ణి అవలీలగా ఎత్తి కొరతవెయ్యబోతూండగా, పెద్ద వజీరు మళ్ళీ అడ్డుపడుతూ, "మహారాజా, ఈ మూర్ఖుడు అలా మాట్లాడి గొప్ప అపచారమే చేశాడు. కాని గుర్రాన్ని తెచ్చిన కాసావాడిచేత నిజం చెప్పించి, ఈ జోస్యుడి అబద్ధం ఋజువుచేసి మరీ కొరత వేయించడం భావ్యంగదా?" అన్నాడు

రాజు అలాగే చెయ్యమన్నాడు.

కాసావాణ్ణి పిలిపించి, ఆ గుర్రం యొక్క జన్మపత్రం చూపమన్నారు. వాడు వైడూర్యాలు పొదిగిన రాగిడబ్బా తన అంగీలోనుంచి తీసి రాజుకు ఇచ్చాడు. రాజు ఆ డబ్బానుంచి ఒక పత్రం తీశాడు. అందులో ఈ గుర్రం ఒక మేలుజాతి మగగుర్రానికి సముద్రపు గేదెకూ పుట్టినట్టు స్పష్టంగా రాసి ఉన్నది.

ఇది చూసినమీదట రాజుకు జోస్యుడి శక్తిని గురించి అమితమైన ఆశ్చర్యం కలిగింది. ఆయన జోస్యుడి శిక్షరద్దుచేసి "ఎలా చెప్పగలిగావు?" అని అడిగాడు.



"ఏమంత కష్టంకాదు. ఈ గుర్రం గిట్టలుచూస్తే మీకే తెలుస్తుంది," అన్నాడు జోస్యుడు.

రాజు గుర్రం గిట్టలకేసిచూసి, అవి చీలి మొరటుగా, గేదె గిట్టలలాగా ఉండటం గమనించాడు

"యా అల్లా! ఈ నిపుణుడి రొట్టెలూ, మాంసమూ, నీరూ రెట్టింపు చెయ్యండి." అన్నాడు రాజు.

ఇద్దరు జోస్యుల శక్తులను పరీక్షించిన మీదట మూడోవాడి శక్తిని కూడా పరీక్షించాలని రాజుకు పుట్టింది. అందుచేత ఆయన మూడో జోస్యుణ్ణి పిలిపించి, 'ఎవడి జన్మరహస్యమైనా చెప్పగలనని అంటావు కాదూ?" ఏ ఆడదాన్ని బురఖావేసి తెచ్చి నిలబెట్టినా ఆమె జాతీ, పుట్టుపూర్వోత్తరాలూ చెప్పగలనని అనవూ?" అన్నాడు.

"నిజమే, మహారాజా. నాకు అలాటి శక్తి ఉన్నది," అన్నాడు జోస్యుడు.

"అయితే నా వెంట రా!" అంటూ రాజు, జనానాలో స్త్రీల నందరినీ ముసుగులు వేసుకోమని హెచ్చరించి, జోస్యుణ్ణి అక్కడికి తీసుకుపోయాడు.

ఆయన జోస్యుడికి తన ప్రియ భార్యను చూపి, "ఈమెకు సలాంచెయ్యి. ఈమెను చూడు, తరవాత నాకు ఈమెను గురించి చెపుదువుగాని," అన్నాడు.

జోస్యుడు ఆమెకు సలాంచేసి, "చూశాను!" అన్నాడు.

"పద!" అంటూ రాజు అతన్ని తన గదికి తీసుకుపోయి, తన ప్రియభార్య గురించి చెప్పమన్నాడు.

"మహారాజా, ఆమె అందచందాలూ, మనస్సూ అత్యద్భుతం. ఆమె తెలివి

శేటలూ, సౌజన్యమూ అనన్యమైనవి. ఆమెకు ఏలోటూ లేదు సర్వజ్ఞుడు అల్లా మాత్రమే,'' అన్నాడు జోస్యుడు.

"ఆ సోది అంతా ఎవరికి కావాలి? ఆమె జన్మరహస్యం చెప్పు,'' అన్నాడు రాజు

జోస్యుడు కాస్త పస్తాయిస్తూ, "మహారాజా, అది గోప్యమైన విషయం. బయటపెట్టదగిన విషయం కాదు,'' అన్నాడు

''ఓరి మూర్ఖుడా! నిన్ను నేను కోరిన దేమిటి? ఛండాలుడా, ఒళ్ళు దగ్గిర పెట్టుకుని, నువు చెప్పవలసినదేమిటో చెప్పు," అన్నాడు రాజు

''మహారాజా, ఆమెలో ఒక్కలోపం లేకపోతే ఆమె స్త్రీలలో రత్నంకాదా?'' అన్నాడు జోస్యుడు.

''కుళ్ళా, కుక్కల కొడకా! నా ప్రియభార్య నముద్రపుగేదెకు పుట్టిందని చెబుదామనుకుంటున్నావా? లేక ఆమెకో పురుగున్నదని చెబుదా మనుకుంటు న్నావా? నిన్ను నా కత్తికి బలి ఇస్తాను," అంటూ రాజు కత్తిదూశాడు.

ఆయన ఆ అభాగ్యుణ్ణి కత్తితో పొడిచేలోపున వజీరు అడ్డుపడి, "ముందు వాడి నేరం నిరూపించటం యుక్తంగా ఉంటుంది,'' అన్నాడు.

''చెప్పు! ఏమిటా లోపం?" అని రాజు గద్దించాడు.

"మహారాజా, మహారాణివారిలో ఏ లోపమూ లేదు. కాని ఆమె తల్లి నర్తకి ఘాజీయాలనే సంచారజాతికి చెంది, స్వేచ్ఛగా తిరుగుచూ, వ్యభిచారంలో పుట్టినది," అన్నాడు జోస్యుడు

రాజుకు క్రోధోద్రేకంతో క్షణంపాటు శ్వాస స్తంభించింది. తరవాత ఆయన తన రాజభవనంలోనే ఉన్న మామను పిలిపించి, ''ఈ క్రౌరుచూశావు గదా, నీకూతురు ఎలా పుట్టినదీ నిజంచెప్పు," అన్నాడు

ఆయన ఇలా అన్నాడు

"మహారాజా, నిజం చెబుతాను. నా యౌవనంలో ఎడారిలో స్వేచ్ఛాజీవిగా బతుకుతూ, బిడారులను మా ప్రాంతం కుండా తీసుకుపోయేవాణ్ణి. ఒకనాడు మేం జుబైదా బావుల ప్రాంతంలో మజిలీచేసి ఉండగా, ఘాజియా స్త్రీల దళం ఒకటి అటుగా వచ్చింది. ఈ దేరి నదిమొదలు ఘాజియా స్త్రీలు ఎడారి మనుషులతో వ్యభిచరిస్తూ ఉంటారు; ఒక మజిలీనుంచి మరొక మజిలీకి సంచారంచేస్తూ ఉంటారు: యువకులకు తమ శరీరాలు విక్రయిస్తూ ఉంటారు ఆ స్త్రీలు మా వెంట కొద్దిరోజులుండి, మరొక మజిలీకి బయలుదేరారు వాళ్ళు వెళ్ళిపోయాక, బావుల సమీపంలో ఒక చెట్టుకింద అయిదేళ్ళ బాలిక ముదుచుకు కూర్చుని నాకంట పడింది. ఆమెను తల్లి మరిచిపోయిందో, లేక వదిలిపెట్టిందో,




ఆ పిల్ల ఖర్జూరపండులాగా మహా అందంగా ఉండటంచూసి, పెంచుకోవ టానికి నిశ్చయించాను. మొదట్లో ఆమె అడవిమృగం లాగున్నా, క్రమంగా దారికివచ్చి, నా పిల్లలతోబాటే పెరిగింది. యుక్తవయసు వచ్చేసరికి ఆమె అమిత ఆకర్షవంతంగా తయారయింది. ఆమెకు పెళ్ళిచేసేశాను. అల్లా ప్రసాదించిన కుమార్తె ఏలినవారికి ప్రియతమురాల యింది. ఇంతే జరిగింది. అల్లామీద ప్రమాణంచేసి చెబుతున్నాను."

ఈ కథ విన్నాక రాజుకు మళ్ళీ సుఖంగా శ్వాస ఆడింది. తన భార్యే వ్యభిచారిణిఅయి ఉండపచ్చునని ఆయన భయపడ్డాడు. ఆమె పెళ్ళినాటికి కన్యే నని ఇప్పుడు నిశ్చయమయింది. ఆయన జోస్యుడి సూక్ష్మజ్ఞానానికి ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"అందులో విశేషమేమీలేదు. ఘాజియా స్త్రీల కనుబొమలు దళసరిగా ఉండి, ముక్కుమీద కలుసుకుంటాయి. అదీగాక అరేబియాలో అంత నల్లని నల్ల గుడ్డు గలవారు మరెవరూలేరు," అన్నాడు జోస్యుడు.

అంత తెలివిగలవాణ్ణి సన్మానించి తీరాలనిపించి రాజు, అతనికి రొట్టెలూ, మాంసమూ రెండింతలు చెయ్యమనీ తాగినంత నీరు ఇయ్యమనీ ఉత్తరువు చేశాడు.

కాని మూడో జోస్యుడి కష్టాలు అంతటితో తీరలేదు...

ఇంతవరకు కథ చెప్పిన మంత్రి కుమార్తె తెల్లవారుతూ ఉండటం గమ నించి, మౌనం వహించింది

(సశేషం)




వివిబి. రామారావు

**అద్దపుశిల** పార్వతీపురానికి నాలుగు మైళ్ళ దూరంలో ఉంది. ఊరు నాను కుని ఓ కొండ, కొండమీద చిన్న శివా అయం. నల్లగా ఎత్తైన కొండమీద కొత్త సున్నంతో మెరుస్తున్న ఆలయాన్ని చూసి, ఏనుగుమీద అంబారీలా ఉంటని వర్ణించాడో కవి. ఆలయం బహుప్రాచీన మైనది. ఏటేటా శివరాత్రికి అక్కడ పెద్ద తీర్థం జరుగుతుంది. వేలాదిప్రజలు కాలినడకన రెండెడ్ల బళ్ళలోనూ శివ రాత్రి పొద్దున్నే చేరుకుంటారు ఆ ఊరు. చెరువులో స్నానంచేసి, శివార్చన చేసికొని, ఆ రోజంతా అక్కడ గడిపి, రాత్రి జాగారంచేసి (హరికథలూ, బుర్ర కథలూ, పురాణకాలక్షేపాలు, నాట కాలూ, చీట్లపేకలూ, జాగరణ సాధ

నాలు) మరుసటిరోజు స్వగ్రామాలకు తరలివెళతారు మోక్షగాములు.

నాటుబండి తప్ప మరో ప్రయాణ సాధనంలేదా ఊరికి. రైలుదారి నాలుగు మైళ్ళదూరంలో ఉంది. ఇక పార్వతీ పురాన్ని కలిపే దోవకి, రోడ్డు అనే మాట దానికి వర్తింపచెయ్యడం కష్టమే అయినా, దారికి ప్రత్యామ్నాయంగా వాడేస్తుంటారు ఆ గ్రామస్తులు.

కామాక్షమ్మకు ఐహిక వాంఛలేవీ లేవు. భర్త పోయి మూడేళ్ళయింది. ఆమెకు కావలసినవన్నీ ఉన్నాయ్. రత్నంలాటి ఒక్కగానొక్క కొడుకు, డాక్టరీ చదివి పైదేశాలు తిరిగివచ్చాడు. ఆమె భర్త బతికుండగానే. ఆమె చింతంతా ఒక్కటే, కొడుకు ఒక ఇంటి వాడు కావడం చూడలేదే అని.

శివరాత్రికి అడ్డపుశిలలోని ప్రాచీన శివాలయంలో అర్చన చేద్దామన్న సంక ల్పంకలిగి కొడుకు కరుణతో చెప్పింది మధ్యాహ్నం అతను భోజనానికి వచ్చి నప్పుడు.

"రేపు శివరాత్రి, అడ్డపుశిల వెళదా మనుకుంటున్నాను."

"ఈ కోల్డ్‌వేవ్‌లోనా, అక్కడికే వెళ్ళాలని ఎక్కడుంది. శివాలయం ఇక్కడా ఉందిగా?"

"అది కాదురా..."

వాక్యం పూర్తిచెయ్యనియ్యలేదు కరుణ. "ఏమిటో నమ్మా, ఇంత చలిలో నువ్వెక్కడికి వెళ్ళడం నాకిష్టంలేదు ఇక్కడే జానెడు దూరంలో ఉన్న బాపన్న కోనేరులో స్నానంచేసి ఒడ్డు నున్న శివాలయంలో అభిషేకంచేయించ కూడదూ, శాస్త్రిగారికి కబురంపుతాను?"

"కాని తీర్థసేవ..."

"పోనీ తీర్థసేవే కావాలంటే, కారు పంపుతాను, గుంప వెళ్ళి రారాదూ? నాగావళిలో స్నానం, వెలసిన కోవిలలో అర్చన"

—పొద్దున్న ఎనిమిదింటికి యాత్ర, మధ్యాహ్నం భోజనం తరువాత రెండు చెంచాల మందూ, అన్న ధోరణిలో చెప్పాడు కరుణ.

కామాక్షమ్మకు గడచిన శివరాత్రులు జ్ఞాపకం వచ్చాయి. సంజీవరావుగారు శివభక్తులు. ఏటేటా ఎడ్లబండిమీదా కొన్నాళ్ళ తరువాత గుర్రంబండిమీదా, మరికొన్నాళ్ళ తరువాత కారుమీదా, కామాక్షమ్మను గుంప తీసుకెళ్ళి తీర్థం సేవిస్తూ ఉండేవారు.—

"అది కాదబ్బాయ్! గుంప ఎప్పుడూ వెళుతున్న క్షేత్రమే. ఇన్నాళ్ళైి ఈ ఊళ్లో ఉంటున్నా అడ్డపుశిల అనుకోడమేగాని ఎప్పుడూ వెళ్ళలేదు. నిన్నగౌరి చెప్పింది ఆ ఆలయం చాల గొప్పదని. మళ్ళీ శివరాత్రికి ఉంటానో, శివసాన్నిధ్యాన్నే చేరుతానో-గౌరి తోడువస్తానంటోంది. బండికూడా మాటాడేసింది."

"సరే వెళ్ళు. చలికిమాత్రం సరి

యైన ప్రొటెక్షన్ తీసుకెళ్ళు—బండికుదుపు నీకు తెలీదు. కాళ్ళన్నీ వదులైపోతాయి. ఏం అహల్యా, నిజమేనా, నే చెప్పినది॥"

—ఏ విషయంలోనైనా మరోసారి అహల్య కన్ఫర్మేషన్ పొందడం అల వాటైపోయింది కరుణకి.

తలవంచుకుని భోజనంచేస్తున్న అహల్య తన నిశ్చయాన్ని చెప్పింది.

"పోనీ, అన్నయ్యా, దైవదర్శనం కోసం శ్రమదమాదులనుపడడం,దర్శనం కంటె ఎక్కువ పుణ్యకారణమని మన వాళ్ళ నమ్మిక. గౌరితోడుంటుందిగా. మిగిలిన ఏర్పాట్లన్నీ నే చేస్తా॥"

అక్కడికి ఆ నిర్ణయం తీసుకోవడం జరిగిపోయింది. మధ్యాహ్నం పనిలోకి వచ్చిన గౌరి పొద్దున్నే దర్శనంచేసుకోవ డానికి వీలుగా పెందరాళే బండి తెస్తా నని వెంకటస్వామి చెప్పాడనీ, సిద్ధంగా ఉండమనీ చెప్పింది.

మరుసటిరోజు పొద్దున్న అదేపనిగా బజ్జర్ మోగుతూంటే అహల్య కిందకి వచ్చి తలుపుతీసింది.

"అదేంటే గౌరీ, అలా కొట్టేస్తున్నావ్, నేను కిందకు దిగిరావాలా?"

"అయిద్దైపోనాదటమ్మా, రామారావ్ ఒటల్ కాడ గంట సూసినాడు ఎంకట సోమి."

—కామాక్షమ్మ బజ్జర్ శబ్దం విని దిగిరానే వచ్చింది.

"పిన్నీ, అక్కడ స్నానం చేసే కంటె, ఇక్కడే స్నానంచేసి బయలు దేరరాదూ?"

"అదెలా పనికొస్తుందే." అంటూ తొందర తొందరగా తెమిలిపోయింది కామాక్షమ్మ. వెంకటస్వామి బండిలో పరుపూ, దిండ్లూ వేశాడు. రగ్గూ, స్వెట్టరూ, శాలువా, ఇంకా ఏమిటేమిటో సర్దేసింది అహల్య.

"అహల్యా, కరుణా, మీరు అన్నగ్రి అంటూ అన్నం మరిచిపోక పెందరాడే ఇంత తిని మరోపని చూసుకోండి. నేను పొద్దున్నే మరోసారి దర్శనం చేసుకుని వచ్చేస్తా॥ ఒరేయ్ పొట్టిగా, ఇల్లు జాగ్రత్త॥" స్టూలుమీదనుంచి బండి ఎక్కింది కామాక్షమ్మ.

బండి ఊరు దాటింది.

"తీర్థంలో ఏటేటి కొంటావ్ గౌరమ్మా? రంగులరాట్నం ఎక్కుతావా? నీకేం బయంనేదులే నేనూ ఉంటా॥" వెంకటస్వామి కదిపాడు.

"రంగులరాట్నం నువ్వెక్కుతావా? పళుక్కున ఇరిగిపోదూ?"

"ఇరిగిపోదునేవే, చిన్నదనుకుంటు న్నావేటి; ఎంత ఎత్తుంటుందో తెలుసా... అంతా ఎక్కాక తరువాత తిప్పుతారు కిందనుంచీ, మా సరదాగుంటాదనుకో॥"

—బండి ఇరుకుగా ఉన్న ఓ గోరి జలో ప్రవేశించింది. బండిచక్రాలకు




పక్కనున్న గుబుర్లు తగిలి రాస్తుంటే వింతైన శబ్దం.

"గౌరీ, మీ అమ్మ నీ పెళ్ళి సంగతేమిచేసిందే?"

—తీరుబడిగా అడిగింది కామాక్షమ్మ.

"అదెందుకు తలపెడతారమ్మగోరూ, పిల్ల అత్తోరింటికెళితే టీ కొట్టెవడు జూత్తాడు?"

గౌరి మనసు చివుక్కుమంది.

అయ్య సచ్చిపోయాక తనను పట్టుకుని, ఆ ఇంటా, ఈ ఇంటా పన్జేసి మెల్లగా టీ దుకాణ మెట్టింది. ఎనిమిదేళ్ళ గౌరిని లాయరుగారింట్లో పనికి కుదిర్చింది. లాయరుగారు మకాం ఎత్తేశాక డాక్టరుగారింటో.

నాటుదోవ వట్లు కుదివేస్తోంది.

"వెంకటస్వామీ, సగం దోవ వచ్చామా?"

"వచ్చామండమ్మగోరూ, అదేటి, ఆ తాటిచెట్టైనకే ఉంది ఊరు."

తాటిచెట్ల దగ్గర కొచ్చేసరికి ఏడు దాటింది.

"ఇదిగో నమ్మగోరూ, ఈడే తీర్థం జరుగుతాది. బండి ఊళ్ళోకి తీసుకెళ్ళమంటారా, ఎడ్ల నీడే ఇప్పేమంటారా?"

—బండి దిగితే చాలనుకుని గౌరి సాయంతో బండి దిగింది కామాక్షమ్మ.

"అమ్మగోరూ, నే ఎడ్లకు మేతపడేసి ఆ ఎనక గుడికెడతా. మీరూ గౌరీ ముందుపదండి. బండికాడ నేనుంటా."

గౌరీ, కామాక్షమ్మా కోనేటికేసి నడిచారు. ఇంకా తీర్థసమ్మర్దం కోనేటికి సోకలేదు. ఓ పక్కగా రేవుదగ్గర స్నానం ముగించుకున్నాక ఇద్దరూ గుడికెళ్ళారు.

"కౌండిన్యసగోత్రం, కామాక్షమ్మ" గోత్రనామాలు చెప్పింది పూజారికి.

రుద్రాభిషేకానికి సంచితో కొబ్బరి కాయలూ పూజసామగ్రి పట్టుకొచ్చింది గౌరి.

"ఈ గుళ్లోంచి కాశీకి సొరంగం ఉందట నిజంవేనా?" గౌరి వక్కనున్నా యన్ను అడిగింది.

"అవునమ్మా! ఆ బండలమధ్య చిన్న చీలిక కనపడటంలేదూ, ఆ చీలిక ఒకప్పుడు చాలా పెద్దగా ఉండేదట. ఆ చీలిక వెంట వెడితే విశ్వేశ్వర సన్నిధికి ఓ సొరంగ మార్గం కనపడేదట. కాని ఓ భూకంపంవచ్చి సొరంగం అడ్డుగా ఓ శిల పడిందనీ, చీలిక మూసుకపోయిం దనీ చెబుతారు. ఇప్పుడల్లాటివి నమ్మే వారెవరున్నారు తల్లీ!"

అర్చన అయిన తరువాత బండి దగ్గరకొచ్చారిద్దరూ. తీర్థప్రజ విరివిగా వస్తున్నారు. మొత్తాలమీద కాలేసి జనం లోకి చూస్తున్నాడు వెంకటస్వామి.

"అమ్మగోరూ! నేనెల్లి తానం సేసొత్తా. బండిలో కూకోండి. గౌరమ్మా, అమ్మగారి దగ్గిరే కూకో. నే ఒచ్చేత్తా!"

దిండుకింద మహాభాగవతాన్ని తీస్తూ అహల్యను మెచ్చుకుని, అష్టమస్కం ధంలో సప్తమాధ్యాయం చదువుతుండగా కామాక్షమ్మకు దగ్గరగా నాగస్వరం విన పడింది.

అధ్యాయం చివరకు వచ్చింది. శివుని హాలాహల భక్షణ ఘట్టం పూర్తిచేసి బండిలోంచి కిందకు దిగింది. గౌరి బండి చక్రం వద్ద నుంచుంది.

ఓ పదిగజాల దూరంలో పాముల వాడు గుంత్రని వెదురుపెట్టెలోంచి పాములను తీసి ఆడిస్తున్నాడు. పాముల వాడి కొడుకులా ఉన్నాడో యువకుడు. మధ్య మధ్య ఒక్కొక్కబుట్టా తీసి అందులో పాము బయటకుతీసి చూపించి దానిగురించి చెబుతున్నాడు.

"ఇది సూడండి బాబూ, సంపెంగ నాగు. అల్లంత దూరాన్నుండగా గుప్పున వానన..."

బారెడుపాము చూడడానికి భయం గొలుపుతూ ఉంది. నాగస్వరం విని పడగ విప్పింది సంపెంగినాగు.

గౌరి ఎవరితోనో చెబుతోంది: "నాగు బాము, ఔరిపోతూ కొట్లాడుకుంట యట. అది చూసినోళ్ళకు ఎంతో అదృష్టమంట!"

ఎండలో పాముపడగ వింతగా మెరు స్తోంది.

"చూడండమ్మోయ్! ఇది కోడెనాగు. సినిమానాగు కాదమ్మోయ్. అసలు కోడె నాగు." గౌరి దగ్గరకువచ్చి చూపిం చాడు.

చక్రానికి కరుచుకుపోయింది గౌరి భయంతో.

పాములను ఆడించడం అయిపోయిం తరువాత పాములవాడు వెదురుపళ్ళెంతో



మూకచుట్టూ తిరిగి చిల్లర పోగుచేసు కున్నాడు.

కామాక్షమ్మ గౌరిని పిలిచి ఓ అర్ధ రూపాయి చేతికిచ్చింది.

బండిచక్రం దగ్గర నిలబడి చూస్తున్న గౌరిని ఓ కంట కనిపెడుతున్న పాముల బ్బాయి జమీందారిణిలా కనపడుతున్న కామాక్షమ్మ గౌరిని దగ్గరకు పిలిచి చేతిలో ఏదో పెట్టడం చూశాడు.

తండ్రి పోగుచేసిన చిల్లర కిందపరిచి ఉన్న గుడ్డమీదపోశాడు.

చిల్లర మధ్య అర్ధరూపాయి కన పడింది పాములబ్బాయికి.

"దబ్బుగల మారాజులు! మా అమ్మా, మణి, నాగుపాముమణి"— కామాక్షమ్మ దగ్గరకు తీసుకొచ్చాడు.

నల్లగా కాకరగింజలా ఉంది. ''సూసావా పిల్లా, మణి మహత్తెం సూపించమంటా వేది?''

"సూపించు. సూత్తా" బండి చక్రానికి చేరగిలబడ్డ గౌరి కొద్దిగా ముందు కొచ్చింది.

మిసమిస లాడుతున్న జబ్బంతో, కోరమీసాలతో, నవ్వులు చిందించే ముఖంతో, కంఠంలో గర్వంతో కలకల లాడుతున్నాడు పాములబ్బాయి.

ముఖానికి పసుపురాసుకుని పాతకాలం కాని అంత బొట్టెట్టుకుని నుదుటను జుట్టు పడుతూ, ఆరబోసుకోక పాయినా అరి పోతున్న జుట్టుతో జిగ్గని మెరిసిపోతోంది గౌరి.

ఇద్దరినీ చూస్తోంది కామాక్షమ్మ.

"ఇదిగో కరిపించేసుకుంటా. ఈ నాగుపాముచేత, సూత్తుండగా ఇసం పీల్చేస్తాది సూసోక్క."

—చటుక్కున ఓ బుట్టమూతతీసి లోపలవేలెట్టాడు పాములబ్బాయి.

"అబ్బ నీ సిగదరగ!" చెయ్యి బయ టకు లాగేశాడు...మణిని వేలికి నొక్కి పట్టాడు. "ఇసం పీల్చేసినాది మణి" అన్నాడు పాములబ్బాయి.

టీ దుకాణం దగ్గర కెళ్ళి కాసిని పాలు గ్లాసుతో తీసుకొచ్చాడు పాములవాడు. మణి గ్లాసులో వేశాడు.

పాలు కాఫీ డికాషన్ రంగులోకి మారిపోయాయి.

"సూసినావా, మణి మహిమ!"— ఓరగా చూశాడు గౌరివంక పాముల బ్బాయి. గౌరి బండిదగ్గరకు వచ్చేసింది.

"అమ్మా, ఆ మణి అమ్ముతాడేమో అడుగుతా, కొంటారమ్మా? చాలా మంచి మణిలా ఉంది."

"పోసీలే, అడగవే కొందాం, ఎంత కిస్తాడో కనుక్కో!"

"మారాజులు, మారాజులు" అంటూ మణి పట్టుకుని పాములబ్బాయ్ బండి దగ్గరకు వచ్చాడు.

"పదిరూపాయ లియ్యండమ్మా. అసలు నాగుమణి. పేనం నిలబెట్టేమణి!"

పదిరూపాయలనోటు పట్టుకెళ్ళి పోయాడు పాములబ్బాయి గౌరి వైపో సారిచూసి. మరికాసేపట్లో బుట్టలు కావిడి వేసుకుని పాములవాళ్ళు మరో పక్కకు పోయారు.

పగలంతా భాగవతం చదువుతూ గడిపేసింది కామాక్షమ్మగారు. రాత్రి కోటేశ్వరరావ్ భాగవతార్ హరికథా కాలక్షేపం. అర్ధరాత్రి మరోసారి కోవెల లోకి వెళ్ళింది కామాక్షమ్మ—

తెలతెలవారుతుండగా తిరుగు ప్రయా ణం కట్టారు.

గౌరీ, వెంకటస్వామీ ఏమిటేమిటో మాటాడుకుంటున్నారు.

కరుణ పెళ్ళి తన కళ్ళతో చూస్తానా అని ఆలోచిస్తోంది కామాక్షమ్మ.

వెళ్తున్నప్పటికంటె తిరుగుప్రయాణం సుఖంగానే అయింది.

"తీర్థం బావుందా గౌరీ!"—స్నానం చేసి బాత్‌రూమ్‌లోంచి వస్తూ కరుణ అడిగాడు.

"బలే బాగుంది బాబూ! సొరంగం మాత్రం మూసుకుపోయినాదట!"

"అలాగా!" —మేడమీదకు వెళ్ళిపోయాడు కరుణ. అహల్య ఉప్మా చేస్తోంది. కామాక్షమ్మగారు రాగానే స్నానంచేసి పూజకని పువ్వులకోసం పెరట్లోకి వెళ్ళింది. సంపెంగచెట్టుకింద గౌరి నిలబడి ఏదో పరాకుగా ఆలోచిస్తోంది.

పువ్వులు కోసుకుని పూజకు కూచుంది కామాక్షమ్మ.

బట్టలువేసుకుని కింద భోజనాల గదిలోకి వచ్చాడు కరుణ.

"ఉప్మా తిని చెప్పు అన్నాయ్ ఎలా ఉందో!"

"వండర్‌ఫుల్, అమ్మా నువ్వూ రుచిచూడు!"

"నే నిన్న ఉపవాసం, ఈ రోజు పెందరాడే ఓ బ్రాహ్మడికి పెట్టి మరీ తింటా. శాస్త్రిగారికి కబురుపంపు, పది గంటలకల్లా రమ్మని."

పొట్టిగాడు హడావుడిగా పరిగెత్తుకొచ్చాడు ద్వారం దగ్గరికి.

"బాబూ, బాబూ! అర్జంటు పాము కరిచేసిందట!"

"ఎవరినిరా!"

"ఎవరో నమ్మా, బండిమీద తీసుకొచ్చారు."

"హమ్మ!" అనుకుంది కామాక్షమ్మ. సంపెంగచెట్టుకింద గౌరి నిలబడడమే ఏదోలా అనిపించింది. పాము కరిచిందనగానే గౌరినేమోనని తుళ్ళిపడింది.

కరుణా, అహల్యా లేచి వీధి వరండాలోకి వెళ్లారు.

"గౌరీ! గౌరీ!" పెరట్లోకి కేకేసింది కామాక్షమ్మ.

పరుగుపరుగున వచ్చింది గౌరి.

"ఎవరినో పాము కరిచిందట. మనం కొన్న మణి ఏదీ?"

"మీకే ఇచ్చేశానమ్మా! కొంగున ముడేసుకున్నారూ!"

"అయ్యయ్యో! ఆ చీరతోనే స్నానం చేశా. డాబామీద ఆరేసినట్టున్నావ్, వెళ్ళి తీసుకురా!" ఆ మాటలంటూనే తనూ వీధివరండాలోకి వచ్చింది.

"అహల్యా, ఎడ్రినలిన్, క్విక్!"

ఇంజక్షన్ ఇస్తూనే అడిగాడు కరుణ పాముకుట్టి ఎంతసేపయ్యిందని.

"పొద్దుగూకులే బాబూ. నిన్న అర్ధపుశిల తీర్థాని కెళ్ళినాం, నాలుగు రాళ్ళు దొరుకుతయ్ కదా అని. రాత్తిరి సింతసెట్టుకాడ మకాం ఏసినాం. తెలతెలవారుతుండగా కుర్రోడు లేసి బయట కెళ్ళబోనాడు, తొక్కేసినాడు గొడ్డుని. మంత్రాలేసినాను ఏటి నాబం, గిలగిల్లాడిపోనాడు. చెమటవొట్టి పోనాడు. కాలు ఓసిపోనాది. ఓటే గెంతులు—మాటాడితే అదే వాగుడు, లేదా ఒరిగిపోతన్నాడు. తీర్థంలో బండిదొరకడవే కష్టమైపోనాది."

"ఇదిగోనమ్మా మణి." గౌరి వచ్చింది.

బల్లమీద మనిషినిచూసి కొయ్యైపోయింది.

"సిదేవూరయ్యా!"

"మాకో ఊరేటమ్మా, నిన్న అర్ధపుశిల

తీర్థానికెళ్ళినాం. అక్కడే కాటేసింది మాయనాగు.'' — బావురుమన్నాడు పాములవాడు.

''అసలేం పామో తెలుసా, నువ్ చూశావా?'' పేషెంటువైపు చూస్తూ పాములబ్బాయి నడిగాడు కరుణ.

"ఏదో కనపడనేదు బాఁవూ, తాచు పామేమో!"

''పోలీ వెలెంట్ యాంటీ వెనైన్ ట్రై చేస్తే?'' అహల్య అడిగింది.

''వెరీ ఎక్స్‌పెన్సివ్. బట్ లెట్ అజ్ ట్రై!''

పేషెంటుకు ఒంటిమీద స్పృహలేదు. స్పర్శజ్ఞానమూ లేదు. అతని ముఖంలోకే చూస్తున్న కరుణ, అహల్య ఫ్రిజ్ తియ్యబోతుంటే అన్నాడు, ''సారీ అహల్యా! న్యూరోటాక్సిన్ ఫాక్టర్స్ ఆర్ ప్రిడామినెంట్. పల్స్ కూడా ఫెయిల్ అవుతోంది. ఆర్టిఫిషియల్ రెస్పిరేషన్ ట్రై చేద్దాం.''

"అబ్బాయ్, మణి పెట్టరాదూ, ఇది పనిచెయ్యడం నే చూశా!''

శ్వాస ఆడించడానికి ప్రయత్నం చేస్తున్న కరుణ తల్లిమాటలు వినిపించుకోలేదు. మరో ఐదునిముషాలు గడిచాయి.

గౌరి చేతిలో మణి పట్టుకుని అలాగే నుంచుంది.

''అహల్యా, ఇక మనం చెయ్యగలిగిందేమీ లేదు. ఇటీజ్ ఎ మేటర్ ఆఫ్ మినిట్స్ ఫర్ హిమ్. రెస్పిరేటరీ సెంటర్ ఇన్‌వాల్వ్ అయిపోయింది. ది ఫెలో విల్ డై."

"మణి పెట్టరా!''

"మణా? అదెక్కడిదీ?"—వరండా మీదకొచ్చిన తల్లిని చూసి ఆశ్చర్యంగా అడిగాడు కరుణ.

''నిన్న ఈ మనిషిదగ్గరే కొన్నాం బాబూ! పాము కరిపించి సూపించినాడు. యిసం లాగేసినాది మణి. పాలు నల్లగా అయిపోనాయ్.''

-పాములవాడు కిందపడి దుఃఖంతో చుట్టుకుపోతున్నాడు.

కరుణకు విషయం బోధపడింది.

''అమ్మా, ఈ అబ్బాయిని రక్షించాలనే నీ ప్రయత్నం సమంజసమే. కాని పాము పడగమీద మణులనేవి ఉండవ్. ఆ పేరుపెట్టి వేటినో అమ్మడం పొట్ట పోసుకునే కోటి మార్గాలలో ఒకటి. అది నీ కమ్మి పదో, పాతికో చేసుకున్నాడు దౌర్భాగ్యుడు. వాడి ఖర్మ, రోజూ పాములనాడిస్తూ పాముకాటు వల్ల చావడం!"

''నాయుడూ! ఇంకెందు కిక్కడ? కొనఊపిరితో ఇంటికి తీసుకుపో కుర్రోడిని!''

పొట్టిగాడి సలహా కటువుగా తోచింది కామాక్షమ్మకి.

బండి వీధి మలుపు తిరిగేవరకూ కింద రోడ్డుమీదకొచ్చి చూసిన గౌరి వరండామీదకొచ్చి గోడకు చేరగిలపడిపోయింది.

---




పట్టణం నడిబొడ్డులో క్రిక్కిరిసిన ఇండ్ల మధ్య వుంది ఆ యిల్లు. అది సత్రం లాంటి యిల్లు. అందరూ దాన్ని 'దాకమ్మ దేవిడీ' అంటారు. ఈ వూరికో అద్దె కొంప కావలసినవారు దాకమ్మదేవిడీని తడిమితే చేటంతచోటు దొరక్కపోదు.

తెల్లవాని కాలంలో అది ఒక బందే ఖానా. ఇప్పుడు నల్లవాని యేలుబడిలో 'కాపురాలఖానా'గా పేరు మార్చుకొని కామందు దాకమ్మకు కల్పవృక్షంలా నెల నెలా డబ్బులు రాల్చి పెడుతూంది.

మధ్య బయలు. బయల్లో చేదబావి.

బావికి కొంచెం యెడంగా చుట్టూ గువ్వ గూళ్ళలాంటి గదులు. ఒకోగదిలో ఒకో కాపురం. అన్నీ కలిసి పదకొండు కాపురాలు. ఆడా మగా-పిల్లా విసుకూ అంతా వెరశి యాభై మంది, చాకమ్మదేవిడీలో తలదాచుకుంటున్నారు, గొడుగంత గోవర్ధనగిరికింద మొత్తం గొల్లపల్లె ఒదిగినట్లుగా. వానాకాలంలో పిసపిస - ఎండాకాలంలో కసకస - చలికాలంలో గజగజ - ఒరుసుకుంటూ తప్పుకుంటూ శాపగ్రస్తుల్లా ఒద్దికగా కాపురాలు చేసుకుంటున్నాము.

కుడిచేతి ప్రక్క నాలుగో గది (గవి) లో నేనూ, సుభద్రా, పెద్దోడూ, చిన్నోడూ, చంటిదీ వెరశి అయిదుమంది అయిదేండ్లుగా ఉంటున్నాము.

ఎండకాలం రాత్రుల్లో భోజనాలవుతూనే గబగబా గూళ్లలోనుండి వెలికి వచ్చి బయల్లో బావిచుట్టూ పక్కలు వేసుకుని పడుకుంటాము.

ఆ రోజు రాత్రి తొమ్మిదయింది. ఉక్కబెడుతూంది. పేరుకుగూడా గాలి లేదు. సన్నాపన్నా గాలివున్నా, కాళ్ళీడ్చుకుంటూ సందులుదాటి ఆగొందిలోనికి చొచ్చుకురాలేదు. చంటిదానికి అమ్మవారు పోసింది. గదిముందు వరండాలో ఉయ్యాల్లో పొర్లుతూంది. నేను చెయ్యి కడుక్కుంటూనే చాపా - దిండూ లేసికొని బావిదగ్గర బయల్లోకి వచ్చేశాను.

గుంట చుట్టూ కప్పలు చేరినట్లు అప్పటికే అక్కడ చాలామంది మగవాళ్లు బావి చుట్టూ తమ తమ తావుల్లో పక్కలు పరచుకొని ఉక్కకు విసురుకుంటూ చుట్టలూ, సిగరెట్లూ ముట్టించుకొని బాతాఖానీ సాగిస్తున్నారు.

అక్కడ ఎవరిచోటు వారిదే. మరొకరు ఆక్రమించుకోరు. ఆయా కుటుంబాలవాళ్లు తమ తమ తావుల్లో అట్లా సర్దుకొని పడుకుంటారు.

అప్పటికే అక్కడ పడకవేసుకుని సిగరెట్టు కాలుస్తూ కూర్చొనివున్న రామమూర్తి "రండి మాస్టారూ, భోజనాలయ్యాయా!" అంటూ ఆహ్వానించాడు నన్ను చూసి.

"ఈ వేడికి అన్నం ఎక్కడ సయిస్తుందండీ, ఒకే దగగా వుంది. నీళ్లతోనే సగం కడుపు నిండిపోయింది.'' అంటూ వెళ్ళి రామమూర్తి ప్రక్కన కూచున్నాను.

రామమూర్తి సర్వే ఆఫీసులో పని చేస్తున్నాడు. ఈ వూరికి ట్రాన్స్ఫర్ చేయించుకొనివచ్చి సుమారు నాలుగు నెలలయ్యాయి. ఇల్లు దొరకనందున భార్యనూ బిడ్డనూ పల్లెలో బావమరది దగ్గర వదలి ఇక్కడ హోటలుకూడు తింటూ గృహాన్వేషణ సాగించాడు. కాలికి బలపం కట్టుకుని అదేపనిగా, వెతగ్గా వెతగ్గా కడకు చాకమ్మదేవిడీలో గువ్వగూడంత చోటు దొరికింది. బ్రతికానురా దేవుడా అనుకున్నాడు. మరు

దినమే పల్లెకు పరుగెత్తి వెళ్ళి భార్యా బిడ్డను తెచ్చుకున్నాడు. వారూ వచ్చి వారం రోజులే అయింది.

ఇద్దరం సిగరెట్టు కాలుస్తూ కూర్చున్నాం.

''ఎట్లావుంది ఇల్లు. కొంచెం ఇబ్బందిగా వుంటుందనుకుంటాను." అని మాట వరుసకు పరామర్శించాను.

"ఊరూరూ తిరిగే ఉద్యోగులం సౌకర్యా లెక్కడికని! ఈ నాటికైనా ఇంతచోటు దొరికింది. ఇదే పదివేలు. నాకంటే మా ఆవిడ మహాసంతోషంగా వుందండీ. ఏదో అతఃపురానికి వచ్చినట్లుగా ఆవిడ సంబర పడుతూంది. ఇన్నాళ్ళూ విధిలేక వాళ్ళ వదినెగారి దగ్గర వదలి వచ్చానా. ఆమె వీర్ని పురుగును చూచినట్టు చూచిందట. చెట్టు కిందయినా ఇంతకూడు వండుకొని పడి వుంటాను. ఇక్కడ ఈసడింపులూ పొడుపులూ పడలేకుండా వున్నాను. అంటూ వారానికో ఉత్తరం వ్రాసిందంటే నమ్మండి. ఆ వదివెగారి నీడవదలి ఇక్కడికి వచ్చినప్పటినుండీ మా రుక్మిణి మహదానందంగా వుందండీ." అంటూ చెప్పుకొచ్చాడు రామమూర్తి.

అలా పిచ్చాపాటీ సాగిస్తూ చాలాసేపు గడిపాము. ఇళ్లల్లో దీపాలన్నీ ఒకోటిగా ఆరిపోతూవచ్చాయి. ఆడవాళ్ళుగూడా సామాన్లు సర్ది-దీపాలు ఆర్పి-గదులకు గడెలు పెట్టి-బయల్లో తమతమ వాళ్లున్న చోట్లకు వచ్చి "ఇస్సో" మంటూ నడుములు వాల్చారు. పదిగంటలయినా గాలి పోలిక లేదు. చుట్టూ గోడల్లోంచీ వెచ్చగ సెగ తగుల్తూంది. చెమటకు ఒంటిమీద గుడ్డ అతుక్కుపోతూంది. మగవాళ్ళు బనీనులు ఆడవాళ్లు రవికెలు పెరికి పారేసి విసనకర్రలు ఆడిస్తూ ఉపశమనం పొందుతున్నారు.

సుభద్ర గదిముందు వరండాలోనే ఉండిపోయింది. బయల్లోకి రాలేదు. ఉయ్యాల్లో ఉన్న చంటిదాన్ని కనిపెట్టుకొని గోడకు చేరగిలబడి కునుకు తీస్తూంది పాపం. నేనూ యెప్పుడు నేల బడదామా అనుకుంటున్నా.

''బలే ఉక్కగా వుంది మాష్టారూ. ఈ రాత్రి కిక్కడ పడుకోవడం నా వల్ల కాదండి. వీథిలోకి వెళ్ళితే కొంచెం ఊపిరైనా ఆడుతుంది." అంటూ రామమూర్తి తన పక్కచుట్టుకొని దేవిడీగోడలు దాటి బైట పీధిలోకి వెళ్ళిపొయ్యాడు.

నాకు నిద్ర ముంచుకొస్తూంది. కూచున్న చోటనే చాప దొర్లించి పడిపొయ్యాను. పడుకుందే తడవు కళ్లు మూతలు పడ్డాయి.

రాత్రి ఎంతయిందో తెలియదు. గాఢ నిద్రలో వున్నా. కొంచెం ప్రక్కకు పొర్లాను. నా ఒంటికి మరొక మెత్తని శరీరం రాసుకుంది. ఇంకెవరు! సుభద్ర వచ్చి పడుకొని వుంటుంది. ఆదమరచి తృప్తిగా నిద్రపోతూంది-అనుకున్నా.

అప్పటికి పల్చగా మంచు పడనారం భించింది. కొద్దిగ చలిపెట్టినట్లు తోచింది. నిద్రమత్తులో కళ్ళు మూసుకొనే తలగడ కిందవున్న శాలువతీసి సగం సుభద్రకు కప్పి సగం నాపైకి లాక్కున్నా.

మగత నిద్రలో అంతవరకే తెలుసు నాకు.

*     *     *

మళ్ళీ కళ్ళు తెరిచి చూచేటప్పటికి భళ్లున తెల్లవారిపోయింది. ఆడవాళ్ళు ఇళ్ల ముందు కళ్ళాపి చల్లుతున్నారు. గబ గబా లేచి చాపా-దిండూచుట్టుకొని ఇంటి లోకి నడిచాను.

వరండాలో చంటిది ఉయ్యాల్లో నిద్ర పోతూంది. ప్రక్కనే సుభద్ర నేలపై తెలివిలేకుండ పడివుంది. ఎడమచేతిలో పట్టుకున్న ఉయ్యాల తాడు పట్టుకున్నట్లే వుంది.

"ఏమిటీ మొద్దునిద్ర! లే, తెల్లారి పోయింది," అంటూ తట్టి లేపాను సుభద్రను. ఆమె బెదరినట్లు చివుక్కున లేచింది. అయ్యో! అంటూ బారదెక్కిన ప్రొద్దు చూచి సిగ్గుపోయింది.

"చంటిది రాత్రంతా కన్ను మూయ లేదు. నలుగుతూ, నసుగుతూ పొర్లుతూనే వుండింది. ఉయ్యాల తాడు వదిలుంటే ఒట్టు. నాలుగైంది నేనూ తన్నుమూసే టప్పటికి." అని పలుకుతూ సుభద్ర బద్ధ కంగా ఇంటిలోకి వెళ్ళింది.

ఆ పలుకు తీరు నన్ను చక్కలింత బెట్టినట్లుగా తోచింది.

"ఆహా, ముదియ యెంత ముచ్చ టగా బొంకుతూంది!" అని వకుక్కన నవ్వబొయ్యాను. అంతలో ఠకీమని ఆగి పొయ్యాను.

బుర్రలో ఆలోచన అడ్డుపడింది.

వెంటనే నలుసంత నివ్వెరపాటు.

"మరి సుభద్ర చెపుతూంది నిజమా! అయితే...అయితే...రాత్రి నాప్రక్కన పడుకుంది సుభద్ర కాదా!... మరి... మరి..."

అంతే, ఆపైన బుర్ర బొత్తిగా పని చెయ్యలేదు. ఆలోచనా-ఆశ్చర్యం-విచి కిత్సా-మెదడు గోడల్ని గోకడానికి ఆరం భించాయి.

సంగతి సున్నితమైంది. అప్పటికి సుభద్రముందు మౌనంగా ఉండి పొయ్యాను.

*     *     *

ఆ పగలంతా పాఠశాల్లో అన్యమన స్కంగా గడిపాను.

సాయంత్రం బడినుండి ఇంటికి వస్తూనే—

"మన ప్రక్క వాటాలో వున్న రుక్మి ణమ్మ వెళ్ళిపోయిదండీ" అనింది సుభద్ర కాఫీ చేతికి అందిస్తూ.

"యే రుక్మిణమ్మ!" అలవోకగా ప్రశ్నించాను.



"రామ్మూర్తిగారి భార్యండీ. వచ్చి వారంరోజులు కూడా కాలేదు. ప్రొద్దున్నే బిడ్డను వెంటబెట్టుకొని పల్లెకు వెళ్ళిపోయింది."

"ఏదో పనివుండి వెళ్ళుంటారు విశేషమేముంది?"

"అది గాదండీ. చెప్పా చెయ్యకుండా చప్పున వెళ్ళిపోయింది. రుక్మిణమ్మ చాలా మంచిదండీ. ఈ నాల్గు రోజులూ నాకెంతో సాయపడింది. బాగా కలుపుగోలు మనిషి. జబ్బుతోవున్న మన చంటిదాన్ని యెంత బాగా చూచిందని. పొద్దున్నే బస్సుకు వెళ్ళిపోయిందట.

అలాంటి సౌజన్యంగల పొరుగింటావిడ వెంటనే వెళ్ళిపోయినందుకు సుభద్ర నొచ్చుకుంటూ చెప్పింది.

సుభద్ర చెప్పింది విన్నాను. కొంత తెలుసుకున్నాను.

కాఫీతాగి మౌనంగా బైటికి వచ్చాను.

రామమూర్తి ఆఫీసునుండీ వస్తూ ఎదురుపడ్డాడు. మనిషి చీకాగ్గా అగుపించాడు. నన్ను చూచి అన్నాడు_తనలో తాను వదురుకుంటున్నట్లు—

"ఈ ఆడవాళ్లు బలే చిత్రమయిన వాళ్లండీ. వాళ్ల మనస్తత్వాలు అర్థమయి చావవు. మచ్చుకు చూడండి. మా ఆవిడ

బుర్రలో ఉన్నట్లుంది యే పురుగు తొలిచిందో-నేను ఈ సత్రం కొంపలో ఒక్క క్షణముండలేను. పల్లెకు పోతున్నా. వేరే ఇల్లు దొరికినప్పుడు జాబు వ్రాయండి, వెంటనే వస్తాను. అని చెప్పి ప్రొద్దున లేస్తూనే బిడ్డను చంకబెట్టుకొని వెళ్ళిపోయింది. నిన్నటివరకూ కులాసాగా వుంది. ఈదినం ఇల్లు బాగాలేదని చక్కా వెళ్ళిపోయింది. ఈ ముదనష్టపు కొంపలో మరో యిల్లు నేను ఎక్కడ వెదికి చావను?" అంటూ వాపొయ్యాడు ఆయన నా ముందు.

విన్నాను. మౌనంగా తప్పుకొని వెళ్ళిపొయ్యాను.

* * *

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. వెళ్ళి వీథి అరుగుమీద ఒంటరిగా కూర్చున్నా. వెళ్ళిపోయిన రుక్మిణమ్మను గురించిన ఆలోచన నన్ను వికలచిత్తుణ్ణి చేసింది.

రుక్మిణమ్మ తటాలున-ప్రొద్దున మరొకరికి ముఖం చూపించలేక వెళ్ళిపోయింది. కారణం మనసుకు వచ్చి-తెలుసుకొని-మరీ క్రుంగిపొయ్యాను.

అయినా ఈ రహస్యం ఎవరికి చెప్పను? ఎట్లా చెప్పగలను? సుభద్రకు చెప్పలేను రామమూర్తికి చెప్పలేను. కడకు నేనుసైతం మనసుకు తెచ్చుకోలేను. అది ఆ తల్లిపట్ల అపచారమే అవుతుంది. అప్రియమైన సంఘటన అలా అసంకల్పితంగా జరిగిపోయింది.

ఈ దుర్ఘటనకు నేను కారణమే కావచ్చు. కానీ నేనుగా యెరిగి యే దోషమూ చేయలేదు. ఇంతకూ నేను చేసిన తప్పు?

నిన్న రాత్రి రామమూర్తి మామూలుగా పడుకొనేచోట బద్ధకించి నేను పడుకోవడమే. మరచి నిద్రపోవడమే.

రుక్మిణమ్మ ఇంటిపనులన్నీ ముగించి - పొద్దుపోయాక — అలసటతో వచ్చి మామూలుగా భర్త పక్కమీదికి వచ్చి మేను వాల్చి ఉంటుంది. ఆదమరచి నిద్రిపోయి వుంటుంది.

వేకువనే లేచినపుడు-నిజం తెలుసుకున్నపుడు - నిలువునా కూలిపోయి వుంటుంది.

మగనాలి మళ్ళీ మొగం చూపెట్టలేక ప్రొద్దున్నే ఇల్లు విడిచి వెళ్ళిపోయింది.

ఆమె ఇల్లాలు.

ఆవిధంగా మొగం దాచుకుంది.







# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

## అవసరాల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

**మ**రేంలేదండి...నైన్త్ చదువుతున్న వయొలాకి లాస్టియర్ ప్లూరసీవచ్చింది గుర్తుందా? అంటురోగమని పాపం ఆ అమ్మాయిని వేరే వార్డులో ఉంచి ట్రీట్ చేసి డిస్చార్జి చేశారు. దానికి రాత్రయే సరికి చచ్చేంత భయం. నాతో చాటుగా చెప్పుకు ఏడ్చింది వార్డెన్‌కి తెలీకుండా నేను ఆ వారం రోజులూ వెళ్ళి ఆ అమ్మాయికి తోడుగా పడుకునే దాన్ని. పరీక్షరోజులవడంచేత పుస్తకాలు అక్క-డికే తీసుకుపోయేదాన్ని అక్కడే చదువుకుందామని. వయొలాది అంతా అదో రకం. ఒక్కర్తీ ఉండే చీకటంటే భయం, పక్కనితోడు ఉండే దీపమంటే భయం! లైటుతీసేస్తేగాని దానికి నిద్ర పట్టేదికాదు. ఒక మనిషి పడేబాధకన్న పరీక్ష ఎక్కువా అని లైటు ఆర్పేసే దాన్ని. పరీక్షపోతే పోయిందిగాని మా బాగా నిద్రపట్టేనేది పెద్దమ్మగారూ!"

"మరి ఈ ఏడాది ఎందుకు పోయిందీ?"

"మీరు చెప్పినట్టు, పోవాలని రాసి పెట్టుంటే మనం ఎంత చదువుతే ఏం లాభం పెద్దమ్మగారూ! అప్పుడు నేను నిద్రపోతే పరీక్ష పడుకుంది, ఈ యేడాది నేను మేలుకుని ఉన్నా పరీక్ష పడుకుంది చూడండి! ఏం న్యాయమో!"

''అంత మేలుకుని ఉండవలసిన అవసరం ఏమొచ్చింది!''

"చెప్తా వినండి మన ఆర్ఫనేజ్

నైట్ వాచర్ భాస్కర్ విలియమ్సు లేడూ! వాడి అందానికి ఈ మధ్య పెళ్ళి కూడా చేసుకుని సర్వెంట్సు క్వార్టర్సులో కాపురం పెట్టేడని మీకు తెలుసుగదా! అతని భార్యకి కాపురానికి వచ్చిందగ్గ ర్నుంచీ ఒకటే ఆస్త్మా. రాత్రిపూట మరీ ఎక్కువై పోయేది. ఆ ఆయాసం భరించలేక అది ఒకటే గోల. దాని దుఃఖంచూసి సహించలేక అంత మనిషీ ఆ వాచ్‌మెన్‌గాడు ఒకటే ఏడుపు. నేనూ, నిర్మలా ఉన్న రూమ్ నెంబరు ఫార్టీఫోరు వాడి క్వార్టర్సుకి చాలా దగ్గిర. ఈ న్యూసెన్సు పరీక్షలముందు భరించలేక నిర్మల అప్‌స్టెయిర్స్‌లోని స్టడీ హాలులోకి పోయేది. అన్నీ చూస్తూ వింటూ ఊరుకోలేక నేను మాత్రం వాడి క్వార్టర్సులోకే వెళ్ళిపోయేదాన్ని. ఓరోజు రాత్రి తెల్లవార్లూ అక్కడ ఉండవలసి వచ్చింది.''

"వెళ్ళి మాత్రం నువ్వేం చెయ్య గలవు, నువ్వేం డాక్టరీ చదివేవా?''

"సాటి మనిషిని ఆపదలో ఆదుకో డానికి డాక్టరీ చదవాలాయేం పెద్దమ్మ గారూ? ఆరోజు పరీక్షకు చదువుతున్న పుస్తకం అక్కడ పారేసి గదితలుపు తాళంవేసి అక్కడికి వెళ్ళేను. తెల్లవారు ఝామున కమలానికి నిద్రపట్టేదాకా అక్కడే ఉన్నాను. నిజానికి నేను చేసిం దేమీ లేదు. అతనికి ధైర్యంచెప్పి, లాంతరు వెలిగించియిచ్చి టౌనుకి పంపేను. అప్పుడు మన డిస్పెన్సరీ డాక్టరమ్మ కలవులో ఉంది మరి. విలి యమ్స్ వచ్చేలోగా నిప్పుచేసి కమలం వీపు కాచేను. మర్నాడు నేను లేచేసరికి తొమ్మిదిన్నర దాటింది. ఆరోజు పదిం టికి పరీక్షని, లేచేకగాని నాకు గుర్తే రాలేదు. ఏం చెయ్యను చెప్పండి?"

మార్గరెట్ యాలిస్ దగ్గిరగావచ్చి ముద్దు పెట్టుకుంది.

"నువ్వెంత ఉన్నతురాలివి యాలిస్! నీ పరీక్ష పోవడమేమిటి, అర్థంలేని మాట! హృదయంలేని చదువులు ఎవర్ని ఉద్ధరించడానికని! కాని ఇంత మంచి మనస్సు ఉన్నదానివి ఈ వంచనామయ ప్రపంచంలో ఎలా నెగ్గుకు వస్తావో యేమో!...అది సరేగాని యీ ఏడా దైనా సరిగా చదువు. ఫస్టుమార్కు రావాలి సుమా! అయ్యో అప్పుడే ఆరు న్నర అయిపోయిందే...నాకు ప్రేయర్‌కి టైం అయిపోతోంది. నీతో మాట్లాడుతూ కూచోడం తప్ప నాకు పనీపాటూ లేదను కున్నావాయేం? అలా గుడ్లు మిటక రిస్తూ కూచుంటావేం? త్వరగాలేచి బయ టికి దయచెయ్యి."

ఇవతలికొచ్చి చూశాను. ఎవరూ లేరు. వంటామె కొడుకుని తీసుకుని డిస్పెన్సరీకి వెళ్ళినట్టుంది. ఏమీ తోచ లేదు నాకు. అందరితో కలిసి వెడితే ఎంత బాగుణ్ణనిపించింది.

ఏమీ తోచక అలా అలా గార్డెన్

దాటి వచ్చాను. మాటల్లోపడి నేను గమనించ లేదు, పచ్చని సాయంత్రపు నీరెండ తెల్లని వెన్నెల పూదండగా మారింది. సన్నని మధురమైన స్వరంలా ఆనందాన్నిస్తుంది. వికెట్ గేటు పక్క విరియబూచిన నైట్ క్వీన్ సున్నితమైన సువాసన అల్లంత దూరంనుంచే నన్ను ఆహ్వానించింది. పరవశం కలిగించే ఆ ప్రకృతి శోభలో మైమరచి అలా నడిచి నడిచి ఇంచుమించు కాంపౌండ్ వాల్ వరకు వెళ్ళిపోయాను.

"అప్పుడే బ్యాటరీలైటు వెలుగు నా మీద పడింది మదర్."

"ఏమిటీ, నీమీద బ్యాటరీలైటు వెలుగు పడిందా?" అని ఆత్రుతగా అడిగింది దయామయి.

"అవును. నా బతుకు బజార్లో పడ డానికి ప్రారంభోత్సవంకూడా అప్పుడే జరిగిందనుకుంటాను. వినండి."

యాలిస్ తన కథనం కొనసాగించింది.

## 5

"క్షమించండి. ఈ వెన్నెల్లో సరిగ్గా కనపడలేదు."

అంటూ ఒక పురుషకంఠం వినిపించింది. నామీదనుంచి ఆ లైటు అటు తిప్పడంలో ఈసారి అతని మొహం మీద ఆ కాంతి ఫోకస్ అయింది.

మా ఆర్ఫనేజ్ ఆవరణలో చక్కని చలవరాతి ఏసుక్రీస్తు విగ్రహముంది. దాని ముందు వరసల్లో నిలబడి రోజూ ప్రేయర్ చేయిస్తారు మా పిల్లలచేత. ఆ ప్రేయర్ లో రెండు నిబంధనలున్నాయి. ఒకటి ప్రార్థనలోని ప్రతి ముక్కా పైకి అనాలి. రెండు, కళ్ళు మూసుకోవాలి. ఈ రెండూ నాకు నచ్చవు. అంతటి అందమైన విగ్రహం ముందు నిలబడ్డం, కళ్ళు మూసుకోడానికి కాదు. మనకి నచ్చిన వ్యక్తిముందు మామూలుగా మాట్లాడ్డం చాలదు, మనసు బయటపెట్టుకోవాలి. అయినా ప్రభువు ముందు ఎవరి ప్రార్థన వారిదే. అందరూ కలిసి ఒకే ముక్క అనడమేమిటి? ఆ నుదురూ, ఆ ముక్కూ, ఆ కళ్ళూ, ఆ పెదిమలూ, ఆ గెడ్డమూ చూస్తే— అంత చక్కని మొహముండగా ఆ చలవరాతి విగ్రహం కాళ్ళమీద పడాలని మాత్రం నా కెప్పుడూ అనిపించేది కాదు. అది చాలా పెద్ద విగ్రహం కనుక, పైన నీడలా వ్యాపించిన ఎర్ర గుత్తుల తురాయి చెట్టు ఎక్కడం తప్ప మరో మార్గంలేదు. ఆ చెట్టు ఎక్కి ఆఖరి కొమ్మమీద కూచుని కిందికి వంగి ఆ అందమైన మొహాన్ని అందుబాటులోకి తెచ్చుకుని, ఎరిగీ ఎరగని వాళ్ల చూస్తూంటే నుదుటి మీదా, ఏ నిర్మలంలాంటి ఫ్రండో చూస్తూంటే బుగ్గమీదా, ఎవరూ చూడకపోతే ఆ పెదిమల మీదా ఒక్క ముద్దు పెట్టుకుని దిగిపోవాలని నాకోరిక. అదే ఆ ప్రభువుకి నేను ప్రతి

దినంచేసే ప్రార్థన. ఇతంతా ఎందుకు చెప్పేనంటే దయామయీ, ఆ బ్యాటరీ లైటువెలుగులో ఆతని మొహంచూడగానే నాకు ఆ విగ్రహం మొహమే గుర్తుకు వచ్చింది.

అతను మరోసారి అన్నాడు.

"ఎవరో నిలబడినట్టు ఆకుల చప్పుడై ఎవరా అని లైటువేశాను. క్షమించండి మీ రెవరు, ఆ కనిపిస్తున్న బిల్డింగు ఏమిటి?"

"మా వాచ్‌మెన్ విలియమ్సూ, మాకు వారం వారం మతబోధనలు చెయ్యడానికి వచ్చే ఫాదరీలూ వీళ్ళ గొంతుకలు ఇదివరకు నేను వినకపో లేదు. కాని ఇతని గొంతుకలో కొత్త దనం ఎందుకో నన్ను నిలువెల్లా వణి కించింది. గగుర్పాటు కలిగించింది. ఇంక అక్కడ ఉండలేక లోపలికి మళ్ళేను.

"చెప్పకపోతే మానెయ్యండి. వెళ్ళి పోవడం దేనికి? ఒక్క నిముషం ఆగండి. మీకు కూడా నా మీద కోప మేనా? ఇంతకీ ఒక్కొక్కరి పాపిష్టి జన్మ అటువంటిది. ఇంత డబ్బుంది. ఏం లాభం, ఒక్క సుఖం ఎరగను. ఇంత బలగముంది ఏం ప్రయోజనం, ఒక్క మంచి మాటకి నేను నోచుకో లేదు. ఆఖరికి ముక్కూ మొహంతెలియని మీకు కూడా నా మీద అకారణమైన ద్వేషం. ఎప్పుడేం చేసుకున్నానో, అనుభవించొద్దా మరి? మీరు వెళ్ళిపో నక్కర్లేదు, నేనే వెళ్ళిపోతాన్లెండి. సెలవు."

ఆ కంఠంలో వేదన నా కాళ్ళకు సంకెల అయింది.

"ఇంతకీ మీ రెవరు? ఈ సమయంలో ఇక్కడెందుకున్నారు?"

అని అడక్కుండా ఉండలేకపో యాను. నా కిష్టమైన మొహం. నన్ను కరిగించే స్వరం. ఎలా, ఎలా ఊరు కోను?

"నా పేరు మదన గోపాలస్వామి. అందరూ మదన్ అనిపిలుస్తారు. టౌనులో మెడిసిన్ ఫోర్త్ యియరు చదువుతున్నాను. ఏమీ తోచక ఇవాళ ఇలా కారు డ్రైవు చేసుకుంటూ బయలుదేరి సిటీ లిమిట్స్ దాటి వచ్చేశాను. వస్తూండగా కారు టైరు బరస్టు అయింది. ఈ భవనం ఏమిటి? మీరెవరని అడిగితే ఈ సారి పారి పోరుగా?"

"నా పేరు యాలిస్. ఈ కనపడే భవనం బాలికల ఆశ్రమేజీ. మెట్రిక్ దాకా ఫ్రీగా చదువు చెప్పిస్తారు కూడా ...అన్నట్టు బాగా జ్ఞాపకం చేశారు. పర్మిషన్ లేందే కొత్తవారిని కలుసుకో డానికీ, మాట్లాడానికీ మా శరణాలయం రూల్సు ఒప్పుకోవు. ఇప్పటికే తప్పు చేశాను. ఇక వస్తాను. మీరు కూడా తొందర తొందరగా వెళ్ళిపొండి. ఇలా

అంటున్నందుకు మరోలా అనుకోకండి. ఎవరేనా చూస్తె రిపోర్టు చెయ్యొచ్చు."

సగం ముక్కలు మింగేస్తూ ఎలా అన్నానో ఇన్నీ అనగలిగాను. ఈ పక్కచూపులూ, ఈ బెదురు మాటలూ, ఈ సిగ్గు దొంతరలూ జన్మలో ఎరగను నేను. ఏదో కొత్త అనుభవం నిలువెల్లా అల్లరిపెడుతోంది. కాని ఆ అల్లరి గిల్లి నట్టు బాధగాలేదు, గిలిగింతలు పెట్టినట్టు హాయిగా ఉంది. అతన్ని పొమ్మన్నానే గాని నాకే అక్కణ్ణుంచి కదలాలని లేదు!

అతను బాగా వంగి, వాలిపోయిన నా కళ్ళల్లోకి కళ్ళు పెట్టి దీనంగా చూస్తూ,

"అలాగే వెళ్ళిపోతాను లెండి. పాపం మీ రనవసరంగా కంగారు పడిపోకండి. నన్ను పిలిచి ఆదరించేవారు ఒకరున్నా రని యింకా యింకా ఆశించడం నా దెంత బుద్ధితక్కువ! ఎన్నిసార్లు గాయ పడినా యీ హృదయానికి సిగ్గూ లేదు, బుద్ధీలేదు!"

"ఎందుకలా బాధపడుతున్నట్టు మాటాడుతున్నారు? అంతగా మిమ్మల్ని నొప్పించిందేమిటో..."

"వద్దండీ వద్దు. ఎవరిహద్దులో వాళ్ళుండడమే, ఎవరి బాధలు వారితో అంతమవడమే అందరికీ శ్రేయస్కరం ...సెలవు మరి."

"మీకంతగా మీగురించి చెప్పడం ఇష్టంలేకపోతే అసలు ఎందుకు మొదలు పెట్టేరు? ఒక విషాదగీతిక నా దగ్గిర ఆలాపించి ఉన్నట్టుండి మొదట్లోనే ఆపేసి వెళ్ళిపోవడం ఏం న్యాయం?"

"ఒక ఆశాలతిక నాలో చిగురింప చేసి మధ్యలో తుంచెయ్యడం మీకు మాత్రం ఏం న్యాయం?"

"సరే చెప్పండి. ఆర్పనేజి రూల్సు ఇదివరకే కొంచెం అతిక్రమించాను."

"మరికొంచెం అతిక్రమించమని నా కోరిక."

"అదేమిటండోయ్?"

"మరేం లేదు. మెయిన్‌గేటు దాటి ఇవతలికి రండి."

"క్షమించండి. చెప్పేదేమిటో ఇక్కడే చెప్పండి."

"క్షమించండి. ఇక్కడ చెప్పడం నావల్ల కాదండి."

"మీ పెంకితనంగాని ఇక్కడికి బయటకి తేడా ఏ ముందండీ?"

"సముద్రపు ఒడ్డునే కూచుని తళగల నురుగుల మెరుగులు చూసి మురిసిపోయే వాళ్ళకి సాగర మధ్యంలో రకరకాల లోతుల రంగురంగులు ఎలా తెలు స్తాయి? మనసు అనేది ఒక బిందువుతో ఆగిపోయే సరళరేఖ కాదు, ఆకాశమంతా ఆక్రమించినా తృప్తిపడని అనంత వలయమది!"

"మీరు చాలా బాగా మాట్లాడతారే!"

"నిజమే! నా నాలికకి నా కంటి

ముందు వెలుగుచూసి ఇవాళ పిచ్చెత్తి పోయింది. అది గమనించి నా సొంత చెవే మూర్ఛపోతోంది. అందమైన ఆడ వాళ్లున్న కంపార్టుమెంటుని చూస్తే ఇనప ఇంజను కయినా వెనుదిరిగి ఈల వెయ్యా బుద్ధిపుడుతుంది. అందులో ఆశ్చర్యమే ముంది!"

కిలకిల నవ్వకుండా ఉండలేక పోయాను నేను.

"ఏమిటో, చుట్టూ ఈ ఇనపముళ్లూ అవీ, అదోలా ఉంది నాకు—పైకి రారా మీరు?"

"ఈ ఆకుపచ్చని లాన్సూ, ఈ కత్తిరించిన క్రోటన్సూ, ఏం, ఈ లోపల ఏం లోపం వచ్చిందనీ?"

"చెప్పేనుగా, ఆవరణనే అంటి పెట్టుకు ఉన్నవారికి బయటి అంద చందాలు తెలియవని! మనుషులు వేసిన పూలతోటకే మీరిలా పొంగిపోతున్నారు, భగవంతుడు ఏర్పరచిన కళాసీమచూస్తే మరెంత ఉప్పొంగిపోతారో మీరు?"

"అదెక్కడుందండీ, నాకు తెలీదే!"

"బయటకు రండి, చూపిస్తాను మరి ... తెల్లని సిమెంటు రోడ్డుమీద, అటూ ఇటూ తెగబలిసి చేతులు కలుపు కుంటున్న చింతచెట్ల సందులనుంచి చూసే చందమామ, ఎన్నెని రకరకాల అల్లికలూ రంగవల్లికలూ నీడల రూపాన సృష్టిస్తాడో మీరెప్పుడేనా గమనించారా? ఇలాంటి వెన్నో చూపిస్తాను, నా కూడా రాకూడదూ? ఇదేం బుచ్చెమ్మ గిరీశంతో 'లేచి పోయిరావడం' కాదు గద!"

"వాళ్లెవరండోయ్...?"

"అవి ఒక ప్రసిద్ధ నాటకంలో పాత్రలు... దేన్ని గురించి మాట్లాడదా మన్నా మీకేం తెలియదు గదా ఖర్మ! ఈ నాలుగోడలమధ్యదే ప్రపంచం అను కుంటున్నారు. ఇవతల పడమంటే రారు. ఎంతకని దావను! మిమ్మల్ని వదల్లేను, నాకై నేను కదల్లేను!"

"నేను రాను. వాచ్‌మెన్ చూస్తే కొంప మునుగుతుంది."

"ఇందాకట్నుంచీ చూస్తున్నాను. ఎవరూ నాకు గేటుదగ్గర కనపడలేదు. ఏ బీడీ కాల్చుకోడానికి పోయాడో! ఇంతకీ మీ తక్కిన స్టూడెంట్సెవరూ కనపడరేం?"

"మేట్రన్‌తో సహా అందరూ ఫస్ట్‌షో సినిమాకు పోయారండీ."

"ఇంకో రెండు గంటలకి గాని రారన్నమాట. మనమోసారి అలా తిరి గొస్తే ఏం కొంప మునిగిందీ?...ఇంతకీ నిజం చెప్పాలంటే..."

"నిజం చెప్పాలంటే?"

"నాతో బయటికి రావడం ఇష్టమే నని మీ మొహమే చెబుతోంది."

"మదన్" మీరు హద్దుమీరు తున్నారు."

"ఒక్కరూ అయితే ఏం లాభం?

ఇద్దరూ కలిసి సరిహద్దుసహా మీరదాం సహకరించండి "

"ఏం మనుషులండీ, అంతట్లో ఏడి పిస్తారు, అంతట్లో నవ్విస్తారు!"

"నా ఏడుపు తుడవగలరనే, నన్నె ప్పుడూ మీరు నవ్వించగలరనే నా నమ్మకం. రండి. ఒకసారిఇవతలికొచ్చి, అలా నన్ను కారుదాకా సాగనంపి వచ్చే ద్దురుగాని..."

"పదండి, తప్పుతుందా మరి?"

మంత్ర ముగ్ధలా మెయిన్‌గేటు దాటి అతన్ని అనుసరించాను కొంత దూరం నడిచేక అన్నాను :

"ఇంత దూరం నడిచి వచ్చేశాము, మీ గురించి చెప్పనేలేదు!"

''ఈ వెన్నెల కాంతులలో ఈ చల్లని నీడలలో మీ పక్కనడుస్తూ ఉంటే నా కేం బాధలున్నాయో గుర్తుకే రావడం లేదు!"

"గుర్తుకు రాకపోవడమే మంచిది.''

''అది ఒక్క పరిస్థితిలోనే సాధ్యం."

"ఎలాంటి పరిస్థితిలో ?"

"చెప్పేనుగా మీలాంటి వాళ్ళు నా జీవితమంతా ఇలా పక్కపక్కన నడచే అదృష్టం ఉంటే !''

"ఆ మాటకి తృళ్ళిపడ్డాను నేను.

"దుఃఖితుడైన ఒక సాటి వ్యక్తి కన్నీరు తుడిచేకన్న ఆడదాని జన్మకు సార్థకం ఏముంది!" అని పించింది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?''

"ఆహఁ ఏంలేదు... ఇదిగో మీ కారు దగ్గిరికి వచ్చేశాం. వెన్నెలలో ఏం చక్కగా మెరుస్తోందీ... ఇంక నేను వెళ్లొస్తానండీ... ఇప్పటికే నాకెంతో కొత్తగా బెంగగా ఉంది."

వెళ్లడానికి వీల్లేదని అతను చెయ్యి అడ్డుపెడితే, లేదా నా చెయ్యి పట్టుకుంటే ! ఈ కొత్త ఆలోచనకి చిరు చెమటలు కమ్మేయి నాకు..

"నా కన్నీటి గాథ వింటానని ఆశ కల్పించారు. అదేదో వినకుండానే వెళ్ళిపోయే కాఠిన్యం ఉంటే వెళ్ళిపోండి. నాకేం అభ్యంతరంలేదు."

"మీరు ఎంతసేపైనా చెప్పండే నేనేం చెయ్యను ? మరోసారి కలుసుకుందాం. ఇప్పటికే బాగా రాత్రయిపోయింది."

"కొత్తగా కారు కొన్నాను. ఎలా ఉందో ఒకమారు చూసి వెళ్ళకూడదా ? ఈ దీనుడి ఈ చిన్న కోర్కె తీర్చ కూడదా ?"

"పైనుంచి చూస్తే తెలుస్తోందిగా !"

"పైనుంచి చూస్తే తెలియనివి లోకంలో చాలా ఉంటాయి. మాట వరసకు దీని టైరు బరస్ట్ అయిందనీ, కొత్తది ఒకటి అరగంటక్రితం రిప్లేస్ చెయ్యబడిందనీ పైనుంచి తెలియదుగా!"

"లోపలికొచ్చి కూచుంటే మాత్రం నాకేం తెలుస్తుంది...కారు మెకానిజమ్ నాకేమీ తెలిదే !"

"కారు మెకానిజమ్ తెలీనంత

మాత్రాన వచ్చిన పెద్ద నష్టం ఏం లేదు. మనిషి అంతర్యం పోల్చుకో గలిగి, రవ్వంత సానుభూతి చూపిస్తేచాలదా !''

"ఏమిటో మీరూ మీ మాటలూ ! నేని వాళ ఎక్కడ్నుంచి ఎక్కడికి వచ్చానో మీరింకా నన్నెక్కడికి తీసికెళ్ళ దల్చు కున్నారో నాకేం బోధపడడం లేదు మదన్?"

అతను నా దగ్గరగా వచ్చి కళ్ళలోకి చూస్తూ అన్నాడు:

"యాలిస్ ! ఒక మంచి మాటకి ఒక చల్లని చూపుకి నోచుకోని దుఃఖ జీవిని నేను. చెప్తే హాస్యం చేస్తావు గాని ఈ కారు ఒక్కటే నాకు ఇంత వరకు స్నేహితుడన్నది. బుర్ర బొత్తిగా పాడై పోయినప్పుడు కిళ్ళీ మీద కిళ్ళీ నవుల్తూ దీన్ని డ్రైవు చేసుకుంటూ ఎంత దూర మేనా తిరిగి రావడమే నాకు మిగిలిన ఒకే ఒక సుఖం. యాలిస్, నా స్నేహితుణ్ణి చిన్నబుచ్చుతావా? ఒకసారి వాడి వీపు మీద ఎక్కి కూచుని ప్రేమతో నిమిరి దిగి పోకూడదూ?"

"తీరా ఎక్కగానే మీ స్నేహితుడు ఉన్నట్లుండి బేతాలుడిలాగ గాలిలోకి లేచి పోతే?"

మదన్ పకపక నవ్వేడు. ఇంత వరకు ముడిచిపెట్టుకున్న ముఖంలో వెయ్యి మల్లెపువ్వులు విరిసినట్టయింది. అలా ఆ వెన్నెల్లో నవ్వేతున్న ఆ మొహం చూస్తూ అక్కడే ఉండిపోవా లనిపించింది.

"ఏమిటి, కారు ఎక్కుతావా, మరి?"

"ఒక్కమారు ఎక్కికూచుని దిగి పోతాను. మీరు నడిపించనని మాట ఇవ్వాలి!"

"అలాగే..."

మదన్ తలుపు తెరిచి నన్ను లోపలికి ఆహ్వానించాడు. అతను డ్రైవరు సీట్లో కూచున్నాడు. నేను వెనక సీట్లో ఎక్కి కూచున్నాను. ఊళ్ళో ఏ ఎగ్జిబిషన్ లాంటిది జరిగినా తీసికెళ్ళి చూపించ డానికి మా ఆర్ఫనేజికి ప్రత్యేకించి ఒక వెహికల్ లేకపోలేదు. దాని సీట్లు నిజంగా పోల్చి చెప్పాలంటే ఇంతకన్న మెత్తన. కాని ఆ క్షణంలో ఆ వెనక సీటులో నాకు కలిగిన స్పర్శ సుఖం నేను వర్ణించలేనిది. అయినా అది పూర్తిగా శరీరానికి సంబం ధించిందే అనుకోను. ఆ స్ప్రింగు సీటు మీద పదే పదే కాళ్ళతో తన్ని ఇంతె త్తున ఎగిరెగిరి పడ్డాను. తలకింద చేతులు పెట్టుకుని వెల్లకిలా పడుకుని కాళ్ళు వెర్రెత్తినట్టు కిందకీ మీదకీ ఆడిం చాను. ఒకపక్కకి తిరిగి పడుకుంటే ఎలా ఉంటుందో చూసుకున్నాను... నిజంగా ఇవన్నీ చేశానా నేను?—లేదు, కాలుమీద కాలు వేసుకుని ఒక చివరికి అంటీ ముంటనట్టు కూచున్న నేను ఇలా ఇలా ఇంకా ఎన్నో రకాలుగా చేస్తే బాగుణ్ణని ఊహించాను. అంతే క్రమ

శిక్షణ అనేది శరీరానికి మాత్రమే, మన సుని అదిమిపట్టడానికి మర ఉందా, మంత్రముందా!

నా ఊహాలోకంలో నేను విహరిస్తూ ఉండడం చేత ఎంతో స్పీడులో కారు ముందుకి సాగిపోతున్నట్లు గుర్తించ డానికి కొంతటైమ్ పట్టింది."

"అయ్యో, అయ్యో, దుర్మార్గుడు ఎక్కడికి తీసుకుపోయాడేం, ఏం చేశా డేం!" అంది దయామయి ఆతృతగా.

"ఆ పరిస్థితుల్లో నాలోని దుర్మార్గం కూడా అదేం తక్కువది కాదమ్మా మదర్! 'ఏమిటిది? మరీ ఇంత మోసమా, నన్నెక్కడికి తీసుకు పోతు న్నారు మదన్, ఆపుతారా గెంతెయ్య మన్నారా?' అని నా నోరు అయితే బయట పడిపోయింది గాని నిజంగా అతనే నన్ను కారాపి దిగిపొమ్మంటే 'మీ కాళ్ళు పట్టుకుంటాను. నన్నిలా మధ్యలో వదిలెయ్యకండి' అని మారాం చెయ్య డానికి సిద్ధంగా ఉంది నా వయసు."

దయామయి ఆమెవైపు ప్రేమగా చూసింది.

''ఇంత చిన్న వయసులోనే-జరిగిన విషయాన్ని నీ కోణంనుంచి కాక ఒక ప్రేక్షకురాలిగా చూసి చెప్పడం ఎలా నేర్చుకున్నావమ్మా! ఇంతగా ఏ ఒక్క విషయమూ అరమరిక లేకుండా చెప్తు తున్నావే, నేను నీ కేమౌతానని."

"అమ్మముందు బెంకెందుకు? అద్దం ముందు నిలుచున్నాక మొహానికి మళ్ళీ ముసుగెందుకు! ఇలాంటివి చెప్పలేనేమో అనేఇన్నాళ్ళూవెనుదీశాను. జరిగిందంతా పూర్తి వివరాలతో నేను బయటపెట్టడం అంటూ జరిగితే అది మీ ముందు మాత్రమే. అందుకే కృపానంద్ గారిం టికి నేను రాలేనన్నాను. మీకే చెప్పాలని నిశ్చయించాను, చెప్తున్నాను. విన్నాక మీ రెవరితో చెప్పి ఏం చేసినా అది నా మంచి కోరే అని నాకు తెలుసు. ఇంత జరిగేక నేనీ విషయం మాత్రం దాచడం ఎందుకు?...ఆ రాత్రివేళ అలా కారు ము న్ముం దు కి సాగిపోతూండగా అన్నాను:

''కారు నడపనని మాటఇచ్చి, ఏమిటీ జబర్దస్తీ మదన్?"

"ఇందులో నేను మాట తప్పడం ఏముంది యాలిస్!''

"కారు నడపనని మాట ఇవ్వలేదా?"

''ఇచ్చినమాట నిలబెట్టుకోలేదా!''

"అదెలా!"

"కారుని నడిపించనని మాట ఇచ్చాను గాని, పరిగెత్తించనని మాట ఇవ్వలేదే! పోనీ మా ఫ్రెండ్, వీణ్ణడుగుదాం ఉండు. ఏంరా, కారుగారూ! ఏమంటావ్?"

మదన్ హారన్ నొక్కించి 'పాం' అనిపించి,

"చూశావా, నేను చెప్పింది ఔనని ఎలా చెబుతున్నాడో!" అన్నాడు. అతని చమత్కారానికి నాకు నవ్వాగలేదు.

"ఐలే ఫ్రండు దొరికేడే మీకు!"

"ఏమనుకున్నావేం, మనమంటే?" అన్నట్టు కాలరెగరేశాడు అతను.

"మదన్, ఈ వెన్నెల షికారులు ఇంక ఆపెయ్యండి. ఇది ఏమాత్రం పసిగట్టినా మా మేట్రన్ చంపేస్తుంది. సినిమా వదిలే వేళవుతోంది. నన్నింక మా ఆర్ఫనేజ్ దగ్గిర డ్రాప్ చెయ్యండి. కారు వెనక్కి తిప్పండి. మరోసారి కలుసుకుందాముగా, ప్లీజ్."

"చాలా ఇళ్లల్లో నౌఖర్లే యజమానికి సలహా ఇస్తారు. నామంచి కోరిన ఏకైక మిత్రరత్నం యీ కుర్రకారు మనల్నిలా రయ్యిమని తీసుకుపోతూంటే ఆపడం, అడ్డురావడం ఎవరితరం? ఇలా ఉంది గాని యీ కారుకి ఎంత సమయస్ఫూర్తి లేకపోతే సరిగ్గా మీ మెయిన్‌గేటుకి వంద గజాలలోనే మాబైరు ఆత్మహత్య చేసుకుంటుంది!"

చల్లగాలికన్న, కారుజోరు కన్న, మంచి మాటల్లోనే నన్ను ఎక్కువగా తేలిస్తూ, సముద్రపు ఒడుకు తీసుకొచ్చి అక్కడ కారు ఆపేడు మదన్.

"అదేం, మీ ఫ్రండు గుండె ఆగి పోయిందేం?"

"మనం యీ వెన్నెలరాత్రిలో ఒక్కసారి విహరించి రావాలని వాడి ఉద్దేశం అయి ఉండవచ్చు. దిగు, యాలిస్, దిగు... ఆ పాలసముద్రంలో ఒకసారి పాదాలు తడుపుకుని వద్దాంరా."

ఏమిటో కారులోంచి దిగాలంటే భయమనిపించింది.

"దిగి బయటికి రావేం యాలిస్."

"క్షమించండి. ఇప్పటికి నేను దాటిన కట్టుబాట్లు చాలు. ఏమైనా సరే, నేను దిగను."

"నువ్వంతగా పట్టుబడితే నా కట్టుబాట్లు కూడా నేను సడలించుకో వలసి వస్తుంది యాలిస్"

"అంటే?"

చుట్టుపక్కల ఏ ఒక్కరూ లేక పోయినా, నీ మీద అత్యాచారం చేస్తే ఏ శక్తి నన్ను అడ్డుకొనే స్థితిలో లేక పోయినా ఇంతసేపూ నేను చూపిన నిగ్రహాన్ని నువ్వింకా గుర్తించక పోవడం దురదృష్టం. నువ్వు దిగకపోతే నేను బలవంతంగా దింపవలసి వస్తుంది".

"ఎందుకంత పట్టుదల మదన్?"

"పట్టుదల కాదు. పవిత్ర సాగర తీరంలో చల్లని ఏకాంతంలో ఆప్తు లెవరైనా ఒకరితో చెప్పుకుని గుండె బరువు కొంచెం తగ్గించుకుందామనే పగటికల యాలిస్...ఆ మాత్రం సాయం చెయ్యలేవా?" ఆ చిన్న కోరికను ఎలా కాదనటమో నాకు బోధపడలేదు. నేనే కారు దిగేను గాని దిగమని అతను చెయ్యి అందివ్వలేదు. దూరంగానే కూచున్నాడు గాని ఎటువంటి దురూహకి సందివ్వ లేదు. ఒక నిమిషం అయాక అతను మొదలు పెట్టేడు.

"యాలిన్, నీ సౌందర్య కేంద్రం ఎక్కడో నీకు తెలుసా ?"

"ఛ, ఏంమాటలు అవి ?" అన్నానే గాని అది అతని నోట వినాలని నేనెంతగా కోరేననని ! "నీకు తెలియకపోతే నేను చెబ్తాను, విను. పొగమంచులో తడిసిన పూలరేకుల్లాగ నీ కళ్లెప్పుడూ తళతళ మెరుస్తూ ఉంటాయి. అందులో ఎప్పటికీ తరగని ఆర్ద్రత ఉంది. ఎప్పటికీ ఎండిపోని అనురాగపు సెలయేళ్లు ఉన్నాయి. నువ్వు నిండుమనసుతో కల్పించగల ప్రేమ అనే గొడుగుక్రింద ప్రపంచంలోని దుఃఖితులందరూ కూచున్నా ఇంకా ఖాళీ మిగిలిపోతుంది. శోకమయ జగత్తుకంతటికీ శరణు ఇచ్చే మహత్తు నీ కళ్ళకు ఉంది. నువ్వు ఒక శరణాలయంలో ఉండడమేమిటి, నాన్సెన్స్ !"

"సాధారణ మానవమాత్రురాల్ని మీకేందేళానని నన్నిలా పొగుడుతారు!"

''పొగడ్డం కాదు. నిన్ను చూడగానే అనిపించింది, నా దుఃఖం పంచుకునే వ్యక్తి ఇన్నాళ్ళకు కనిపించిందని. అందుకనే నిన్నిక్కడికి తీసుకొచ్చాను. ఇది స్వార్థంకావొచ్చు, మోసంమాత్రం కాదు. నా కథ వింటావా యాలిన్ ?"

ఆ రాత్రి మదన్ తనతో చెప్పిన కథ దయామయికి చెప్పింది యాలిన్. ఆ కథ తను విన్నది విన్నట్టుగానే చెప్పడానికి ప్రయత్నించిందామె. "మా అమ్మా నాన్నలది ప్రేమవివాహమే కాకుండా ఆదర్శ దాంపత్యం అని చెప్పుకుంటారు ఇప్పటికీ. అమ్మని పెళ్ళాడాక నాన్నకి అన్నివిధాలా ఆస్తీ అదృష్టమూ కలిసి వచ్చాయట. సామాన్య గృహిణిగా కాక ఆరాధ్యదేవతగా చూసుకునే వారుట నాన్న అమ్మని.''

"ఎంత అదృష్టవంతురాలు మీ అమ్మగారు !"

"అలాంటి అమ్మ అభిమానాన్ని పంచుకోని నేనెంత దౌర్భాగ్యుణ్ణి !"

"అదేం ?"

"అమ్మా నేనూ అనేవాళ్ళం ఒకే సారి ఈ భూమ్మీద ఉండడం ఆ దేవుడికి ఇష్టంలేకపోయింది గనక."

"అంటే !"

"నన్ను కన్నప్పుడు అమ్మకి అప్పటి తప్పుడు దాలా జబ్బుచేసి ప్రాణాలు విడిచిందిట."

"పాపం తల్లిప్రేమ ఎలా ఉంటుందో మీరు ఎరగరన్నమాట."

"ఎరగను, తండ్రిద్వేషంమాత్రం బాగా ఎరుగుదును."

"తండ్రి ద్వేషమా !"

"అవును. మితిమించిన అభిమానం మనుషుల్ని పిచ్చివాళ్ళను ఎలా చేస్తుందో తెలుసుకోడానికి మా నాన్న జీవితమే తార్కాణం. అమ్మ చావుకి నేనే కారణం అని నాన్న నమ్మకం. మా చిన్నాన్న నన్నక్కణ్ణుంచి తీసికెళ్ళిపోయి వేరే

పెంచి పెద్దచేశాడు గాని - ఆ పిచ్చి కోపంలో పసివాడిగా ఉన్నప్పుడే నన్ను పీకపిసికి చంపేసునేమో! బతికున్నన్నాళ్ళూ నన్నొక పరమ శత్రువుగా భావించిన నాన్న చనిపోయేముందు తన ప్రతినిధి నొకదాన్ని ఇక్కడ ఉంచి మరీ వెళ్ళేడు."

"అదెవరు?"

"మా సవతి తల్లి."

"ఎంత ఆశ్చర్యం! మీ అమ్మగార్ని అంత ప్రాణప్రదంగా ప్రేమించిన మీ నాన్నగారు మళ్ళీ పెళ్ళిచేసుకున్నారా?"

"ఆయన చేసుకోలేదు. ఏళ్ళతరబడి శతపోరి బలవంతంచేసి బంధువులు ఈ పుణ్యం కట్టుకున్నారు. నేనెక్కడ హాయిగా గాలి పీల్చుకుంటానో అని మా యింట్లో ఒక పిశాచిని ప్రతిష్టించారు. అది చాలక దాని బలగం ఎంతంటావు మా ఇంట్లో?"

"అదేమిటి?"

"మరెందుకు నా మనసు ఇంతగా దెబ్బతిందంటావు! అంత ఆస్తి నాది. ఆ ఇల్లు నాది. కాని నా మాట కక్కడ పీసమెత్తు విలువలేదు. నా మాట వినేవారు అంత సైన్యంలో ఒక్కరంటే ఒక్కరు లేరు!"

"సైన్యమా!"

"అవును. ఇంట్లో అంతమంది చేరి నా మీద యుద్ధానికి సిద్ధపడుతూ ఉంటే దాన్ని ఏమనమన్నావు? పిన్నీ, ఆమె తల్లి తండ్రీ, ఆమె ఇద్దరు అన్నలూ వాళ్ళ కుటుంబాలూ అది నరకంగాని ఇల్లుకాదు యాలిస్. ఊళ్ళో అంత పెద్ద భవనం ఉండి వేరే హాస్టలులో ఉంటున్న నా ప్రారబ్ధం ఏమని చెప్పమన్నావు?"

"ఏ తప్పూ చెయ్యకుండా మీరింత శిక్ష ఎందుకనుభవిస్తున్నారు మదన్?"

"ఆ ప్రశ్నే నేనూ వేసుకుంటూ ఉంటాను, జవాబు రాదు. సబబైన ప్రశ్నకి ఈ పాడు ప్రపంచంలో జవాబే లేదు యాలిస్!"

"అలా అనుకోకండి మదన్. ఇవన్నీ మన మంచికోసం వచ్చిన పరీక్షలు. అంతలా క్రుంగిపోతే ఎలా?"

"వేలకి వేలు ఆస్తి ఉన్నప్పటికీ ఆదరణ అనేది లేక నేనెంత క్రుంగిపోతున్నానో తెలిస్తే నువ్విలా అని ఉండవు. ఇవన్నీ చాలక నాకిప్పుడు ఒక కొత్త ఆపద వచ్చిపడింది."

"అయ్యయ్యో! ఏమిటది?"

"మా పిన్ని తన పెద్దకూతుళ్ళలో - చిన్నన్నకి కూతుళ్ళు లేకపోడం నా అదృష్టం-ఎవర్నైనా ఒకర్ని చేసుకోమని చెవిలో ఇల్లుకట్టుకుని పోరేస్తోంది. నా మీద అభిమానమో - మా అమ్మద్వారా నాకు సంక్రమించిన ఆస్తిమీద ప్రేమో నాకు తెలియకనా! వాళ్ళ మొహాలు చూస్తేనే నా కసహ్యం. కాని ఏం చెయ్యను! సంబంధం కాదనలేనుగదా!




లోకంకోసమైనా అప్పుడప్పుడు ఆ గడప తొక్కాలి కదా ! తలుచుకుంటేనే భయం...కన్న తండ్రికే శత్రువునై, సొంత ఇంటికే పరాయివాడనై... ఎక్కడ తింటున్నానో ఎక్కడ పడుకుంటున్నానో...ఎందుకు బతుకుతున్నానో తెలియనంత హైన్యం అయిపోయింది నా జీవితం ... ఇంకా ఇది ఎన్నాళ్ళు ఈడవాలో తెలీదు. అమ్మా, నన్నెందుకు కన్నావమ్మా !''

సాటిప్రాణి వలవల దుఃఖిస్తూ ఉంటే నేను ఊరుకోలేకపోయాను మదర్. కన్నీళ్ళు తుడిచి ధైర్యం చెప్పేను. ఒళ్లో పడుకోబెట్టుకుని ఓదార్చాను. అంతే కాదు, నా సర్వస్వం అర్పించేందుకు కూడా సందేహించలేదు !"

"ఎంత తొందరపడ్డావమ్మా ! ఎంత పొరపాటుచేశావు యాలిన్ !"

"ఏమో, ఆరోజుమాత్రం నాకలా అనిపించలేదు మదర్ ! నిరాశ్రయుడికింత నీడపట్టు కల్పించినట్టు, అన్నార్తుడికింత అన్నం పెట్టినట్టు,. ఏమీలేనివాడికి ఏదో ఇచ్చినట్టు – ఇలాంటి అదోకరకమైన అనిర్వచనీయమైన తృప్తికలిగింది నాకు. అందుకే ఆ మర్నాడు తెల్లవారుఝామున ఏదో తప్పుచేసినట్టు అడుగులో అడుగువేసుకుంటూ ఆర్ఫనేజ్ ఆవరణలోకి చేరేదు నేను. నా మనస్సు ఏ మాత్రమూ బాధపడలేదు. నా కళ్ళూ నా బుగ్గలూ మరింతగా మెరిశాయి. నా కోసం ఎదురుచూస్తున్నట్టు పెద్ద దొరసానమ్మగారు అక్కడే నిలబడి అదోవిధంగా కోపంగాచూస్తూ నన్ను వెంటనే తన గదిలోకి రమ్మని సంజ్ఞ చేశారు. కూడా వెళ్ళేను నేను. లోపలికి రాగానే ఎప్పుడూ లేంది తలుపు వేసేసింది. అంతేకాదు, పట్టరానికోపంతో ఆ దవడా ఈ దవడా వాయించేసింది నన్ను ! అక్కడితో ఊరుకుందా పోనీ–

"ఇంత సిగ్గులేనిదానివి, చావగొట్టినా ఒక్క కన్నీటిచుక్క కార్చని మొండిదానివి – నువ్వంటే అభిమానం చంపు

కోలేని నేనెంత సిగ్గులేనిదాన్నో! అయ్యో, అయ్యో, సాయంకాలందాకా నాతో కబుర్లుచెబుతూనే ఉన్నదానివి అటెప్పుడు పైకి దాటేశావ్? అనాథ శరణాలయమంటే తల్లీ తండ్రీ లేని పిల్లలకుగాని, వాళ్ళు పెద్దై మళ్ళీ పిల్లల్ని కనేదాకా కాదుగా! ఇదంతా ఈ ఆర్ఫనేజ్ స్థాపించిన ఆ మేడమ్ ఎమిలీచేసిన నిర్వాకం. ఏ పదేళ్ళదాకా అనో ఏజ్ లిమిట్ పెట్టిఉంటే మాకీ ఆడపిల్లలతో ఇన్ని చిక్కులు ఉండేవి కాదుగా! మెట్రిక్ అయేదాకా అనే అర్థంలేని నిబంధన ఒకటి అఘోరించింది ... ఇంతకీ నా వెర్రిగాని అందరూ ఇలాగే వీధిని పడిపోతున్నారా? మాట్లాడవేమే? నిన్ను కొట్టి కొట్టి చేతులూ నీతో వాగి వాగి దవడలూ పీకుతే ఈ ముసిల్ది సొమ్మసిల్లి చస్తేశనివిరగడైపోతుందని ఎదురుచూస్తున్నావా? వాచ్‌మెన్ భోజనానికి వెళ్ళి వస్తూ చూశాట్ట, నువ్వెవరో అబ్బాయితో నడుస్తూ కారెక్కి వెళ్ళిపోయావుట. విలియమ్స్ కేకలు అందకుండానే మీ కారు కదిలిపోయిందిట. ఇదంతా నిజమేనా, ఇంకా ఏం జరిగిందో చెప్తావా, నిలువునా చీరెయ్యమన్నావా?'' దాచడానికి నేనేమైనా తప్పుచేశానని అనుకుంటే గదా! అంతటి ప్రేమమయి ముందు ఎవరైనా ఏమైనా దాచగలరు గనుకనా!

"ఆ విధంగా మదన్‌కి అర్పితమైపోయాను పెద్దమ్మగారూ! అతను బాగా ఆస్తిపరుడు. మెడిసిన్ చదువుతున్నాడు. ఒకటి రెండు నెలల్లో నన్ను మేరేజ్ చేసుకుంటానని మాట ఇచ్చాడు. ఇప్పుడు చెప్పండి, నేను చేసింది తప్పంటారా?"

"అయ్యో, ఇన్ని కబుర్లు చెబుతున్నావు, ఇంత చిన్న విషయం నీకు తెలీకుండా ఎలాపోయింది యాలిస్! పైగా తప్పా అని అడుగుతున్నావా. పెళ్ళికాకుండా పరాయి మొగాడి వెంట పడడం తప్పా తప్పన్నరా! జరిగిందేదో జరిగింది. ఎవరితోనూ ఈ మాట చెప్పకు. ఎవర్తోనూ చూసింది చెప్పొద్దని వాచర్‌తో ఇదివరకే నేను చెప్పి ఉంచాను. నలుగురికి తెలిసిందంటే అనవసరంగా అల్లరై పోతుంది. మీ మేట్రన్ అసలే అనుమానం మనిషి. అందుకే ఎవరి కంటపడుతుందో నువ్వు రావడం అని ఇంత తెల్లారగట్టే ఆ గేటు దగ్గిర కనిపెట్టుకు కూచున్నాను."

"నేనంటే మీకెంత ప్రేమ పెద్దమ్మగారూ!''

"అందుకేగా ఒళ్ళు హూనంచేశాను! రెండు నొవాల్జిన్ మాత్రలు వేసుకుని పడుకో ఒళ్ళు పులిసిపోగలదు – ఈసారి ఆ మదన్‌వస్తే నాతో రహస్యంగా మాట్లాడే ఏర్పాటు చెయ్యి. మరచిపోకు. నాకూ నిద్రవస్తోంది. ఈపాటికి దయ చెయ్యి" అంది మార్గరెట్. (సశేషం)

---




సంధ్య సముద్రపుఒడ్డున చీరకుచ్చెళ్ళు తడవకుండా, ఎత్తిపట్టుకుని నడుస్తోంది.

సూర్యుడు సగం అస్తమించాడు.

ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ ఆనందంతో పరవసించింది సంధ్య. తను యిటువంటి ఆహ్లాదకరమైన వాతావరణం కోసమేకదూ హైదరాబాద్‌నుండి యింత దూరం వచ్చింది. నిజంగా ఈ ప్రదేశం ఎంతో బావుంది.

కానీ ఆ ఆనందం ఆమెలో ఆట్టేసేపు ఉండలేదు. పెద్ద కెరటంవచ్చి ఆమెను పూర్తిగా తడిపేయడంతో కంగారులాటిది కలిగి, పరిగెత్తి, నీటిలో పడిపోయింది. మరో పెనుభూతంలాంటి కెరటం రావడం,సంధ్యని నీటిలోకి తీసుకుపోవడంకూడా జరిగింది. సంధ్య దొర్లుతూ నీటిలోకి పోతోంది. ఆ సమయంలో ఆమె కళ్ళలో యిసుకదూరింది. కళ్ళు మండసాగేయి. కళ్ళు తెరవలేక

పోయింది. ఆమె ముఖంనిండా, బట్టల నిండా యిసుక పేరుకుపోయింది. నోటికి ఉప్పునీరు తగిలింది చచ్చిపోతానేమో నన్న భయం కలిగింది సంధ్యకి.

ఇంతలో ఒక బలిష్ఠమైనచెయ్యి ఆమెను నీటినుంచి లేవనెత్తింది. ఆమె కళ్ళు తెరవాలని ప్రయత్నించి విఫలు రాలైంది. కాలికి పొడియిసుక తగలగానే తను ఒడ్డుకు చేరినట్లుగా సంధ్య గ్రహించింది. తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది

"కొంచెంసేపు కదలకండి. కళ్ళు తెరవడానికి కూడా ప్రయత్నించకండి. ప్రమాదం." అని ఓ గంభీరమైన కంఠం యింగ్లీషులో అనడం వినిపించింది సంధ్యకి.

ఆ వ్యక్తి సంధ్య ముఖం టవల్‌తో తుడిచేడు.

"ఇప్పుడు కళ్ళు తెరవండి." అన్నాడావ్యక్తి యింగ్లీషులో.

"ఎలా తెరవగలను, కళ్ళలో యిసుక ఉంటే?" అంది బాధగా, తనలో తను అనుకుంటున్నట్లుగా.

"మీరు తెలుగువారా?" అని ఆ వ్యక్తి ఆశ్చర్యపోయేడు. మరుక్షణంలో కర్తవ్యం జ్ఞాపకం వచ్చింది.

"కొంచెంసేపు కదలకండి. నేను మీ కంట్లో యిసుక తీయడానికి ప్రయత్నిస్తాను," అని ఆ వ్యక్తి సంధ్య బుగ్గల మీద ఒక చెయ్యీ, నుదుటిమీద ఒక చెయ్యీ వేసి, కళ్ళు తెరిచి ఊదేడు.

"ఇప్పుడు తెరవండి." అన్నాడతను సంధ్య మెల్లగా కళ్ళు తెరిచింది.

ఎదురుగా అందమైనవ్యక్తిస్విమ్మింగ్ డ్రస్‌లో కనిపించేడు.

"సమయానికివచ్చి సహాయంచేసేరు, థాంక్స్." అని సిగ్గుతో తలదించుకుంది.

"దాన్దేముందిగానీండి. యిక్కడ స్నానం చెయ్యడం ప్రమాదకరమని మీకు తెలీదా?" అన్నాడావ్యక్తి.

"ఏం?" అంది సంధ్య. వాస్తవానికి ఆమె స్నానం చేయడానికి రాలేదు. అయినా కనుక్కోవాలనిపించింది.

"ఇది కత్తెర ఒడ్డు. కాస్సేపుంటే ఈ సముద్రం మిమ్మల్ని తనలో యిముడ్చుకుని ఉందేది," అన్నాడతను.

సంధ్య మనస్సు భయంతో కంపించింది.

ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. సంధ్య అడుగులు భయంతో తడబడుతున్నాయి. "మీకింకా ఆ భయం పోలేనట్లుంది. కాస్సేపు కూర్చుని వెళ్దాం," అన్నాడు.

సంధ్య అభ్యంతరం చెప్పలేదు. ఇద్దరూ యిసుకలో కూర్చున్నారు.

"మొదట మిమ్మల్నిచూసి బెంగాలీ వాళ్ళేమోననుకున్నాను. కానీ మాటల్ని బట్టి మీరూ ఆంధ్రులేనని తెలిసింది. ప్రాంతంకాని ప్రాంతంలో మీరు కనిపించడం, తోటి తెలుగువాడిగా నా కానందంగావుంది నా పేరు అనిల్‌కుమార్,"

అని తనను తాను పరిచయం చేసుకున్నాడు ఆ వ్యక్తి.

"నా పేరు సంధ్య. రెండురోజులై ఈ ప్రాంతంలో మాట్లాడ్డాని కెవరూ దొరక్క బోరుకొట్టి ఛస్తున్నాను. నిజంగా నాకూ్కడా ఎంతో ఆనందంగావుంది... అన్నట్లు మీరిక్కడేం చేస్తున్నారు? లేక మీరు కూడా మాలాగే సైట్ సీయింగ్‌కు వచ్చేరా?" అడిగింది సంధ్య.

అతను చిన్నగా నవ్వి -

"లేదు. ఆ కన్పడుతున్న పల్లెలో వుంటున్నాను," అని దూరంగా చెయ్యి చూపించేడు.

సంధ్య చూసిందాపల్లెను. సుమారు అర మైలు దూరం వుంటుంది.

"అక్కడేం చేస్తున్నారు?" అనడిగింది.

"ఏమీలేదు. ఎవరేనా సముద్రంలో పడితే రక్షిస్తుంటాను." అని ఆమె కళ్ళలోకి చూసి నవ్వేడు.

సంధ్య అతని కళ్ళలోకి చురుగ్గా చూసి, సిగ్గుపడి నవ్వింది.

"ఏదో సరదాకన్నానులెండి... నేను రాజమండ్రి 'దామెర్ల ఆర్ట్ గేలరీ' లో చిత్రకళ నేర్చుకున్నాను. చిత్రాలు గీసుకోడానికి ప్రశాంత వాతావరణం యీ పల్లెటూళ్ళో లభిస్తుందని యిక్కడకు వచ్చేశాను." అన్నాడతను.

"మీరు చిత్రకారులా?" అని ఆశ్చర్యంగా, మళ్ళీ అతని కళ్ళలోకి చూసింది.

"ఏదో చిన్నసైజు చిత్రకారుణ్ణి." అని సిగ్గుపడ్డట్టుగా చెప్పాడు.

రెండు క్షణాలు నిశ్శబ్దం సముద్రంలో కెరటాలు, వాళ్ల మనసుల్లో ఆలోచనల్లా ఉవ్వెత్తుగా లేస్తున్నాయి.

"అన్నట్టు మీరిక్కడ ఎన్నిరోజులుంటారు?" అనడిగేడు.

"నేనూ, మా అమ్మ, నాన్నగారూ యిక్కడికొచ్చేం. హోటల్ పాంబీచ్‌లో ఉంటున్నాం. మా నాన్నగారికి సంబంధించిన పొలాలూ, అవీ ఉన్నాయి. వాటిని అమ్మేద్దామని వచ్చేం బహుశా ఓ వారం, పది రోజులుండొచ్చు," అంది సంధ్య. చీకటిపడుతోంది.

"యికలేద్దామా?" అంది సంధ్య.

"అలాగే." అని అతను లేచి, సంధ్యతోబాటు నడవసాగేడు. దార్లో—

"నాకూ చిత్రాలంటే యిష్టమే. మీ చిత్రాలన్నీ ఒకసారి చూడాలి," అంది సంధ్య.

"తప్పకుండా రండి. ఆ పల్లెటూర్లో అనిల్‌బాబు యిల్లెక్కడంటే ఎవరేనా చెప్తారు" అన్నాడు ఆహ్వానిస్తూ.

"అలాగే రేపు ఉదయం వస్తాను... మరి నే వెళ్తాను" అంది సంధ్య.

యిద్దరూ 'గుడ్‌నైట్' చెప్పుకుని విడిపోయేరు.

* * *

"అనిల్‌బాబు గారిల్లెక్కడ?" అని అడిగింది సంధ్య.

చుట్ట కాల్చుకుంటున్న వ్యక్తి ఆమెవేపు అదోలా చూసి—

"ఆ పాలిల్లా?... అదిగో! ఆ కనిప్పిస్తున్నదే..." అన్నాడు నిర్లక్ష్యంగా.

ఆ వ్యక్తి ఎందుకలా సమాధాన మిచ్చేడో అర్థంకాలేదు సంధ్యకి. అయినా ఆ వ్యక్తి చెప్పిన గుర్తునిబట్టి అనిల్ కుమార్ యిల్లు కనుక్కోవడం కష్టం కాలేదు.

సంధ్య మెల్లగా గేటు తీసుకొని లోపలకు ప్రవేశించింది. గేటుముందు 'ఆనంద వనం' అన్న బోర్డు వేలాడదీసి వుంది. ఇంటిముందు రకరకాల పూలమొక్కలు. పువ్వులతో పచ్చగా ఉన్నాయి. ఆ యిల్లు రెల్లుగడ్డితో అందంగా నిర్మించబడింది.

సంధ్య యింటిలోపలికి ప్రవేశించింది. నిశ్శబ్దంగా వుంది. 'ఎవరూ లేరేమో!' అనుకుంది.

ముందు గదిలో రెండు కుర్చీలు, ఒక టేబిలూ వున్నాయి. ఓ మూలగా ఖరీదైన సోఫాసెట్టు వుంది. గది మధ్యలో స్టూలుమీద అప్పుడే విచ్చుకున్న ఎర్ర గులాబీలు ఫ్లవర్ వాజ్‌లో అమర్చబడి వున్నాయి.

సంధ్య ఆ గది దాటి మరో గదిలోకి ప్రవేశించింది

ఆగదిలో అనిల్‌కుమార్ ఏదో చిత్రం గీస్తున్నాడు సంధ్య అతని వెనుకగా నిలబడింది. అతని ఎదురుగా కిటికీ లోంచి విశాలమైన సముద్రం కనిపిస్తోంది. అతను చిత్రం గీయడంలో నిమగ్నుడై వున్నాడు.

"నమస్తే!" తీయనైన కంఠం.

అతను వెనక్కి తిరిగి చూశాడు.

"ఓ! మీరా! రండి. రండి. మీరొస్తారన్న సంగతే మరిచిపోయాను. సారీ!" అన్నాడు.

"ఫర్వాలేదు లెండి."

"ఎంతసేపైంది మీరొచ్చి? అన్నట్టు మీ అమ్మా, నాన్నా రాలేదా?"

"రాలేదు. వాళ్ళిద్దరూ పొలాల విషయం సెటిల్ చేసుకునేందుకు వెళ్లారు. నా కవి యిష్టంలేక మీ చిత్రాలు చూద్దామనీ, కాస్సేపు మీతో మాట్లాడిపోదామనీ వచ్చాను," అంది సంధ్య.

"థాంక్స్. రండి, నా చిత్రాలు చూద్దురుగాని" అని మరో గదిలోకి దారితీసేడు.

సంధ్య అతన్ననుసరించింది.

ఆ గదిలో నాలుగు మూలలా రకరకాల వర్ణచిత్రాలు గోడల కలంకరించబడివున్నాయి. ఆమెకి అది ఒక చిత్ర ప్రదర్శన శాలలా అనిపించింది సంధ్య ఆశ్చర్యంగానూ, యెంతో వుత్సాహంగానూ చూస్తోంది. అతనామెను పరిశీలనగా చూస్తున్నాడు.

అతని చిత్రాలలో జీవకళ ఉట్టిపడుతోంది సూర్యోదయం, పడవపాట, బెస్త పాలెం, ఎర్రవల, ఆకలిపోరాటం, సౌందర్యతిలక, అభిసారిక, మనసులోని



మధువు...యివన్నీ అస్తవ్యస్తంగా ఆ గదినాక్రమించుకున్నాయి. గదిలో కిటికీల్లోన త్తిగుల్లతో చేసిన పక్షుల బొమ్మలు యివన్నీ పొందికగా అమర్చబడివున్నాయి ప్రశంసాపూర్వకంగా అతని వేపు చూసింది.

"ఇంత ప్రజ్ఞ, కళలో అభినివేశం కలిగినమీరు యిక్కడ మట్టిలో మాణిక్యంలా ఉండడం బాగులేదు," అంది.

"యేం చేయమంటారు?" అన్నాడు

"యివన్నీ చిత్రకళా ప్రదర్శనలకు, పోటీలకు పంపాలి. ఇంతటి మహాచిత్ర కారుణ్ణి దేశమే కాకుండా ప్రపంచం గౌరవించాలి," అంది ఆవేశంగా.

అనిల్ నవ్వి, గాడ్రెజ్ బీరువాదగ్గరకు వెళ్ళి తలుపు తెరిచాడు. దాన్నిండా యెన్నో ప్రైజులూ, ప్రశంసాపత్రాలూ ఉన్నాయి. మరోసారి ఆశ్చర్యపోయింది సంధ్య.

"ఆశ్చర్యపడకండి. పట్టణాలలో కళాకారుల మధ్య ఉండే రాజకీయాలు, హోరు, అనిశ్చిత వాతావరణం యివన్నీ నన్ను యిక్కడివరకూ తరిమాయి. ఇక్కడే నాకు చాలా ప్రశాంతంగా వుంది,'' అన్నాడు నవ్వుతూ

"మరి మీ భోజనం?" అంది సంశయిస్తూనే.

"భోజనానికేం? మా ఆవిడ అన్నపూర్ణ పదినిముషాల్లో వండేస్తుంది," అన్నాడు.

సంధ్య యిల్లంతా కలియజూసింది. ఆమెకు కావలసిన సమాధానం దొరకలేదు.

"బొమ్మలన్నీ చూస్తుండండి ఇప్పుడే వస్తాను," అంటూ వంటింట్లోకి వెళ్ళాడు అనిల్.

"ఆగండి. నేనూ వస్తున్నాను," అంటూ అతన్ని అనుసరించింది సంధ్య. వంటిల్లు చక్కగా సర్ది ఉంచబడింది. గ్యాస్‌పొయ్యి, ప్రక్కనే కుక్కర్, గాజు బీరువాలో ఖరీదయిన పింగాణీ సామాను, బ్రెడ్, బట్టర్, జామ్ యివన్నీ ఉన్నాయి. అతను ఆ బీరువా దగ్గరకు వెళ్ళి తెరవబోతుంటే —

"అవేం తీయకండి. నా బ్రేక్‌ఫాస్టు అయిపోయింది." అని వారించింది సంధ్య.

"పోనీ కనీసం కాఫీ అయినా" అంటూ స్టవ్ వెలిగించాడు.

"మీ శ్రీమతిగారిని పరిచయం చేస్తారనుకున్నాను. వారు వున్నట్లుగా కనిపించడంలేదే. పుట్టింటికి వెళ్ళేరా?" అంది సంధ్య.

అతను కాఫీ కలుపుతూ, సంధ్యవంక చూసి నవ్వేడు.

"అవును సుమండీ మర్చిపోయాను. యెక్కడికీ వెళ్ళలేదు. యిక్కడేవుంది ఈమె పేరే అన్నపూర్ణ." అన్నాడు స్టవ్ ప్రక్కగా చూపిస్తూ.

అక్కడ ప్రెస్టీజ్ కుక్కర్ అందంగా మెరుస్తూంది.

సంధ్యకి చిరుకోపం వచ్చింది. ఆమె గుండె తేలికైంది.

"భలే చమత్కారంగా మాట్లాడతారే!" అంది నవ్వుతూ.

"లేదు సంధ్యాదేవీ! నేను ఒంటరి వాణ్ణి. ఈ చిత్రాలు, యీ ప్రకృతి సౌందర్యం, యీ వినీలాకాశం, యీ విశాలసముద్రం యివన్నీ ఒంటరివాణ్ణన్న భావం కలగనివ్వటంలేదు." అంటూ కాఫీకప్పు సంధ్యచేతికి అందించాడు.

"థాంక్స్" అంటూ మళ్ళా మధ్య గదిలోకి వచ్చింది. అనిల్ ఆమెను అనుసరించాడు.

స్టాండ్ దగ్గరకువచ్చి ఆగింది అనిల్ సగం గీసిన బొమ్మ స్వరూపం ఆమెకు అర్థంకాలేదు.

"యేం బొమ్మ గీస్తున్నారు?"

"యేదో గీస్తున్నాను, మనస్సులో నర్తిస్తున్న సౌందర్యాన్ని. ఇంకా ఒక రకంగా పూర్తిరూపం అంటూ ఏర్పడలేదు," అన్నాడు అనిల్. అతని కళ్ళు మెరుస్తున్నాయి సంధ్య మనస్సులో భావాలు, హరివిల్లులా వెల్లివిరుస్తున్నాయి.

కాఫీ సిప్ చేస్తూ కిటికీలోనుండి, అంతరంగ తరంగాల్లా ఒడ్డుకు వస్తున్న సముద్రపు కెరటాల్ని చూస్తోంది. వెండిలా

తళతళా మెరుస్తున్న యిసుకలో టూరిస్టులు, రంగుల గొడుగులు వెలిశాయి. అందరూ ఉత్సాహంగా, లైఫ్‌బెల్టులు కట్టుకుని సముద్రంలోకి వెళ్తున్నారు. బెస్తకుర్రవాళ్ళు వాళ్ళని వింతగా చూస్తున్నారు.

"ఏమిటలా చూస్తున్నారు? మీరు కూడా స్నానం చేస్తారా?" ఆపేసాడు.

"నేనా?" అంది సిగ్గుతో.

"ఏం? చేయండి. తప్పేంలేదు కదా?" అన్నాడు.

"అదికాదండి. మరి నాకు బట్టలు..."

"వాటికేం బాధపడకండి." అంటూ గదిలోకి వెళ్ళాడు.

"కొంపదీసి యితను లుంగీ, టవలు పట్టుకురాడు కదా!" అనుకుంది మనస్సులో.

అనిల్ ఒక నైలెక్స్‌చీర, ఒక టర్కీ టవల్ తెచ్చియిచ్చాడు.

"అరె! ఆశ్చర్యంగా వుందే! చీర యెక్కడిదీ?" అడుగుదామనుకుని సభ్యతకోసం మానుకుంది

"ఆ రూమ్‌లోకి వెళ్ళి బట్టలు మార్చుకోండి," అన్నాడు. ఆ స్వరంలో ఏదో ఆప్యాయత కనపడిందామెకు.

ఇద్దరూ కలిసి మాట్లాడుకుంటూ, సముద్రపు వొడ్డుకు వచ్చేసరికి, అక్కడంతా సందడిగావుంది. కొంతమంది విదేశీయులు, రంగులబంతితో నీటిమధ్య ఆడుకుంటున్నారు. కొంతమంది యిసుకలో పడుకుని బీర్ కోకోకోలా లిమ్కా త్రాగుతూ, ఏవో పుస్తకాలు చదువుకుంటున్నారు అందరిదృష్టి చీర కట్టుకుని, అప్సరసలావున్న సంధ్య సౌందర్యంవేపు తిరిగిపోయింది. వాళ్ళ దేశంలో చీరలు యెవరూ కట్టుకోరు. 'వాటే బ్యూటీ' అనుకున్నారు. ఒకరిద్దరు ఆమె అనుమతితో ఫొటోలు తీసుకున్నారు.

"చూశారా, మీ సౌందర్యం వాళ్ళనెలా ఆకర్షించిందో?" అన్నాడు అనిల్, యింకో భుజంమీదకు టవల్ మార్చుకుంటూ.

సంధ్య బుగ్గలమీద గులాబీలు పూశాయి.

నిమ్మపండు రంగులాంటి శరీరం, చక్రాల్లాటి పెద్ద కళ్ళతో, చెవులకు పెద్ద రింగులతో, మెళ్లో ఒంటిపేట గొలుసుతో, సముద్రపుకన్యలా మెరిసిపోతోంది.

ఇద్దరూకలిసి, లైఫ్‌బెల్టులు కట్టుకుని దిగారు. సముద్రంలో చాలా దూరం పోకుండా, చాలాసేపు స్నానం చేశారు. అనిల్ సభ్యత ఆమెనెంతో ముగ్ధురాల్ని చేసింది. వాళ్ళిద్దరూ యెన్నో విషయాలు మాట్లాడుకున్నారు. ఇద్దరి అభిరుచులూ ఎన్నో ఏకీభవించాయి.

సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చాడు. దూరంగా బెస్తవాళ్ళ పడవలు వొడ్డుకు వస్తున్న దృశ్యం కనిపిస్తోంది.

''ఇంక ఆకలేస్తోంది. పోదామా?'' అన్నాడతను.

సంధ్యకు సముద్రాన్ని వదిలి, రాబుద్ధి పుట్టడంలేదు. అయిష్టంగానే నీటిలోంచి బయటకువచ్చింది. ఇద్దరూ యింటికి చేరారు.

''ఆ బీరువాలో బట్టలూ, టవల్సూ వున్నాయి. స్నానంచేసి, తీసుకోండి. నేనీలోగా భోజనకార్యక్రమం చూస్తాను,'' అంటూ వంటింట్లోకి వెళ్ళేడు.

స్నానంచేసి, తల తుడుచుకోవడానికి బీరువాలో టవలు తీద్దామనేసరికి, అందులో ఖరీదయిన అయిదు ఆరు చీరలు, జాకెట్లు కనిపించాయి. సంధ్య కేమీ అర్థంకాలేదు. అతన్ని అడగలేక పోయింది. తర్వాత వంటలో అతనికి సహాయం చేయబోయింది

''మీకు వంట వచ్చా?'' అడిగాడు ఆశ్చర్యంగా. సాధారణంగా గొప్పయింటి ఆడపిల్లలు వంటలు నేర్చుకోరని అతని అభిప్రాయం.

''నేను హోమ్ సైన్సు డిగ్రీ హోల్డర్ని సార్'' అంటూ వంటింటి స్థానాన్ని ఆక్రమించింది. ఇద్దరూ కలిసి భోజనం చేశారు.

''మీ నాన్నగార్ని, అమ్మగార్ని కూడా పరిచయం చేసుకుని మా యింటికి ఆహ్వానించాలని వుంది.'' అన్నాడు వక్కపొడి ఆమె చేతికిస్తూ.

''ఈ భూముల అమ్మకం వ్యవహారంలో, వాళ్ళు యెప్పుడు కాలేజీకి వస్తారో నాకే తెలియదు. అయినా వాళ్ళతో మీ గురించిచెప్పి తీసుకు వస్తాను,'' అంది.

''యేమని చెబుతారు?'' అడిగాడు కుతూహలంగా, ఆమె కళ్ళలోకి చూస్తూ.

''యేదో చెబుతాలెండి. మీకెందుకూ?'' అంది లేస్తూ.

''అప్పుడే వెళ్ళిపోతారా?''

''మా డాడీ, మమ్మీ నాకోసం చూస్తూంటారు.''

''పునర్దర్శనం...''

''రేపు ఉదయం'' అంది గేటు తీసుకుని వెళ్తూ.

కదలివెళ్తున్న ఆమెవేపు చూస్తున్నాడ అనిల్. కాకతాళీయంగా సంధ్య కూడా వెనుక్కుతిరిగి చూస్తే, అతను నవ్వుతూ చెయ్యి ఊపేడు.

* * *

ఉల్లాసంగా కూనిరాగం తీసుకుంటూ గదిలోకి ప్రవేశించింది సంధ్య.

''ఎక్కడికెళ్ళా వింతసేపు? భోజనం చేశావా?'' తల్లి అడిగింది.

''ఓ! అన్నీ అయాయి.'' ఉత్సాహంగా జవాబు చెప్పింది.

''ఎక్కడ భోజనం చేశావేమిటి?'' తండ్రి ఆమె కళ్ళల్లో మెరుపుల్ని గమనిస్తూ అడిగేడు.

''ఆవైపు ఓ పల్లె కనిపించడంలేదూ! అక్కడ నాకు అనిల్‌కుమార్ అని ఓ




చిత్రకారుడు పరిచయమయ్యేడు. అతని యింట్లోనే భోజనం చేశాను."

"అతనీ పల్లెటూళ్లో ఏంచేస్తున్నాడు?'' తండ్రి అడిగేడు ఆశ్చర్యంగా.

"అదే చిత్రం డాడీ! అతను ఎమ్.ఏ. చదివేడు. మంచి చిత్రకారుడు. అతని చిత్రకళను అభివృద్ధిచేసుకోడానికి యీ పల్లెటూరి వాతావరణమే అనుకూలంగా వుందిట. డాడీ! మీరు చూడలేదుగానీ, అతనివద్ద గొప్ప చిత్రాలున్నాయి. చూస్తే మీరే అంటారు, బ్రహ్మాండమైన చిత్రాలని. ఎంత మంచి చిత్రకారుడో, అంత మంచి స్వభావం కలవాడు. అన్నట్టు మిమ్మల్నిద్దరినీ కూడా తన చిత్రాలు చూడ్డానికి ఆహ్వానించేడు," అంది సంధ్య.

"అతనికి పెళ్లైందా?'' తల్లి అడిగింది ఆమె భయం, అనుమానం అలాంటివి!

"ఇంకా కాలేదమ్మా!"

"ఏ కులం?" మళ్ళీ ఆవిడే అడిగింది, కొంపదీసి కూతురుగాని అతన్ని ప్రేమించ లేదుకదా!

"యింకా కులాలేమిటి? మనిద్దరం పెళ్ళిచేసుకున్నప్పుడు కులాలగురించి పట్టించుకున్నా మేమిటి?...ఆయినా అతనే కులమైతే మనకెందుకు? మనమేం అతనికి పిల్లనిస్తున్నామా యేమిటి?...ఏమంటావ్ సంధ్యా? అన్నాడు తండ్రి.

సంధ్య సమాధానం చెప్పకుండా గోళ్లవంక చూస్తోంది

"సర్లెండి!...సంధ్యా! అలసిపోయి నట్టున్నావ్. కాస్సేపు రెస్ట్ తీసుకో!" అంది తల్లి.

సంధ్య మంచంమీద పడుకుంది. ఆమె ఆలోచనలన్నీ అనిల్‌కుమార్ చుట్టూరా తిరుగుతున్నాయి. అతని అందమైన ముఖం ఆమె కళ్లముందు మెదిలింది. సముద్రపు వొడ్డున జరిగిన

సంఘటనా, అతను తన చెయ్యి పట్టు కోవడమూ, తన బుగ్గలమీద చెయ్యివేసి తంట్లో ఊదడమూ...యిద్దరూ కలిసి భోజనం చెయ్యడమూ ... యివన్నీ జ్ఞాపకం వచ్చేయి సంధ్యకి. ఎందుకో వొళ్లుఆనందంతో పులకరించింది. మెల్లగా నిద్రలోకి జారుకుంది...

మళ్ళీ తెలివివచ్చేసరికి గది చీకటిగా వుంది. లేచి లైట్ వేసి, టైము చూసు కుంది. పావుతక్కువ ఏడవుతోంది. బయటకువచ్చింది. బాల్కనీలోకూర్చుని తల్లీ, తండ్రీ టీ త్రాగుతున్నారు. వెంటనే ముఖం కడుక్కుని, వాళ్లవద్దకు వెళ్ళింది.

"రా అమ్మా! నీకోసమే చూస్తు న్నాం," అంది తల్లి.

"చాలాసేపు నిద్రపోయాను కదూ!" యేదో తప్పుచేసినట్టు ఫీలవుతూ అంది సంధ్య.

"ఆఁ...అన్నట్టు చెప్పడం మరిచి పోయేను. మేమిద్దరం సాయంత్రం చిత్ర కారుడు అనిల్ కుమార్ యింటివేపు వెళ్ళేం, అతను యింట్లోలేడు. కాని అతని గురించి చుట్టుపక్కల కనుక్కు న్నాం. నువ్వనుకున్నట్టు అతనేం మంచి వాడు కాదు సంధ్యా: అతనింటికి తరు చుగా ఎవరో ఆడవాళ్ళు, మగవాళ్ళు వస్తుంటార్ట. వాళ్ళు వచ్చినప్పుడల్లా గానా బజానా చేస్తుంటార్ట. అతని గురించి పల్లె వాళ్ళకు మంచి అభిప్రాయంలేదు." అంది తల్లి.

సంధ్య షాక్ తింది, వెంటనే తేరు కుని—

"అమ్మా! పల్లెటూళ్లో యిటువంటి గాలివార్తలు మామూలే! యింతుంటే అంత చెప్తారు. మనం పెరిగిన వాతావర ణానికీ, వాళ్ళు పెరిగిన వాతావరణానికీ చాలా తేడావుంది కదా!'' అంది.

"ఎంతైనా నిప్పులేందే పొగరాదు కదా సంధ్యా!" అంది తల్లి.

"బాగుందమ్మా! అతనటువంటివాడు కాదమ్మా!'' అని బయటకన్నాదే కానీ లోలోపలమాత్రం తల్లిచెప్పిన మాటలు నిజమేనేమో ననిపించసాగేయి. ఆమె మనస్సు వికలమయిపోయింది. మర క్కడ వుండబుద్ధి పుట్టలేదు, మెల్లగాలేచి గదిలోకి వెళ్ళిపోయింది.

"అందుకే అమ్మాయి కావిషయా లేపి చెప్పొద్దన్నాను. అన్నమాటలు సంధ్యకి వినిపించకపోలేదు.

*          *          *

సంధ్య లేచేటప్పటికి అరున్నర దాటుతోంది.

రాత్రి తల్లీ, తండ్రీ అనిల్ కుమార్ గురించి అన్నమాటలు మళ్ళీ జ్ఞాపకం వచ్చేయి. మనస్సులో ఆదోలాఅయింది.

"అమ్మా! మేం వెళ్తున్నాం,"అన్న తండ్రిమాటలు వినిపించేయి.

"అలాగే నాన్నా"అంది సంధ్య. కారు స్టార్టయింది.

సంధ్య రూమ్‌లో మిగిలింది వంటరిగా.



పుస్తకం చదవాలని తీసింది. కానీ అనిల్‌కుమార్ రూపం కళ్లముందు మెదలడంతో మరి చదవలేకపోయింది.

తిన్నగా బీచ్‌కి బయల్దేరింది. వాతావరణం చల్లగా వుంది.

యిసుకలో కూర్చుని అనిల్‌కుమార్ గురించే ఆలోచించడం మొదలెట్టింది. 'తను అనిల్‌కుమార్ గురించి విన్నది నిజమేనా? అతని ప్రవర్తన మంచిది కాదా?... అందుకేనా ఆ రోజు ఆ ముసలివాడు అనిల్‌కుమార్ గురించి అడిగినప్పుడు వెటకారంగా సమాధానమిచ్చేడు?... ఒకవేళ నిజమేనేమో!... లేకపోతే అతనివద్దకు ఆ చీరలూ, జాకెట్లూ ఎలా వచ్చేయి?' ఎటూ తేల్చుకోలేక సతమతమయిపోతోంది. అతనిమీద ఎంతో కోపం వచ్చింది. ఎందుకు వచ్చిందో ఆమెకే తెలియదు.

ఆమె హృదయాకాశంలో అనుమానపు మబ్బులలాగే, ఆకాశంలో కూడా మబ్బులు అలుముకున్నాయి.

ఒకటీ, రెండూ చినుకులు రాల్తున్నాయి. కానీ సంధ్య యివేవీ గమనించలేదు. "మీరిక్కడున్నారా? మీరొస్తానని రాకపోతే మీకోసం హోటల్‌కి వెళ్ళేను,అక్కడా లేరు మీకోసం వెతుకుతున్నాను.''

త్రుళ్ళిపడి చూసింది. అనిల్‌కుమార్

"చినుకులు పడుతున్నాయి వాన పెద్దదిగా వచ్చేట్టుంది. పదండి. మా యింటికి పోదాం" అన్నాడు.

అతనన్నట్టుగానే మరుక్షణంలో చినుకులు పెద్దవయ్యేయి.

సంధ్య మంత్రముగ్ధలా అతని ననుసరించక తప్పలేదు.

ఇద్దరూ తడుస్తూ అతని ఇంటికి చేరుకున్నారు

అతనో టవల్ ఆమెకిచ్చి తుడుచుకో మన్నాడు

సంధ్య 'తాను విన్నది నిజమా ? కాదా ?' అని అడగాలనిపించి, మళ్ళీ బాగుండదేమోనని మానుకుంది. 'అడిగితే యెలా అడగాలి?" అని అనుకుంది.

''ఏమిటో యీ రోజు మీరు మూడ్స్‌లో లేనట్టున్నారు ?"

"ఆ ... యేమిటీ ?" పరధ్యాన్నం నుండి తేరుకుని అడిగింది.

అతను మళ్ళీ అదే ప్రశ్న డిగేడు.

"ఏంలేదు. ఏదో ఆలోచిస్తున్నాను. అంతే," అంది.

"ఎవర్నిగురించో ఆ ఆలోచన ?" హాస్యంగా అడిగేడతను.

"మీ గురించే."

"నా గురించా ? ఏముందబ్బా ?" ఆశ్చర్యంగా అడిగేడు

"అవును... నేనో ప్రశ్నదుగుదామనుకుంటున్నాను." అని అతని ముఖంలోకి చూసింది నిదానంగా.

అతనుకూడా సంధ్య ముఖంలోకి చూసి 'అడగండి' అన్నాడు.

"మీ రేమనుకోకపోతే...... మీకీ చిరలూ, అవీ ఎలా వచ్చేయి ? బ్రహ్మచారులు కదా యివన్నీ మీవద్ద ఎందుకున్నాయి ? అదీగాక పల్లెప్రజలకు మీ మీద సదభిప్రాయం లేదు," అని సూటిగా ప్రశ్నించింది.

అతను సంధ్యవేపు రెండుక్షణాలు చూసి, తర్వాత నవ్వేడు.

"అప్పుడే మీదాకా కూడా ఈ విషయం వచ్చేసిందన్నమాట !... నేనెప్పట్నుండో అనుకుంటున్నాను. నా విషయంగురించి ఎవరికేనా సంజాయిషీ యివ్వవలసి వస్తుందని. కానీ యీ పల్లె వాళ్ళకు నాగురించి సంజాయిషీ యివ్వవలసిన అవసరం కనిపించలేదు. అందుకు రెండు కారణాలున్నాయి. ఈ పల్లెవాళ్ళకు నేనెంతచెప్పినా మన జీవన విధానం వీళ్ళకు అర్థంకాదు. ఒకవేళ చెప్పినా నా మీద వాళ్ళకున్న అనుమానం పెరుగుతుందే తప్ప సద్భావం కలగదు. యిక రెండోకారణం నాకూ, వీళ్లకూ సంబంధం లేకపోవడమే ; కానీ యీరోజు మీరు నా ఫ్రెండుగా అడుగుతున్నారు కాబట్టి చెప్తున్నాను వినండి." అని ఆగాడు.

సంధ్య కుతూహలం పెరిగింది.

"పల్లెవాళ్లు అనుమాన పడ్డట్టుగా నా యింటికి తరుచూ నా స్నేహితులు, మరీ ముఖ్యంగా యిద్దరు ఆడవాళ్ళూ, యిద్దరు మగవాళ్ళూ వస్తుంటారు.



పోలికలు

వీళ్ళంతా మన తెలుగువాళ్ళు. ఉద్యోగ రీత్యా బరంపురంలో ఉంటున్నారు. ఆ పట్నంలో బోరుకొట్టి వారం, పదిరోజుల కోసారి యిక్కడకువచ్చి ఆనందగా గడిపి వెళ్తుంటారు. వాళ్ళతోపాటు నేను కూడా ఆనందంగా, సరదాగా గడిపేస్తాను వాళ్ళు వచ్చేరంటే చేసే అల్లరి యింతా అంతా కాదు. చిన్నపిల్లలకు మద్దె తుళ్ళుతూ, గెంతుతూంటారు. ఆ రెండురోజులూ చాలా సందడిగా వుంటుంది నా యిల్లు. అదీ సంగతి. వాళ్ళతోపాటు ఒకసారి ఒక మరో వ్యక్తి కూడా వచ్చేడు. అతను బుల్‌బుల్ చాలా బాగా వాయిస్తాడు ఆ రోజంతా అతని సంగీతంతోటే గడిపేసాం." యీ పల్లెవాళ్ళకు మనం ఏంచేసినా ఆశ్చర్యంగానే ఉంటుంది. వాళ్ళు దీనిని మరో విధంగా అర్థంచేసుకున్నారు. యిక చీరల సంగతి కదూ మీరడిగింది? వాళ్లు తరుచూ వస్తుంటారు. వచ్చినప్పుడల్లా చేతులూపుకుంటూ వచ్చేస్తారు. అవి వాళ్ల ఉంచుకున్నబట్టలే;... వాళ్ళనిచూసి పదిరోజులౌతోంది. రేపు ఆదివారం కదూ?... బహుశా యివాలో, రేపో రావాలి," అన్నాడు.

సంధ్య మనస్సులో అనుమానపు మబ్బులు విడిపోయేయి.

మనసు తేలికైంది.

"క్షమించండి. మిమ్మల్ని నవసరంగా అనుమానించేం." అంది సంధ్య.

"ఫర్వాలేదులెండి. మీ కనుమానం రావడం న్యాయమే." అన్నాడు.

వాన వెలిసిపోయింది.

బయట కారు ఆగిన శబ్దమైంది.

"ఒరే బ్రహ్మచారీ! వచ్చేసేం," అన్న కేక వినిపించింది.

"అదుగో వచ్చేసారు. వాళ్ళే." అని ఆనందంగా బయటకు వెళ్లేడు.

సంధ్యకూడా అతని వెనకే వెళ్లింది.

ఆకాశం నిర్మలంగా వుంది, సంధ్య మనస్సులాగ.

"రండిరా." ఆహ్వానించేడు అనిల్.

వాళ్ళు నలుగురూ కారులోంచిదిగేరు.

"ఎవరీవిడ అన్నయ్యా?" వాళ్ళలో ఒకావిడ అడిగింది.

ఈవిడపేరు సంధ్య. మీలాగే సైట్ సీయింగ్‌కు వచ్చింది" అని సంధ్యని పరిచయం చేసాడు.

పరిచయాలయ్యాయి.

"అబ్బ. ఈ వానపడిన తర్వాత ఉక్క చంపేస్తోంది. స్నానానికి బయల్దేరితే బాగుంటుందేమో!" అన్నాడొకతను.

నలుగురూ లోపలికెళ్ళి బట్టలు మార్చుకుని వచ్చేరు.

"ఏరా! లోపల సగంబొమ్మ వేసి వదిలేసావ్. ఎవరిదాబొమ్మ? నీ ప్రేయసిదా?" అని ఒకతను అడిగేడు.

'అవును' అని లోపలే అనుకుని

"కాదు. సంధ్యాదేవిగారి చిత్రం." అన్నాడు అనిల్.

"అలాగా. క్షమించండి." అన్నాడతను, సంధ్యతో

"ఫర్వాలేదులెండి" అన్న భావాన్ని స్ఫురింపజేస్తూ తలదించుకుంది సంధ్య.

"ఒరేయ్! మేం స్నానానికి పోతున్నాం." అనేసి వాళ్ళు వెళ్ళారు.

సంధ్యా, అనిల్ మిగిలేరు.

"మావాడు యిందాక తప్పుగా మాట్లాడేడు. ఆ వెధవ తరఫున నన్ను క్షమించండి" అన్నాడు.

"ఎందుకూ?"

"అదే...యిందాక వాడు మిమ్మల్ని నా..." ఆగిపోయేడు అనిల్.

"అతనేం తప్పుమాటన్లేదు. నిజమే చెప్పాడు." అని సంధ్య తలదించుకుంది.

"అంత అదృష్టమా?" అన్నట్టు ఆమెకేసి చూసాడు. ఆశ్చర్యంగా, ఆనందంగా...

ఆ సమయంలో...

చేరువైన వాళ్ల రాగహృదయాల్లో, కోటి సన్నాయిలు కళ్యాణ గీతాల్ని ఆలపించేయి





# జి.వి. కృష్ణారావు

# ఉంద బిందువుడి

"అమ్మా, అమ్మా !"

కొడుకు పిలుపులోని ఉద్వేగాన్ని పసికట్టిన సుభద్రమ్మ, చెరుగుతున్న వడ్లచేట క్రిందబెట్టి అతనివైపు చూచింది.

"కృష్ణా రామా అంటూ మూల కూర్చోక ఇదేమిటే ? ఓపిక ఉన్నది ఒళ్ళు దాచుకొంటే, బండెడు చాకిరి నెత్తిమీద వేసుకొన్నావా !" రామయ్య ధోరణి మార్చాడు.

"ముసలిదానిమీద ఎన్నాళ్లనుంచిరా ఈ మమకారం ? నిండుచూలాలు ఈ పని చెయ్యలేదు. కాని అసలు సంగతేమిటో చెప్పు !" సుభద్రమ్మ నవ్వింది.

తన హృదయాన్ని యిట్టే పసికట్టినందుకు అతని చిరాకు మరీ ఎక్కువయింది.

"నీ ముద్దుల కొడుకు ఏమిచేశాడో చూశావా ?"

"నా చిట్టి తమ్ముడు ఏమిచేశాడో చూశావా అనరాదూ ? అనవు. ఎందుకంటా ? ఇంతకూ అసలు సంగతేమిటో !" తల్లి నిట్టూర్చింది.

కన్నంలో దొంగకు తేలుకుట్టింది. అవును, తల్లివల్ల జరిగిన పొరపా టేముంది ?

"మా తమ్మయ్య ఉత్తరం వ్రాశాడు. నేను ముందుగా వ్రాస్తేనే వ్రాశాడనుకో!"

"నువ్వేమి వ్రాశావు ? అతగా డేమన్నాడు ?''

"ఏమున్నది వ్రాయటానికి ? ఈ యేడు ఊచతెగులు తగిలి పంటలు పోయాయి. ఎకరానికి అయిదారు బస్తాల రాలుబడి కూడ లేదని వ్రాశాను." రామయ్య గొంతు జీరబోయింది.

"అవును, ఈ ఏటి రాలుబడి అంతేగా! నువ్వు చేలను పండవద్ద న్నావా ఏమిటి ?" తల్లి వాత్సల్యం అతన్ని కప్పింది.

"ఊళ్లో మగతాదారులు ఏమిచేస్తున్నా రని మా చిట్టితమ్మయ్య అడుగు తున్నాడు. అవును, ఇంతకాలంనుంచి వాడి చేలో నేను చేస్తున్న దేమిటి, మగతా కాక !"

"ఉద్యోగంలో చేరింతరువాత చిన్న వాడికి బొత్తిగా మతిపోయింది."

"వాడికేమీ మతిపోలా. పోయిందల్లా మనకే !"

"అయితే నేను వచ్చిపొమ్మంటున్నా నని కార్డుముక్క రాసి పడెయ్యి."

"రాయవలసిన అవసరం నాకేమీ లేదు వాడి లెక్కప్రకారం రావలసిన పైకం అణా పైసలతోసహా ఇవాళే మనియార్డరు చేస్తున్నా.'' రామయ్య వెళ్ళిపోయాడు.

సుభద్రమ్మ విస్తుపోయింది. తన ఇద్దరి కొడుకుల సంగతి ఆమెకు పూర్తిగా తెలుసు. వాళ్లకు తండ్రిఅయినా తల్లిఅయినా తనే. తన చేతులమీదుగా పెంచి పెద్దవాళ్లను చేసింది. ఇద్దరూ కవలలు, ఒక్కటే పోలిక. ఒకే తల్లి పాలు త్రావి ఒకే సంస్కారంలో పెరి గారు. అయినా గుణాలలో ఇరువురికీ ఎంతో తేడా. పెద్దవాడి మనసు ఉదారం. చిన్నవాడు కూడా మంచివాడే కాని, కాస్త లోభగుణం ఉన్నదేమో నని పిస్తుంది అయినా సుభద్రమ్మ కనుగలిగి దిద్దటానికి ప్రయత్నించింది. ఉన్న కొంద్ర తక్కువ. ఇద్దరి పిల్లలకూ ఇంగ్లీషు చెప్పించే తాహతులేదు. కనుక చిన్నవాడైన లక్ష్మయ్యను ఇంగ్లీషు చదువులకు పంపి, ఆమె రామయ్యను వీధిబడి చదువుతో మానిపించి తనకు తోడుగా నిలుపుకొన్నది.

రామయ్యకు ఏకోశానా కుళ్లుబోతు తనం లేదు. నమ్మిక చిక్కితే అతడు ఒడలుకోసి యిస్తాడు. మనసు విరిగిందో అతనిని ఎవరూ వినిపించలేరు. అతని స్నేహం వంటిదే పగకూడ అవి అతి ఉత్కటాలు. లక్ష్మయ్య లక్షణరావై ఎల్. టి. పూర్తిచేసుకుని బస్తీలో బడి పంతులై ఒక గ్రాడ్యుయేటును పెళ్లి చేసుకొన్నాడు. కొడుకులిద్దరూ ఒకరి

కొకరు అందదండగా ఉండాలన్న ఆశ కొలది లక్ష్మయ్య చదువు ఖర్చులు పాటికి రానీక తనవంతు రెండెకరాలు పోను మిగతా ఆస్తిని ఇద్దరికి చెరిసగం పంచి యిచ్చింది. తమ్ముడూ, తల్లీ కావాలనుకొన్న రామయ్య సణగలేదు. అంతేకాదు, తమ్ముని పొలం తానే చేస్తూ రాలిన పంటను అమ్మి ముద్రశుద్ధిగా ఈనాటివరకూ అప్పగిస్తూ వచ్చాడు.

అలాంటి రామయ్యకు లక్ష్మణరావు అలా ఉత్తరం వ్రాశాడని వినగానే సుభద్రమ్మ మనస్సు చివుక్కుమన్నది. తనకే అలా అనిపించినప్పుడు పెద్దవాని మనస్సు ఎలా ఉండాలి ? చిన్నకొడుకు దగ్గర ఉంటే గూబ గుయ్యి మనిపించేది. కాని, ఏమి లాభం ? ఎక్కడో దూరాన ఉన్నాడు.

అవాళే సుభద్రమ్మ చివాట్లువేస్తూ చిన్నకొడుకుకు ఉత్తరం వ్రాసింది. కాని మళ్ళీ ఏమి తోచిందో వ్రాసిన ఉత్తరం చించివేసి ఖరూరుగా ఒకసారి వచ్చి వెళ్ళవలసిందని కార్డు వ్రాసి రామయ్య కొడుకు సూర్యంచేత పోస్టులో వేయించింది.

రామయ్య తల్లిని పలకరిస్తూనే ఉన్నాడు. కాని ఆమెకు ఆ పలుక రింతలో ఏదో లోటు ఉన్నట్లుగానే ఉన్నది. వారం రోజులకు చిన్నకొడుకు నకు మారుగా కవరు వచ్చింది. ఆమె విప్పి చదివింది.

అత్తయ్యకు,

నమస్కారాలు, ఇక్కడంతా క్షేమం. అక్కడ అందరికి కుశలమే కదా ?

మీ ఉత్తరం చేరింది. ఏదో చిరాకులో ఉండి మీ అబ్బాయి బావగారికేదో తెలివి తక్కువ సమాధాన మిచ్చారట. ఎంతో నొచ్చుకుంటున్నారు. తమకు మొగం చెల్లక నన్ను సమాధానం వ్రాయ మన్నారు. మీరే వ్రాస్తే బాగుంటుందని మొత్తుకున్నాను. వింటేనా ? ఇంకా జాగుచేయటం మర్యాదకాదని వ్రాస్తు న్నాను. నా సాహసానికి క్షమించాలి. నేనే వచ్చి బావగారికి కనిపించి క్షమాపణ చెప్పుకొంటే మేలేమోనని పించింది. కాని అన్నదమ్ముల నడుమ నీ జోక్యమేమిటి అంటారేమోనన్న భయంతో మానివేశాను. బావగారికి మీరెలాగైనా నచ్చజెప్పండి. అదనంగా పంపిన అరువందలకు చెక్కు పంపిస్తు న్నాను. వారికి అందజేయండి.

అక్కయ్యతో గలిసి ఒకసారి మీరు ఇక్కడకు ఎందుకు రాకూడదు ?

ఇట్లు,
మీ కోడలు,
శ్యామల.

"ఇందుకే చదువుకొన్నవాళ్ళకంటె చాకళ్ళు మేలంటారు !" సుభద్రమ్మ విసుగుకొన్నది.

ఆ రాత్రి రామయ్య భోజనంచేసి

తాపీగా కూర్చుండగా "నీ తమ్ముడు ఉత్తరం రాశాడురా!" అని తల్లి చెప్పింది.

అతడు ఊకొట్టి ఊరుకున్నాడు. "పొరపాటు జరిగిందని వాడెంతో బాధ పడి ఆరువందలు తిరిగి పంపాడు," అంటూ ఆమె కోడలు పంపిన చెక్కు ఇవ్వబోయింది.

"కుక్క ముట్టిన కూటికోసం ఈ రామయ్య ఎన్నడూ ఆశపడడు''. అతడు చివుక్కున లేచి బజారుకు వెళ్ళిపోయాడు.

సుభద్రమ్మ నిర్ఘాంతపోయింది. ప్రక్కనే ఉండి అంతా విన్న పెద్ద కోడలు "అత్తయ్యా, పెద్దదానవు నీకు తెలియనిదేముంది? ఆ మనిషికి కోపం వస్తే అంతేగా! పోటు పొడుస్తున్నంత మాత్రాన కళ్లు తీసివేసుకోగలమా?" అన్నది.

"అవునమ్మా. అంతే. మిన్ను కురవక చేలు, కన్ను కురవక బ్రతుకులూ పండవు." సుభద్రమ్మ పైట కొంగుతో ముక్కు తుడుచుకొన్నది.

మబ్బు లురిమాయి. తత్తరపాటుతో రైతులు అరకలు కట్టారు, మెట్టదాళ్లు ముగిసాయి. గంగమ్మ వెల్లపొడిచింది.

సాయంకాలం దమ్ము నాగలి ఇంటికి తోలుకుపోతూ పాత పాలేరు ముత్తయ్య చినబాబు చేను దున్నించలేదేమని సుభద్రమ్మను ప్రశ్నించాడు. ఆ రాత్రి ఆమె రామయ్యను కదలించింది.

"ఇకనుంచి నీ పొలంతో నాకు నిమిత్తంలేదని ధాన్యం డబ్బు పంపిన నాడే వ్రాశానే!"

"ఇంతకూ చేను దున్ననేలేదు!"

"పోరంబోకులన్నీ దున్ని జరిమానాలు వేయించుకొనే దుర్గతి నాకింకా పట్టలేదు."

"పోరంబోకులా?" తల్లి కొడుకుల మాటలు వింటున్న మంగమ్మ అందుకొన్నది.

"కాదు, మీ బాబిచ్చిన అరణం!"

"అమ్మాయ్! పుణ్యానికి పోతే పాపం వెంటపడుతుందిగాని నీ వూరుకో. వాడీ లోకంలో లేడు."

సుభద్రమ్మకు అర్థమయింది. పెద్ద కొడుకు వ్రాసే ఉంటాడు. చిన్న కొడుకు అన్నను నలుగురిచేత అనిపించాలనీ మొగం చెల్లకో, మరచిపోయో చేను సంగతి పట్టించుకోలేదు చూస్తూ, చూస్తూ బంగారంవంటి చేను పాడుపెట్టటమా? పిల్లా జెల్లా ఉన్నవాడు. బస్తీలో కాపురం.

తెల్లవారుజామున సుభద్రమ్మ లేచి వెళ్లి ముత్తయ్యనులేపి లక్ష్మయ్య చేను చేసుకొమ్మన్నది. తరుణం దాటిన తరువాత తలకెత్తుకొనే సాహసంలేక అతడు తనవల్ల కాదన్నాడు. "అయితే కూలి నాగళ్లు పెట్టి దమ్ము చేయించి నాటు



వేయించు. ఖర్చులన్నీ నేనే పెట్టుకుంటాను. నీ కష్టం అట్టేపెట్టుకోను ముత్తయ్యా!" అన్నది. లోగడ చాల కాలం తన్నాదుకొన్న మునలమ్మ నోరు తెరిచి అడుగుతున్నది. అతడు కాదన లేకపోయాడు.

లక్ష్మణరావు చేలో పడ్డ మొక్కలు రామయ్య చెవిలో పకపకా నవ్వాయి. తాను తల్లిని పువ్వుల్లో పూజిస్తుంటే ఈనాడు ఇలా నలుగురిలో నవ్వులపాలు చేస్తుందా? మాట మాత్రమైనా తనతో అనలేదు. నిజానికి ఆమె బొంది మాత్రం తమతో ఉన్నదే కాని ప్రాణాలన్నీ చిన్న కొడుకువద్దనే.

ఈ ఆలోచన రాగానే రామయ్య మనసుకు గతమంతా మరొకరీతిగా తోచింది. తల్లి పక్షపాత బుద్ధితోనే తన చదువు మానిపించింది. చిన్నవాడి చదువు ఖర్చులు లెక్కకట్టనీక ఆస్తి పంపిణు వేయించింది. కళ్ళు ఉండీ తాను అంధుడయ్యాడు.

ఆ రాత్రి సుభద్రమ్మ మనుమణ్ణి ఒళ్లో కూర్చోబెట్టుకుని, "ఓ జయమ్మ నీ కుమారుడు" అన్న భాగవత పద్యం చెబుతున్నది. రామయ్య ప్రక్క అరుగు మీద ఒద్దికగా కూర్చుని "అమ్మా!" అన్నాడు.

"ఏమిటిరా!"

"ఏమీ లేదు, ఇంతకాలం పెంచావు. ఒక యింటివాణ్ణి చేశావు. ఇంకా నీ మీద ఆధారపడటం బాగుండలేదమ్మా! రేపటినుంచి మా సోలెడు మేము పోంగించుకొంటాము."

సుభద్రమ్మ కొయ్యబారిపోయింది. ఎలాగో తెమల్చుకొని దగ్గుత్తికతో అడిగింది: "ఇంతకూ నేను చేసిన పాపమేమిటి?"

అతడూ మాటాడలేదు.

"గడవవలసిన పురుళ్లూ, పుణ్యాలూ గడచినా ఈ మొండికట్టె పోక వచ్చింది."

రామయ్య మారుమాటాడక వెళ్లిపోయాడు. ఆ మాటలన్నీ వాకిట్లో నిలబడి వింటున్న మంగమ్మ బావురుమన్నది.

"అమ్మాయీ, జరుగవలసిందేదో జరుగుతుంది. నెలలువచ్చిన మనిషి దిగులు పడరాదు."

మరునాడు జాము ప్రొద్దెక్కిన తరువాతగాని సుభద్రమ్మ లేవలేదు. లేచి ఆమె దొడ్లో కాలు పెట్టగానే తొలిచూరి పడ్డ వెల్లావు, దూడ ఒక్కసారిగా అరిచాయి.

"ఏమే అమ్మాయి! దూడను విడవలేదా!" ఆమె కోడలిని పిలిచి అడిగింది.

"వాటికైనా బుద్ధి ఉందదా అత్తయ్యా!"

"నాయనమ్మా! నాయనమ్మా! ఇందాక పాలచెంబు పట్టుకుని నాన్న దగ్గిరికెలితే పద్దా ఆవు ఏమిచేశాయను కొన్నా? నువ్వు చూలాలిసింది. బలే చిందులు పెత్తాయిలే! సినిమాలో కూలా అలా చిందులు పెత్తయి." సూర్యం అభినయించాడు.

"నోరుముయ్ వెధవ!" మళ్ళీ పాలచెంబు పట్టుకుని వచ్చిన రామయ్య తన చేతిలోని దాయత్రాటితో కొడుకును ఒకటి వేశాడు.

"పెద్దబ్బాయ్!" చిఱుతపులి కాంద్రుమన్నది

"ఇది నా సంసారం." రామయ్య తల్లివంకనైనా చూడకవెళ్లి లేగ కోడె దూడను విప్పి ఆవుకు దాయవెయ్యబోయాడు. అది బిసతప్పిన రాకెట్టయి ఎగిరిపడ్డది. మరి కొంచెమైతే అతని కన్ను పోవలసింది

సుభద్రమ్మ గిరుక్కున మళ్లీ ఇంట్లోకి వెళ్లిపోయింది. పోయిన కొంచెంసేపటికే బాదుతున్న చప్పుడు పడ్డ అరుపులు వినిపించాయి. దానిని ఆమె కన్నబిడ్డలాగా పెంచింది. కట్టు తాడు విప్పితే అది వెంటపడి వంట యింటి గుమ్మందాకవచ్చి నిలబడిపోయేది. ఆ సంగతి జ్ఞప్తికి రాగానే ఆమె నిలుచున్న చోటనే చతికిలబడిపోయింది.

భూమి మాత్రం చతికిలబడలేక తన

చుట్టూ నాలుగుసార్లు అలంగం తిరిగింది. ఆ మధ్యాహ్నం కటికినులకల్లో పండు కొని సుభద్రమ్మ ఇంటి వాసాలవంక చూస్తున్నది.

"నాయనమ్మా, నాయనమ్మా !"

"ఎవరది."

"ఇన్ ! బిగ్గరగా మాతాలకు, నాన్న బయత అలుగు మీద కూచున్నాలు. ఇంతాలు."

"అరే, అటు తిరిగిరా !

"అమ్మో ! వత్తే బతకనిత్తాలు ! మొన్నే చెప్పాలుగా, పానాలు తోలెత్తా నన్నాలు."

"అలాగా !"

"సరేగాని, అన్నం తిన్నావా ?

"అ ...అఁ"

"ఒత్తిదే. అబద్ధాలు చెవుతున్నావు. నీకు ఆలపిల్లలు పులతాలు నాయనమ్మా !"

"ఓరి పిచ్చిగాడిద !"

"గాడిద ఓంద్ర పెత్తును. నేను పెత్తను."

ఆమె మాటాడలేదు.

"ఈ యింట్లో అందరికీ కోపాలే. నీకు కోపం, నాన్నకు కోపం, అమ్మకు కోపం, ఆవుకు కోపం, ఆవుదూలకు కోపం, నాకేనా" లేంది ! నేనూ కోప్పలతా. "ఒలే పెద్దబ్బాయ్ ! నీకు మతిపోయిందిలా ! లేకపోతే నిచ్చేపంలా పాలు తాగలేక పద్దను అమ్మేత్తావా !" సూర్యం నాయనమ్మను అనుకరించాడు.

నవ్వుతుందనుకొన్న నాయనమ్మ బొమ్మలాగ చూస్తున్నది. సూర్యానికి ఏమీ అంతుపట్టలేదు. ఏదో తప్పు చేశానన్న భయంతో అతడు చల్లగా జారుకొన్నాడు.

తనను దగ్గరకు చేరనీని పాడి పద్దను తెగనమ్మి రామయ్య బక్క నీళ్ళకు కూడ వాచిపోతున్నాడు. ఆవు కూడ దాయ వేయనీయటంలేదు. కోడె దూడ గదా అదైనా బాగుపడుతుందన్న ఆశతో వదలి ఊరుకుంటూ వచ్చాడు. ఆవు తీరి గలదనీ, ఒక ప్రక్క అయినా తీయకపోతే లేగదూడ అరమాయించు కోలేదనీ అతడు గుర్తించలేదు. పొలము మీది బాకిరి అయితే చేస్తూ వచ్చాడే కాని పాడి పశువులకు అత డెప్పుడు పరామరిక చేశాడు ? పదిరోజులలోనే అజీర్తిరోగంతో కోడెదూడ చచ్చి పోయింది. వలవల ఏడుస్తూ సూర్యం ఆ సంగతి తడిక కంతలోంచి సుభద్రమ్మకు చెప్పాడు. నిప్పుల కవ్వంతో ఆమెకు గుండెలు చికిలినట్లయింది. వచ్చి పడుతున్న కడగండ్లన్నిటికీ తల్లే కారణమని కొడుకు మరీ గండరించాడు.

లేగదూడ చనిపోగానే సుభద్రమ్మ మనసు పరిపరి విధాల పోయింది. తన ఉనికివల్ల కొడుకు కోపం పెరుగుతుందే కాని తరగదు. ఆ కోపంతో ఇలాగే

ఏవో తెలివి తక్కువ పనులు చేస్తాడు. నష్టపోతాడు. తన మనస్సు మరీ వికల మవుతుంది. ఈ చిక్కులన్నీదేనికి? కొంతకాలం తానక్కడ లేకపోతేనో? వాడి మనస్సు కుదుటపడవచ్చును. లేదా తనకైనా కొంత మనశ్శాంతి కలుగ వచ్చును.

ఆ మధ్యాహ్నం కొడుకు వాటాలోకి వెళ్లి మంగమ్మను పిలిచి, "అమ్మాయి ఇల్లు భద్రం! నీ సంసారం సంగతి నీకు చెప్పనక్కరలేదు వస్తానమ్మా!" అన్నది, గ్రుడ్ల నీరు గ్రుడ్లలోనే క్రుక్కుకొంటూ "నన్నేమి చేసి పోతున్నా వత్తయ్యా!" అని మంగమ్మ అన్నది.

"నేను బిడ్డల్ని కన్నానేగాని, గడ్డల్ని కనలేదు." సుభద్రమ్మ ముఖం కొంచెం ఎర్రబడ్డది.

కోడలు మళ్ళీ నోరెత్తలేదు.

సూర్యం ఇంటివద్దలేని సమయం చూచుకొని సుభద్రమ్మ చిన్నమూటతో బయలుదేరి ఎలాగో మరునాటి పదకొండు గంటలకు లక్ష్మయ్య ఇంటికి చేరింది. ఇంట్లో కొడుకుగాని, కోడలు గాని లేరు. పనిమనిషి బండబూతులు తిడుతూ లోపలినుంచి నాలుగేళ్లవాణ్ణి, రెండేళ్లవాణ్ణి తరుముకొచ్చి వరండాలో నిలబడ్డ సుభద్రమ్మను చూచి, "బిచ్చానికి ఏలాపాలా లేదా ఏంది? పో పో!" అని కసురుకొన్నది.

సుభద్రమ్మకు తన రేగిన తల, రైలు ప్రయాణంతో మాసిన బట్ట జ్ఞప్తికి వచ్చి నవ్వుకొని, "లక్ష్మయ్య లేడూ?" అన్నది.

"ఈడ లచ్చుమయ్యలు లేరు, గిచ్చుమయ్యలు లేరు పో పో! ఈ దొంగేసాలు సాల సూసాము'', పని మనిషి పిల్లలను లోపలికి నెట్టి తలుపు వేసుకొన్నది.

ఆ క్రిందటి ఉదయాన ఎప్పుడు రెండు మెతుకులు ఎంగిలిపడ్డదో ముసలి ప్రాణం ఆ వరండాలోనే చతికిలబడ్డది. సాయంకాలం నాలుగున్నరకు స్కూలు నుంచి తిరిగి వచ్చిన లక్ష్మణరావు "విస్తుపోయి పనిమనిషిని చెడామడా తిట్టి తల్లి స్నానానికి నీళ్ళు తోడించాడు. ఆమె స్నానం చేసింది. అంతలోనే శ్యామల ఆఫీసునుంచి వచ్చి జరిగిందంతా విని నొచ్చుకుంటూ, ముందుగా ఉత్తరం ముక్క వ్రాస్తే కాకపోయిందా అత్తయ్యా!'' అన్నది.

"ఇంతకూ మా వియ్యంకుడికి ఉత్తరం వ్రాయమంటావు!"

"ఏమని?" శ్యామల విస్తుపోయింది.

"ముందుగా ఉత్తరంముక్క తప్ప అమ్మాయిని ఇంటికి రానీయవద్దని."

"అదికాదు అత్తయ్యా! మాట మాత్రం ముందు తెలిస్తే ఇలా జరగక పోనుగదా అని అంటున్నాను."

"రోజుకొక పనిమనిషిని మార్చు

కొంటున్నారని నేను మాత్రం కల గన్నానా ?''

"ఏమండోయ్, మిమ్మల్నే ! సమాధానం చెప్పండి. నా వంతు అయిపోయింది" కోడలు నవ్వింది.

"బాగుంది వ్యవహారం. అత్తా కోడళ్ళు పోటాడుకొనేవాళ్ళు పోట్లాడుకోండి. మధ్య నన్ను లాగుతారు దేనికి ?"

"ఇంతకూ మే మిద్దరం పోట్లాడుకొంటే చూస్తానంటావు ?" తల్లి కొడుకు వంక తేరి చూచింది.

"అమ్మబాబోయ్, ఇద్దరూ ఏకమయారు ! ఈ రాత్రినుంచి సత్రం భోజనం, మఠం నిద్ర తప్పదు కాబోలు !" లక్ష్మణరావు ఉత్తరీయం భుజాన వేసుకొని బయలుదేరాడు.

"అత్తయ్యా ఎప్పుడు ఎంగిలి పడ్డదో ! వెందలాడే రండి !" శ్యామల భర్తను హెచ్చరించింది.

రోజులు తరాటు గొడుతున్నాయి. ఒళ్ళు సరిగా వంచుకోలేక, చేతివాటుకు వీలుపడక పనిమనిషి మానుకొన్నది. సుభద్రమ్మ విసుగుకోలేదు అన్ని పనులూ తానే అందుకొంటూ కొడుకు ఇల్లు చక్కద్రోసుకొస్తున్నది. పిల్లలు ఏడుపులు, పెడబొబ్బలు తగ్గించి వెందలాడే లేవటం, ఎవరిపనులు వారు చక్కబెట్టుకోవటం ప్రారంభించారు. "నానమ్మా ! నానమ్మా ! మొగం కడగవూ ?" అంటూ మూడోవాడు లేచి వచ్చేవాడు. ''అరే అన్నాయ్, చిట్టాడి ముఖం ఇత్తడి తెపాలరా ! అందుకే కడిగి అవతల పెట్టమంటున్నాడు" అని రెండోవాడు వెక్కిరించేవాడు. "నీ మొగమే సత్తెపాల, రాచిప్ప !" అని కొక్కిరించి నాయనమ్మ కడుగుతానన్నా వద్దని తన పని తాను చేసుకోవటం మొదలెట్టాడు. అయినా, నాయనమ్మ చేసే వంటకాలలో అదనంగా ఉప్పు, కారాలు వేసి సరిక్రొత్తరుచులు కల్పించటానికి యత్నించకపోలేదు. కాని, సుభద్రమ్మ పడనీయటంలేదు.

మంగమ్మ అత్తయ్యకు ఉత్తరం వ్రాసింది. తనకు ఆడపిల్ల కలిగిందట అంతా కులాసాగా ఉన్నారట సూర్యం నాయనమ్మకోసం మారాము చేస్తున్నాడట రామయ్య తల్లివాటాలో అడుగు పెట్టడంలేదు సరిగదా, అందులో దీపం కూడ పెట్టనీయటం లేదట

"బావగారికి ఎందుకంత పట్టుదల !" ఉత్తరం చదివిన శ్యామల విస్తుపోయి అడిగింది.

"మనిషి కొక బుద్ధి, మనమేమి చెబుతాము ?'' సుభద్రమ్మ నిర్వేదంతో నిట్టూర్చింది.

ఒకనాటి సాయంకాలం అంతా హాల్లో కూర్చుండగా లక్ష్మణరావు ఉత్సాహంతో అన్నాడు

"అమ్మా, ఇవాళ మన ఊరినుంచి ఉత్తరం వచ్చిందే!"

"రామయ్య వ్రాశాడా?" సుభద్రమ్మ ముఖం విరిసింది

"కాదు, షావుకారు చంద్రయ్య వ్రాశాడు."

"ఏమని?'' ఆమె గొంతులో మొదటి ఉత్సుకత లేదు.

"మన వాటా ఇల్లూ, దొడ్డీ అమ్ముతారా అని అడుగుతున్నాడు పదివేలదాకా పెంచేటట్లున్నాడు."

"ఇవాళ ఇల్లు అమ్మతానంటావు, రేపు నన్నమ్ముతానంటావు!"

"అమ్మా! అమ్మా! నిజంగా నాయనమ్మను అమ్ముతారంటే" పెద్ద కొడుకు రఘు ఉత్సాహంతో అడిగాడు

''ఆc, అమ్ముతారు, కొంటావా?" శ్యామల అడిగింది,

"ఓ"

"ఏంపెట్టి?"

"నాన్నను తాకట్టు పెడతాము. నాయనమ్మను కొనుకుంటాము"

"ఆ తాకట్టు కొప్పుకునే దరిద్రుడెవడంట?"

"మా నాన్న బాగా లెక్కలు వేస్తాడే హైస్కూలు పిల్లలంతా అంటున్నారు. యే షావుకారైనా తాకట్టు పెట్టుకోడా యేమిటి? ఎందుకు నవ్వుతా?"

"నోరుముయ్, వెధవ! వసపిట్ట వాగుడూ నువ్వూను. అది కాదమ్మా! ఆ కొంప అక్కడ ఉండి ఏమి చేస్తున్నది? దీపం పెట్టేవాళ్లయినా లేరా? అమ్మితే యేం? నువ్వు చూస్తూనే వున్నావుగా అద్దె కట్టలేక ఎంత అవస్థ పడుతున్నామో. ఆ డబ్బుతో ఇక్కడ స్థలమైనా కొనుక్కోవచ్చునుగా! యేమంటావు- శ్యామలా?" అతడు భార్యను హెచ్చరించాడు

''అమ్మాయ్, మీ ఆస్తిని మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి! మధ్య కాదనటానికి నాకేమి హక్కు?" సుభద్రమ్మ చటుక్కున లేచి వెళ్లింది

ఆ రాత్రి శ్యామల భర్తతో తగవు పెట్టుకొన్నది మీ సుఖం మీరు చూచుకొంటే సరిపోయిందా? ఇదివరకే మీ అన్నయ్య ఆమెమీద కారాలు, మిరియాలు నూరుతున్నాడు. ఇప్పుడు ఇల్లు అమ్మటానికి ఒప్పుకొంటే ఏమవుతుంది? కక్కెకట్టి మీచేత ఇల్లు అమ్మించిందనుకోడా? ఇదివరకు వచ్చిన మాటపట్టింపులతోనే ఆమె కుమిలిపోతుంటే ఇది మరొకటా? ఈమెను మళ్లీ పెద్దకొడుకు ముఖం చూడవద్దంటారు మీలాగే వారూ ఆమె కడుపున పుట్టలేదా?"

''నీకు బొత్తిగా మతిపోయింది. నువ్వనేదేమిటి? నీ పిల్లల బాగోగులు నీకు పట్టకపోతే నాకా?" లక్ష్మణరావు వికటంగా నవ్వాడు.

"అందుకే మండుతుంది. అంత

దూరపు ఆలోచన కలవాళ్ళు అయితే మీ అన్నయ్యతో మాటాడి ఆమెకు చెప్పండి అయినా తెలియక అడుగు తాను ముందుగానే అన్నదమ్ము లిద్దరూ ఆమె ఆస్తిని అమ్ముకొంటే ఆమె ఎక్కడ ఉంటుంది • ఏమి తింటుంది ? ఆమెకు ముసలితనం వచ్చిందనేగా ఈ ఆట ఆడుతున్నది ?''

మరునాడే సుభద్రమ్మ ప్రయాణం కట్టింది వెళ్లవద్దని శ్యామల ఎంతగానో బ్రతిమాలింది పెద్దమనుమలిద్దరూ చెరొక రెక్క పట్టుకున్నారు. మూడో వాడు ఆమె మూటను తీసుకుపోయి ఇంట్లో ఎక్కడో దాచాడు

లక్ష్మణరావు తిరిగి గృహ విక్రయ ప్రస్తావన తేలేదు మాసాలు గడిచాయి.

"అమ్మా, మనియార్డరు వచ్చింది'' అంటూ ఒకనాడు లక్ష్మణరావు డబ్బూ, ఫారమూ పట్టుకొచ్చి తల్లి కివ్వబోయాడు

"ఎక్కడనుంచి? ఎవరు పంపారు ? ఆమె అడిగింది

"అన్నయ్య. నీ పంట పైకం కాబోలు, కాకపోతే ఎనిమిది వందలు దేనికి పంపుతాడు ? ఇకనుంచి పొలం ఎవరికైనా ఇచ్చుకొమ్మంటున్నాడు "

"అక్కరలేదు. తిప్పి పంపు" ఆమె తాపీగా అన్నది

"ఎనిమిది వందలే !"

"ఊళ్లో క్లబ్బులున్నాయే !" శ్యామల నవ్వింది.

"షటప్ !"

"ఇళ్లో ఈ చదువులే చెబు తున్నావా ?" సుభద్ర కొడుకువంక చూసింది

లక్ష్మణరావు అక్కడనుంచి వెళ్లి పోయాడు ఆ రాత్రి ఇంటికి రాలేదు; మరునాటి ప్రొద్దున్నే సుభద్రమ్మ కోడలిని అడిగింది :

"రాత్రి అబ్బాయి రాలేదుగా !"

"లేద త్తయ్యా !''

"ఎక్కడికి వెళ్లాడో !'' సుభద్రమ్మ గొంతులో విషాదం పలికింది

అంతకు పూర్వమే సమాధానం ఆలోచించుకొన్న శ్యామల చెప్పింది : ''ఏదో పని ఉన్నదట ఒక వారం స్కూలుకు సెలవుపెట్టి వెళ్ళారు."

సుభద్రమ్మ మళ్ళీ ప్రశ్నించలేదు. నిజానికి ఆ ధైర్యం కూడా లోపించింది. వెనుకటి దుస్థితి తిరిగి తారసిల్లు తున్నదా ! లోగడ చిన్నకొడుకున్నాడని బయలుదేరి వచ్చింది ఇప్పుడు మరెక్కడకు బయలుదేరుతుంది ? ఆలో చించే సాహసంలేక సుభద్రమ్మ కోడలి మాట నమ్మింది. జీవనలాలస ప్రగాఢం అతి విచిత్రం అది జీవేశ్వరులనే కాదు, స్వర్గాపవర్గాలనే కాదు, ధర్మాధర్మాలనే కాదు, హేతువునే సృష్టిస్తుంది అవసర మైతే ఆ హేతువునుగూడ నాశనం చేస్తుంది

శ్యామల చెప్పిన వారంరోజులు

గడిచాయి కాని, లక్ష్మణరావు ఇంటికి రాలేదు. క్లబ్బులోనే మకాంపెట్టి అక్కడ నుంచే స్కూలుకు వెళ్లివస్తూ ఇంటి ముఖం చూడలేదు ఈ సంగతి తెలుసు కున్న శ్యామల లోలోన ఉడికి పోతున్నది. అత్తకు ఏమని చెబుతుంది? ఆమెకు నీడలేకుండా ఎలా చేస్తుంది?

"నాయనమ్మా, నాయనమ్మా! నాన్న ఎక్కడకు వెళ్ళాడు? ఎప్పుడు వస్తాడు?" అని రఘు ఒక సాయం కాలాన అడిగాడు.

"బుద్ధిలేనివాళ్ళు ఎక్కడికైనా వెళ్తారు ఎన్నాళ్ళయినా వుంటారు. నీక్కూడా బుద్ధిలేదా?" శ్యామల కొడుకుమీద విరుచుకుపడ్డది

"చూచావా, చూచావా? నేను చేసిన తప్పేమిటి నాయనమ్మా!" రఘు మొగం చిన్నబుచ్చుకొన్నాడు.

"అన్నీ తప్పులూ నావే బాబూ!" సుభద్రమ్మ గొంతు జీరపోయింది

ఆ తెల్లవారుజామున సుభద్రమ్మ కోడలిని లేపి "వస్తానమ్మా!" అన్నది శ్యామల తెల్లబోయింది

"నాకు అంతా తెలుసమ్మా! నే నుండగా వాడు ఈ ఇంట్లో అడుగు పెట్టడు అదంతా నా ప్రారబ్ధం దానికి నీ వేమిచేస్తా?. వస్తానమ్మా, వస్తా! నేను వెళ్ళిపోవటం నీకు కష్టమే. కాని, ఏమి చేయను? కలకలలాడే సంసారం నా మూలాన పాడుకావటం నా కిష్టం లేదు ఆలుమగళ్ళను ఒకరికొకరు కాకుండ చేయలేను నేను రాకముందు హాయిగా ఉన్నారు వచ్చి లేనిపోని కలతలు తెచ్చిపెట్టాను అవన్నీ మరచిపో వెనుకటిలాగా సుఖంగా ఉండండి!"

"అక్కడ కాదనుకొని ఇక్కడకు వచ్చావు ఇక్కడ కాదనుకొని ఎక్కడకు పోయేటట్లు? వద్దు అత్తయ్యా, వద్దు! ముసలితనంలో తల్లిని తరిమివేసే అధికారం ఎవ రిచ్చారు? అయినా తన సంపాదన తెచ్చి ఎవరినీ పోషించటంలేదు. కాస్తో కూస్తో నేనూ తెస్తూనే ఉన్నా. అంత కష్టమైతే మానుకొంటారు నేను తెస్తున్నదానితోనే ఎలాగో సర్దు కొందాము. మీరు వుండాలి అత్తయ్యా! ఇంకితే ఎంత దూరమైనా తరిమికొడ తారు" శ్యామల అత్త చేతులు పుచ్చుకొన్నది

"కడుపున పుట్టిన బిడ్డలకంటే నీవే చాల నయం చాలు, నాకు ఇంతకన్నా ఏమికావాలి? కాని, ఒకటి ఆలోచించు అత్తవచ్చి కొడుకును కోడలిని కాకుండా చేసిందని లోకం ఆడిపోస్తుంది. లోకం సంగతి ఎలావున్నా అంతరాత్మ పీడిస్తుంది. ఏదైనా బాధపడతాను గానీ ఈ బాధమాత్రం పడలేను కాటికి కాళ్లు చాచుకొన్న నా సంగతి వదలు. మగని కెడమైన మగనాలు ఎంత చులక నవుతుందో ఆలోచించు పైగా పిల్లా

జెల్లా. వీళ్ళనందర్నీ ఈడేర్చాలి. ఈ బాధ్యత గొప్పదమ్మా! మనం మనుషులం కాని, పశువులం కాదు"

శ్యామల నిశ్చల దీపశిఖ అయిపోయింది.

"అమ్మాయ్!"

"ఏమిటి అత్తయ్యా!"

"ఇంతకాలంనుంచి హృదయం చిదిమి పెడుతున్నా సంతృప్తిపడక ఈ ముసలిప్రాణం మరొకటి కోరుతున్నదమ్మా!"

"ఏమిటి అత్తయ్యా!"

"నాకోసం లక్ష్మయ్యతో తగాదా పడననిమాట ఇవ్వు!"

శ్యామల అత్తవంక చూడలేక ముఖం తిప్పుకొన్నది.

"మాటాడవేమమ్మా? కోరరాని దానిని కోరేనా?"

"అంతా మీలాటివారు కాలే రత్తయ్యా!"

"కావద్దు తల్లీ! కావద్దనే నా ఆశీస్సు."

సుభద్రమ్మ వెళ్లిపోయింది. ఇంక క్లబ్బులో అజ్ఞాతవాసం చేయవలసిన అవసరం ఏమాత్రం లేదని శ్యామల ఉత్తరం వ్రాసి రఘుచేత భర్తకు పంపించింది ఆ సాయంకాలమే అతడు ఇంటికి చేరాడు

సుభద్రమ్మకి తన యింటికిపోయి తా నల్లరిపడటం, పెద్దవాని మనస్సు వికలంచేయటం ఇష్టం లేకపోయింది ఏ గూటిలో పక్షులు ఆ గూటిలో ఉంటున్నవి. వాటి సుఖం తా నెందుకు చెడగొట్టాలి? బ్రతికి ఇంక ఎవరిని ఉద్ధరిస్తుంది?

ఈ ఆలోచన రాగానే సుభద్రమ్మకు తన జీవితమ్మీద విరక్తి కలిగింది కాని బలవంతాన ప్రాణాలు తీసుకోలేక చేతి బంగారు మురుగులు అమ్మివేసి ఆ బస్తీలోనే మారుమూల పేటలో బియ్యపుకొట్టు పెట్టుకొని జీవయాత్ర సాగిస్తున్నది

ఆ సంక్రాంతికి రామయ్యవద్దనుంచి తల్లిపేర మనియార్డరు వచ్చింది. లక్ష్మణరావు నిర్ఘాంతపోయాడు తల్లి స్వగ్రామం చేరక ఎక్కడకు పోయినట్లు! అతడు పోయి భార్యకు మనియార్డరు చూపించాడు

"ఇంకేం కావలసిందేదో వచ్చిందిగా, పుచ్చుకోండి!"

"ఫోర్జరీ చేయమన్నావా?"

"ఎన్నాళ్ళనుంచి ఈ ధర్మబుద్ధి?"

"అన్నయ్యతో వ్యవహారం!"

"అయితే కూడబలుక్కొని పంచుకోండి"

"ఎందు కంత కోపం?"

"నాకు భాగంలేదని?"

అతడు మళ్ళీ మాటాడలేదు ఆ సాయంకాలం శ్యామల రఘువద్ద వాపోయింది:

"మీ నాయనమ్మ మన వూళ్లో లేదట రఘూ!"

"మన వూళ్లో లేదా ?'' రఘు ఆశ్చర్యపోయాడు

"ఇవాళ అక్కడనుంచి మనియార్డరు వచ్చింది వుంటే ఎందుకు వస్తుంది ?" ఆమె కంట తడిపెట్టింది.

రఘుకు అర్థమయింది. తల్లి కన్నీరు చూడలేక అన్నాడు ·

"నాయనమ్మ ఈ ఊళ్ళోనే ఉన్నదమ్మా !"

"ఈ ఊళ్ళోనే ? నీవు చూశావా ?''

"ఉంది. అప్పుడప్పుడు వెళ్లి వస్తూనే ఉన్నా."

''ఒకనాడు కాకపోతే ఒకనాడైనా చెప్పావుకావేమిరా ? అవునులే, విత్తొక టైతే చెట్టు మరొక టవుతుందా ?"

"చెప్పవద్దంటే ఏమి చెయ్యను ?'' రఘు ఖిన్నుడయ్యాడు.

"అయితే బయలుదేరు.'' శ్యామల కొడుకును తొందరపెట్టింది

"నాన్న వింటాడేమో !''

''ఎవరి మోచేతి నీళ్లూ త్రాగటంలేదు కాని పద !"

ఇద్దరూ రిక్షాలో బయలుదేరారు. వారు వెళ్ళేటప్పటికి కొట్టువేసి ఉన్నది రఘు ప్రక్కవారిని కనుక్కొంటే రెండురోజులనుంచి కొట్టు మూసివేసి ఉంటున్నదని చెప్పారు. అంతకు ముందెన్నడూ అతడు నాయనమ్మ యింటికి వెళ్ళలేదు ఆమె అడ్రసు కనుక్కొని తల్లీ కొడుకులు వెదకి కొంటూ శిధిలావస్థలో ఉన్న ఒక చిన్న పెంకుటింటికి చేరారు తలుపు ఓరవాకిలిగా వేసిఉన్నది. లోపలినుంచి మాటలు వినిపిస్తున్నాయి "కొత్త సరుకు. ఆ బియ్యం మీకు పనికిరావు. మాటపోతుంది మీ అమ్మతో చెప్పు. నాలుగైదురోజుల్లో పాతరపడ్డ సరుకు వస్తుంది. అప్పుడు నేనే పంపిస్తాగా !''

శ్యామల తలుపు బారలుగా త్రోసుకు వెళ్లింది. లోపల ఎవరూ లేరు. గది చీకటి కోనేరుగా ఉన్నది మూలుగును బట్టి తడవుకొంటూ పోయి ఆమె నులక మంచంలో పండుకొన్న అత్తచేయి పట్టుకుని చూచింది ఒడలు సెగలు, పొగలు చిమ్ముతున్నది.

"ఒరే రఘు, నీవు రిక్షాలో పోయి నేను రమ్మంటున్నానని చెప్పి డాక్టరు రాధమ్మను అర్జెంటుగా వెంటబెట్టుకురా. ఇప్పుడు ఇంట్లో ఉంటుంది. ఇల్లు తెలుసుగా !"

అతడు రాధమ్మ కారులో తిరిగి వచ్చాడు. డ్రైవరు సాయంతో సుభద్రమ్మను కారు వెనుకసీటులో పండుకో బెట్టి గదికి తాళంపెట్టి శ్యామల రఘు వెనుకసీటు ముందు కూర్చున్నారు. కారు బయలుదేరింది

"ఎవరు ఈ ముసలమ్మ ?" రాధ అడిగింది.

"దిక్కులేనిది" శ్యామల గొంతు డగ్గుత్తిక పడ్డది.

"ఈ అనాధసేవ ఎప్పటినుంచి ?" ఆమె నవ్వింది.

''ఏదో దూరపు చుట్టరికం. ఆమెకు కావలసినవాళ్ళు ఎక్కడో ఉన్నారు. సుస్తీగా ఉన్నదంటే చూచి నీ కోసం కబురంపించాను.''

''నర్సింగ్‌హోంకు పోదామా, మీ యింటికా?"

"నర్సింగ్‌హోంకే పోసింది!"

"అమ్మా!" రఘు ఏదో చెప్ప బోయాడు.

ఆమె మెల్లగా కొడుకును గదిమింది.

శ్యామల ఆఫీసుకు సెలవుపెట్టి అత్త వద్దనే ఉంటున్నది పిల్లలు అప్పు డప్పుడు వచ్చి చూచిపోతున్నారు. లక్ష్మణరావుకు ముఖం చెల్లక రాలేదు. నాలుగురోజుల తరువాత సుభద్రమ్మకు తెలివి వచ్చింది

"ఎవరిల్లు?"

"ఇల్లుకాదు నాయనమ్మా!! ఆసుపత్రి" దగ్గిరవున్న రఘు అంతా వివరించి చెప్పాడు.

''డాక్టర్లు దేవుళ్లు కాదూ?" అంటూ కోడలు కనిపించగానే ఆమె బలహీనంగా నవ్వింది.

''అదేమిటత్తయ్యా?"

"ఎందుకొచ్చిన దండుగగాని నీ యింటికి చేర్చు ఈ ముసలితనంలో మందులు పట్టవు."

'అలాగే నత్తయ్యా! బావగారికి ఉత్తరం వ్రాశాను. బండి తోలుకొస్తారు. రాగానే వెళ్లిపోదాము. ఈ మందు పుచ్చుకోండి!"

''అవునవును. రామయ్యే బండి తప్పక తోలుకొస్తాడు!''

సుభద్రమ్మ మందు త్రోసివేసింది.

''ఇంతగా కలవరిస్తున్నావే, నిన్ను చూట్టానికి పెదనాన్న ఎందుకు రాడు?''

"రాడు బాబూ, రాడు. నేను చచ్చిపోయినా రాడు. వాడి సంగతి నీ కిప్పు డప్పుడే అర్థంకాదు."

పెద్ద కొడుకు వచ్చి చెబితేనన్నా మందు తీసుకొంటుందేమోనని శ్యామల బావగారికి ఉత్తరం వ్రాసింది. మంగమ్మ, సూర్యం వచ్చారే కాని రామయ్య మొగమైనా చూపించలేదు. సుభద్రమ్మ పోరు పడలేక శ్యామల ఆమెను తన యింటికి తీసుకువెళ్లింది

మళ్ళీ జ్వరం ఎక్కువైంది. ఎవ రెన్నివిధాల బ్రతిమాలినా సుభద్రమ్మ మందుత్రాగటం మానివేసింది. ఒకనాడు రఘును ఒంటరిగా పిలిచి ''బాబూ, ఉత్తరం ఏమిచేశా"వని అడిగింది. "పెదనాన్నను కలుసుకొన్నప్పుడు ఇమ్మంటివిగా అలాగే ఇస్తాను నాయనమ్మా!'' అన్నాడు

కొలది రోజులకే హంస లేచి పోయింది. ఆమె శరీరంతో లక్ష్మణరావు, శ్యామల, పిల్లలు, మంగమ్మ, సూర్యం స్వగ్రామం చేరారు అప్పుడు గూడ రామయ్య వెళ్ళి తన గొడ్లచావట్లో కూర్చున్నాడేకాని తల్లిని చూడటానికైనా రాలేదు. ఎందరు ఎన్ని విధాలుగా అన్నా తల్లి అంత్యక్రియలలో పాల్గొనలేదు

కర్మ ముగిసిన తరువాత లక్ష్మణరావు అన్నవద్దకు వెళ్ళి అయినఖర్చులు చెప్పి తల్లితాలూకు పది సంవత్సరాల పంట నిలవ ఉండాలని లెక్కతేల్చాడు.

"ఆమె పంట దమ్మిడీ ముట్టుకోలేదు. ఎప్పుడు కప్పుడు మనియార్డరుచేస్తూ వచ్చాను. ఆమె తిరగగొడుతుంటే ఆమె సేవింగ్స్ అకౌంటులో జమకట్టించాను." రామయ్య లోపలకు వెళ్ళివచ్చి ప్యాస్ బుక్ తమ్మునిముందు పడేసి గొడ్ల చావిడికి బయలుదేరాడు.

"ఖర్చులుపోగా నీకు సగం వస్తుం దన్నయ్యా!" పుస్తకం తెరిచిచూస్తూ లక్ష్మయ్య అన్నాడు.

"నాకేమీ సంబంధంలేదని ఏనాడో చెప్పాను'' అతడు వెళ్ళిపోయాడు

రఘు వెదకికొంటూ వచ్చేటప్పటికి రామయ్య గొడ్లచావట్లో గాటిమీద కూర్చుని మేస్తున్న ఎడ్ల జతవైపు దిగాలుగా చూస్తున్నాడు

"పెదనాన్నా!''

"ఏమిటి?''

"నాయనమ్మ ఈ ఉత్తరం మీ కిమ్మన్నది.''

"అమ్మ చచ్చిపోయింది అంత్య క్రియలు జరిగిపోయాయి."

"ఈ ఉత్తరం మీ కిమ్మని చెప్పి చచ్చిపోయింది.''

"చచ్చినవాళ్ళకు బ్రతికున్నవాళ్ళతో పనేమిటో!''

రఘుకు ఆశ్చర్యం, కోపం కలి గాయి. "నీ కెలా తెలుస్తుంది?'' అంటూ ఉత్తరం ఇవ్వబోయాడు.

"నేనెందుకులే, నువ్వే చదువు.''

రఘు కవరు చించి ఉత్తరం తీసి మెల్లగా ప్రారంభించాడు :

"పెద్దబ్బాయ్!

తల్లినయి ఉండి చిన్నవాడిమీద పక్షపాతం చూపించాననే కదా నీకు కోపం? మానవులన్న తరువాత మమతలలో ఎచ్చు లొచ్చు లుంటాయి. మనకు రెండు చేతులొక్కటే కాని ప్రతిపనికీ నీవు ముందు కుడిచేయి చాపుతావు మరికొందరు ఎడమచేయి చాపుతారు. దీనికేమంటాము? అది అలా ఉంచు చిన్నవాడి చదువు ఖర్చులు లెక్కగట్టక ఆస్తిని సరి సమానంగా పంచాననే కదా నీ బాధ కలతలు లేక ఇద్దరూ ఒకరికొకరు తోడుగా ఉంటారని ఆశపడి మోస పోయాను పెద్దగా చదువుకొన్నంత మాత్రాన గుణాలు రావు. చిన్నవాడు నీ మనసు గుర్తించలేదు. జరిగినదేదో జరిగిపోయింది. ఈ పదేళ్ళ పంట నీదే దీనిలో దమ్మిడీ కూడా చిన్నవాడికి రాదు ఇకనైనా నన్ను క్షమిస్తావు కదూ?

సుభద్ర''

రఘు ఉత్తరం ముగించి చూచే టప్పటికి పెదతండ్రి చెక్కిళ్ళపై సెలయేళ్లు ప్రవహిస్తున్నాయి. అతడు ఉత్తరం పెదతండ్రి కిచ్చాడు.

"బాబూ, ఈ సంగతి మీ నాన్నకు చెప్పకు.'' మాట తీసుకొని అతడు ఉత్తరం ముక్కలు ముక్కలుగా చించి వేశాడు.

రఘు దిమ్మరపోయి తేరుకొని నమస్కరించాడు.

---



# చక్రపాణి

కావిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

జానకిరాం మాటలను వింటూన్న పాణి వదనం క్షణంలో వివర్ణమయి పోయింది. అది ఉదాసీనతో, విషాదమో! విచారమో అసహనమో! మరేమిటో కాని అతను కళ్ళజోడుతీసి ముఖంమీద రుమాలు కప్పుకున్నాడు. ఒకటి రెండు సార్లు కణతలు రుద్దుకున్నాడు. జుట్టు గుప్పెటతో పీక్కున్నాడు.

అతన్ని పట్టించుకోని జానకిరాం అంటున్నాడు. "నాకేం కట్నకానుకలు అవసరంలేదు నేనే పెళ్ళిఖర్చులు పెట్టు కుంటాను, ఆమెను పువ్వుల్లో పెట్టి ఆరా ధిస్తాను. ఏమంటావు? ఆమెను అంగీక రింపజేస్తావు కదూ!" ఉద్వేగస్వరంతో ప్రశ్నిస్తున్నాడు జానకిరాం.

"ఆమెకు చెబుతాను. అంగీకరిస్తే,

కట్న కానుకలవీ, నీకు కావాల్సిన వన్నీ నేను ఇస్తాను" బలవంతాన పెదాల మీదికి నవ్వు తెచ్చుకుంటూ, ఏదో విషాదాన్ని బలవంతాన్న తొక్కి పెడుతూన్నట్టున్నాడు పాణి.

" అంగీకరిస్తుందనే నా నమ్మకం " అన్నాడు జానకిరాం.

"ఆమెతో ఏమన్నా మాట్లాడావా ఈ విషయం ?"

"పెళ్ళయిందా ? అని అడిగాను. లేదండి. చేసుకుంటారా? అని అడిగాను నాకు నచ్చిన వ్యక్తి అయితే, అని నవ్వేసింది."

"ఓ, అయితే 'నన్ను చేసుకోడానికి మీకు అభ్యంతరమా ?' అని కూడా ప్రశ్నించిఉంటే నా మధ్యవర్తిత్వం తప్పించినవాడివి అవుదువుగదా !" అదోలా నవ్వాడు పాణి.

"అడగలేకపోయాన్రా బ్రదర్ ! ఈ విషయంలో నువ్వు నాకు తప్పక హెల్పు చెయ్యాలి. ఆ అమ్మాయి నీ మాటకాదన దనేనమ్మకం నాకుంది. నీకు జీవితాంతం కృతజ్ఞుణ్ణై ఉంటాను."

"పద్మావతీ, నువ్వూ భార్యా భర్తలవుతారంటే సంతోషించేవారిలో మొదటివాణ్ణి నేను. ప్రామిస్‌చేస్తున్నానుగా! ఆమెకు చెబుతాను. కాదంటే నచ్చజెబుతాను మీ ఇద్దరికీ మేరేజ్ అయ్యేలా చూస్తాను. సరా!"

పాణి చెయ్యిపట్టి సంతోషంగా ఊపేశాడు జానకిరాం, "థాంక్స్" అంటూ.

ఆ రాత్రి భోజనం చెయ్యలేదు పాణి. వాడిన అతని వదనంచూసి కంగారుగా అతని చెంపలూ, మెడా తడిమిచూసి, "ఏం బాబూ అలా వున్నావు? వంట్లో బాగుండలేదా? అన్నం వద్దన్నావు?" అని ఆత్రతగా ఆప్యాయంగా అడిగింది అన్నపూర్ణమ్మ.

"బాగానే ఉందిలే · అత్తయ్యా! కొంచెం తలనొప్పి. అంతే, లైటు తీసేసి తలుపులు వేసి వెళ్ళిపో" అన్నాడతను నవ్వబోతూ.

"కొంచెం పాలు తాగు."

"వద్దు. నాకేమీవద్దు. ప్లీజ్ వెళ్ళిపో."

అట్టే బ్రతిమిలాడితే అలాగే విసుక్కుంటాడు పాణి ఆ రాత్రి అతను నిద్రపోలేదు చూడలేని కనులెందుకో వర్షించాయి.

ఉదయంలేచి పక్కమీద కూర్చుంటూ అనుకున్నాడు పాణి, 'నాలో గుప్తంగా ఎంత స్వార్థం దాగి ఉంది?' అని. కాని మళ్ళీ పట్టి వెనక్కు లాగుతూన్న మనస్సు పద్మావతివైపు పరుగులు తీసింది. పద్మావతి జానకిరాంని పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే! అతను ఆ ఊహ సహించలేకపోతున్నాడు. జానకిరాం పద్మావతి అందాన్ని ఎలా వర్ణించాడు! అటువంటి అందమయిన యువతిని ఇంత వరకూ తానెక్కడా చూడలేదట. ప్రతిభా

వంతుడయిన శిల్పి చెక్కిన పాలరాతి బొమ్మలా ఉందట పద్మావతి నిరాడంబరమైన ఆమె అలంకరణ అతనికెంతో నచ్చిందట పొడవాటి జడ నల్లని త్రాచులా ఉందట. తెల్లని వదనంలో కోలకనులు కొలనులోని చేపల్లా అందంగా మెరుస్తాయట ఆమె తన భార్య అయితే అతని పాటి అదృష్టవంతు డీ లోకంలో ఉండడట ఎంత మైకంతో ఎంత మత్తుగా ఎంత ఆరాధనతో ధ్వనించిందా గొంతుః వ్చ్, పద్మావతిని చూడగలిగే కన్నులున్న జానకిరాం తనకన్నా ఎన్నో రెట్లు అదృష్టవంతుడు ఈ ధనం పోగుపడి మనిషిని బంధించే ధనం. మనిషికి నిజమైన ఆనందాన్నివ్వలేదు సరికదా మనస్సు నిలకడగా ఉండనివ్వదు. అన్నం తిననివ్వదు సరిగా నిద్రపోనివ్వదు. జానకిరాంకి ఇలాటి బాదరబందీలేం లేవు. నెలకి ఐదువందలు సంపాయిస్తాడు. హాయిగా సంతోషంగా బ్రతికేస్తాడు. పేదరికం అనుభవిస్తూ కూడా చందాలు దండి ఫీజులు కట్టి బి కాం ప్యాసయ్యాడు. వెంటనే మంచి ఉద్యోగం వచ్చింది. 'ఇప్పుడు అందమైన భార్య' ఆ తలంపు వచ్చేసరికి అతని హృదయాన్నెవరో గట్టిగా పిండినట్టయింది. "లేదు నేనిలాసంకుచిత హృదయంతో, పద్మావతి భవిష్యత్తుకి,

ఆమె అనుభవించబోయే జీవిత సౌఖ్యాలకీ, అడ్డగోడలు వెయ్యగూడదు. ఆమె జీవితసౌఖ్యా లనుభవించాలి. ఆమె జీవితం ఇలా నా దగ్గర మోడువారి పోకూడదు. భగవాన్ నాకు ఆ నిగ్రహం, ధృడమనస్సూ, విశాలహృదయం ఇచ్చి రక్షించు. పద్మావతిని ఇప్పుడే ఫోన్‌చేసి పిలుస్తాను చెబుతాను ఆమెనుఅంగీకరింప జేస్తాను. శశిలానే ఆమెకూడా ఈ ఇంటి నుంచి సారె చీరలూ తీసుకువెళ్ళి పోతుంది. "పద్మావతి జానకిరాంని అంగీకరిస్తుందా? ఎందుకు అంగీకరించదు? జానకిరాం అందంగానే ఉంటాడు. పైగా చదువుకుని మంచి ఉద్యోగంలో ఉన్నాడు. బాదరబందీలూ బాధ్యతలూ లేని వంటరిగాడు. ఆమె మనస్సు కూడా అతనివైపు ఆకర్షితమై ఉండి ఉండాలి. జానకిరాం వచ్చినది మొదలు తనపై విసుగు కనబరుస్తూంది. ఏమన్నా చెప్పినా అయిష్టంగానే సమ్మతిస్తూంది. గంటలకొద్దీ తన దగ్గర కూర్చుని కబుర్లు చెప్పే పద్మావతి అసలు తనదగ్గర కూర్చుని మాట్లాడటమే మానేసింది సరి ఇవ్వాళ తనకో పరీక్షాసమయం.ఓటమో! గెలుపో తన అదృష్టాన్ని పరీక్షకు పెట్ట బోతున్నాడివాళ. గెలుపు వద్దు తనెప్పుడూ ఓటమికి తలవంచి బ్రతికేవాడే. కాని జానకిరాం ఇప్పటివరకూ ఓటమి అంటే ఏమిటో ఎరగడు. అతని అభీష్టం నెరవేరాలి. ఇన్ని సంవత్సరాలుగా తనకు తోడుగా ఉంటూ, తన జీవితంలో చలనం. తనలో ఉత్సాహం కొత్తజీవం తెచ్చి మురిపిస్తూన్న పద్మావతి తనను వదిలి, తనసీ గదిలో వంటరిగా బ్రతకమని, షికార్లూ, సినిమాలూ, మరచి పొమ్మనిచెప్పి, జానకిరాంతో సుఖమైన దాంపత్య జీవితం గడపటానికి వెళ్ళిపోతుంది: జానకిరాం పిల్లలకు తల్లా పద్మావతి. అతను ఆ ఎడతెగని ఊహలకు తట్టుకోలేనివాడిలా బలంగా బాధగా కణతలు రుద్దుకుని జుట్టు పీక్కున్నాడు.

"బాబూ! లేచావా? మొహం కడిగి కాస్త కాఫీ తాగు." అన్నపూర్ణమ్మ గొంతు అతన్ని వాస్తవంలోకి తెచ్చింది.

మొహం కడిగి కాఫీ తాగి గెడ్డం చేయించుకొని స్నానంచేసి తెల్లని బట్టలు వేసుకుని ఫ్రెష్‌గా తయారయి టేబిలుముందు కూర్చున్నాడు పాణి.

జానకిరాం కూడా వచ్చాడు టిఫినుకి.

మిత్రులిద్దరూ మౌనంగా టిఫిను తినడం ముగించారు గడిచిన రాత్రి ఇద్దరూ నిద్రపోలేదు ఇద్దరి హృదయాల్లోనూ సంఘర్షణే రాత్రంతా పద్మావతితో జీవితం ముడేసుకుని తియ్యని ఊహలలో జాగరణచేశాడు జానకిరాం.

కాఫీ సిప్‌చేస్తూ, "నేను సాయంత్రానికిగాని రాత్రికిగాని వచ్చేస్తాను. ఈ లోపల..." అని నసిగాడు జానకిరాం.

"ఎక్కడి కెళుతున్నావ్? నీ ఎదురు

గానే సెటిలయిపోవడం బాగుంటుంది ఉండరాదూ!" అన్నాడు పాణి.

"ఛ. ఛ బాగుండదు. ఆ అమ్మాయి బిడియపడవచ్చు. నీ దగ్గర బాగా చను వుందామెకు ఓ అన్నయ్యనులా ఆమె నిన్నభిమానిస్తూంది. అడిగి ఆమె అభి ప్రాయం కనుక్కుందూ! మా ఆఫీసరు కొడుకున్నాడీ పక్క ఊళ్లో. అతన్ని చూసి రాత్రికి వచ్చేస్తాను." అని చెబు తూనే అవతలికి వెళ్ళిపోయాడు జానకిరాం.

నెమ్మదిగా తన గదిలోకి వెళ్ళి టేబిలు ముందు కుర్చీలో కూర్చున్నాడు పాణి. మళ్ళీ ఆలోచనలు ముసురుకున్నాయ్. మనస్సంతా చికాగ్గా తయారయింది. జానకిరాం రాకుండా ఉంటే బాగుండి పోయేది, అని కూడా అనిపించింది.

గణగణా ఫోను మ్రోగడంతో రిసీ వరు చేతిలోకి తీసుకున్నాడు పాణి

"నమస్తే. నేను పద్మావతిని. చక్ర పాణిగారు కదూ!" పద్మావతి గొంతు మృదుమధురంగా వినిపించగానే పాణి హృదయం ఉరకలువేసింది.

అవును. చక్రపాణినే అనబోయి, క్షణంలో గొంతు మార్చి, "నేను జానకిరాంని పద్మావతీ!" అన్నాడుపాణి.

"ఓ, మీరా! దయచేసి పాణిగారిని పిలవండి. ఆయనతో నేను మాట్లాడవలసి ఉంది." ఆమె గొంతు కరకుగా చిరాగ్గా మారిపోయింది

"నాతోకూడా ఏమన్నా మాట్లాడండి," అన్నాడు మళ్ళీ!

కాని గ్రహించేసింది పద్మావతి పాణిగొంతే అదని పసిగట్టేసింది. సన్నగా నవ్వుతూ "మీ డియరెస్టు ఫ్రెండు జానకిరాముడు వెళ్ళిపోయాడా? లేదా!" అడిగింది

ఆ నవ్వూ, ఆ గొంతూ వినకుండా తా నస్సలు జీవించగలడా?! "వెళ్ళిపోయాడు పద్మావతీ! వస్తున్నారా?" అన్నాడు.

"థ్యాంక్స్. గుడ్ న్యూస్ చెప్పారు. మార్నింగ్ షో మాంచి హిందీ పిక్చె రొచ్చింది మన హాలుకి. వెళ్దాం రెడీగా ఉండండి. పదినిమిషాల్లో నేను వస్తున్నాను"

ఏదో చెప్పబోయాడు పాణి. కాని ఆమె అప్పటికే ఫోను వదిలేసింది. ఇవ్వాళ పద్మావతితో కలిసి ఆఖరుసారి సినిమా చూడటం. సినిమాచూసి సాయంకాలంవరకూ హాయిగా కబుర్లు చెప్పుకున్న తర్వాతనే జానకిరాం అడిగిన సంగతి చెప్పాలి. ఆమె ఒకవేళ అంగీకరిస్తే! మళ్ళీ తన జీవితంలో మామూలు చీకటి పరుచుకుంటుంది. ఇవ్వాళ పద్మావతితో కబుర్లు చెబుతూ గడిపే ఆఖరి రోజు. ఆమె కొనిపించిన కారూ, తోటా ఆమెకే ఇచ్చేస్తాను ఆ కార్లో కూర్చోబెట్టి తనను షికార్లు తిప్పే వారెవరుంటారిహ, ఆ తోటలో తాను వంటరిగా అడుగు పెట్టలేడు పద్మావతితో కలిసే ఆ తోటలో అడుగుపెట్టాడు. అక్కడ వీచే చల్లనిగాలి ఆమెతో పంచుకున్నాడు. అక్కడ జామికాయలూ ఉసిరికాయలూ, తనకు ఇష్టంకాని రేగుకాయలూ పద్మావతి కోసితెచ్చేది కనుకే తినేవాడు. ఓ రోజు ఆ రోజు తన జీవితంలో అపురూపమైనరోజు చిలిపిగా, కొంటెగా తామిద్దరూ పోట్లాడుకొని జామీకాయ చెరిసగం కొరుక్కుతిన్నరోజు. అవి బంగారు క్షణాలు. జీవితాంతం ఆ రోజులోని బంగారు క్షణాలు వెమరువేసుకుంటూ తాను బ్రతుకుతూండే జానకిరాం వడిలో తలపెట్టుకొని హాయిగా నిద్రపోయే పద్మావతి, ఛి ఛి. జానకిరాం వడిలో తలపెట్టి హాయిగా నిద్రపోయే పద్మావతా! ఆ ఊహ అతనికి వెగటుగా అసహ్యంగా అనిపించింది.

"ఇంకా ఇలా మీనమేషాలు లెక్కబెడుతూన్నట్టు కూర్చున్నారా?'' సుడిగాలిలా గదిలోకి వచ్చిన పద్మావతి ప్రశ్నకి ఉలికిపాటుగా కదిలి నవ్వుతూ, "మీరు రానిదే ఎలా నడవను పద్మావతీ! కూర్చోక" అన్నాడు పాణి.

"అలా వచ్చేస్తారా? డ్రస్ మార్చుకోరా!" అడిగింది. తెల్లని లుంగీ, తెల్లని

లార్చీ, తెల్లని ముఖంలో నల్లని కళ్లద్దాలూ, నల్లని ఉంగరాల క్రాపు చెరగి పోలాన్ని తాకుతూంటే తనవైపు ముఖం తిప్పి ఉన్న పాణివైపు, ఇంత అందాన్నిచ్చి దేవుడు పాపం ఈయనకు కళ్లు పోగొట్టి కసితీర్చుకున్నాడు కాబోలు. అని జాలిగాచూస్తూ.

"పదండి. టైమయింది కాబోలు. ఏం ఈ బట్టలు బాగుండలేదా?" అన్నాడు పాణి లేచినిల్చుంటూ.

"అహ. అదికాదు. రండి. మార్చా అంటారేమో అని. ఏం ఇవ్వాళ వీక్‌గా కనిపిస్తున్నారు? ఆరోగ్యం బాగుందలేదా?" అడిగింది అతని చేతివేళ్ళని అందుకుని అతని మొహంలోకి పరిశీలనగా చూసిన పద్మావతి.

"నిన్న రాత్రి నిద్ర సరిగాపట్టలేదు. దోమలు." తడబడ్డాడు.

"ఫేను పెట్టుకుంటే పోయేదిగా? పోనీ రేపు చూద్దాం సినిమా. ఇవ్వాళ మానేద్దామా?"

"అహ. ఇవ్వాళ సినిమాకు తప్పక వెళ్ళాలి. పదండి," అన్నాడు పాణి.

వాళ్ళు సినిమాకు వెళ్లేసరికి ఆట

విగినయిపోయింది. హిందీ సినిమా కావ టాన జనం పల్చగా ఉన్నారు. పాణి కన్నా హిందీ పద్మావతికే బాగా వచ్చు. సినిమాలోని సంభాషణ నెమ్మదిగా పాణికి వివరిస్తూంటుంది పద్మావతి. ఇప్పుడు వాళ్ల చూస్తున్నది 'ఆరాధన' సినిమా. పాణి అడుగడుగునా కళ్ళ జోడుతీసి కనులు తుడుచుకుంటున్నాడు. షర్మిలాతాగూరు గొప్పగా నటిస్తూంది" అంది పద్మావతి. ''ఎప్పుడన్నా నాకు కళ్ళుకనుపిస్తే, లేక మళ్ళీ జన్మలోనన్నా ఈ సినిమా చూడాలి," అన్నాడు పాణి.

అతనివైపు జాలిగా చూసింది పద్మావతి. అప్పుడప్పుడు ఇంగ్లీషు సినిమాలకు కూడా వస్తూంటారు. అప్పుడు సంభాషణలు పాణి వివరించి చెబుతూంటాడు.

తాత్కాలికంగా వాస్తవాన్ని మరచిపోయాడు పాణి. అతని మానసికవేదన కొన్ని క్షణాలు ఉపశాంతి పొందింది.

అతన్ని ఇంట్లో వదిలిన పద్మావతి "వెళ్తున్నాను పాణిగారూ! మళ్ళీ సాయంత్రంవస్తాను. కారు తీసుకువెళ్తున్నాను" అని చెప్పింది.

"ఇప్పుడు వెళ్ళిపోవటమెందుకు? మా ఇంట్లో భోజనం చెయ్యొచ్చు ఉండిపోండి," అన్నాడు పాణి.

"అహ. లేదు వెళ్ళిపోవాలి."

"అహ. వీల్లేదు ఉండిపోవాలి."

"నవ్వుతూ ఇవ్వాళ నేనిక్కడ ఉండిపోతే "సుశీలమ్మగారు కోప్పడతారు," అంది పద్మావతి.

"నేను అంతకన్నా ఎక్కువగా కోప్పడతాను వెళ్లిపోతే."

కిలకిలా నవ్వి, "నాకు భయంలేదు లెండి."

''అయితే ఆమెదగ్గర భయమా?"

''లేదు. ప్లీజ్. ఇవ్వాళ్టికి వదిలెయ్యండి, వెళ్ళిపోతాను."

''నేను మీ చేతిని పట్టుకు ఆపానా పద్మావతీ; పోనీ కారణం చెప్పండి."

"నాకు ఇష్టంలేదు.''

''ఏమిటి?" నవ్వాడతను.

"ఆ కారణ మేమిటో చెప్పడం."

"కారణమేమిటో తెలుసుకోకుండా వెళ్లమనటం నాకు ఇష్టంలేదు.''

''రేపు చెబుతాగా కారణమేమిటో."

''ఇవ్వాళరోజు నాకు చాలా విలువైనది ఒక్క క్షణంకూడా వదులుకోను."

''ఆ విలువేమిటో చెబుతారా? తెలుసుకోవద్దా నేను?''

"తర్వాత సాయంత్రం చెబుతాను."

''నేనుకూడా తర్వాత చెబుతానన్నానుగా! ప్లీజ్ పాణిగారూ! సాయంత్రం మీకు ఇష్టమైన కట్టికాయలు తీసుకువస్తాను. తోటకు వెళ్దాం. మీకు ఇష్టమైన కట్టికాయలూ ఇష్టంకాని రేగుకాయలూ మీచేత తినిపిస్తాను, ఏం?"

హాయిగా, పరవశంగా నవ్వాడు పాణి. నేను తినబోయేది ఇష్టమైన కట్టి

కాయో, ఇష్టంలేని రేగుకాయో తెలియదు కాని, ఎప్పుడూ ఏ విషయంలోనూ మిమ్మల్ని బలవంతపెట్టలేదు. పైగా మీ ఇష్టాన్నే అంగీకరిస్తూ వచ్చాను. ఇవ్వాళ మాత్రం ఇంట్లో నా దగ్గరే కూర్చుని కబుర్లు చెబుతూ గడపాలి. నా మనస్సంతా ఎందుకో వికలంగా, నిరుత్సాహంగా బెంగగా ఉంది." గబగబా ఆమె వెళ్ళిపోతుందేమో! అనే ఆత్రతలో అన్నాడు పాణి.

"ప్చ్. ఇవ్వాళ చెప్పకూడదనుకుంటూనే ఏవో మాటల్లో మా నాన్నగారు జ్ఞాపకం వచ్చి, ఇవ్వాళ నా పుట్టినరోజని సుశీలమ్మగారికి చెప్పేశాను. ఆవిడ ఒకటే హడావుడి చేసేశారు. తలంటి నీళ్ళుపోసి కొత్తచీర తెప్పించి కట్టుకునేదాకా వప్పలేదు. మధ్యాహ్నం భోజనానికి ఇక్కడ ఉండిపోవద్దని మరీ మరీ చెప్పారు. తీరా నేను ఆమె మాట కాదని ఉండిపోతే ఏమనుకుంటారు చెప్పండి!"

"కంగ్రాచ్యులేషన్స్, పద్మావతీ! ఏమీ అనుకోరు. నేనెవరో ఆమెకు తెలుసు. ఫోను చేస్తానుండండి, మీరిక్కడ ఉండిపోతున్నారని." అంటూనే టేబిలువైపు నడిచాడు పాణి

అతను ఫోను ఎత్తిపట్టుకొని సుశీలమ్మగారిని పిలిచి "మీరు నన్నూ, పద్మావతినీ క్షమించాలి. పద్మావతిని ఈ రోజంతా ఇక్కడే గడపమని కోరాను. సాయంత్రం తోటనుంచి వచ్చే

టప్పుడు ఆమెను మీ ఇంటి దగ్గర వదిలేస్తాను" అని చెప్పాడు.

అటునుంచి ఆమె నవ్వుతూ "నువ్వు అలా అంటే కాదనేహక్కు నాకేముంది? కాని తోటకు వెళ్ళేటప్పుడు మా ఇంటికి రండి. పద్మావతి పుట్టినరోజుకదూ! నన్ను కజ్జికాయలు చెయ్యమంది. చేస్తున్నాను. టిఫిను తోటకి మా ఇంటినుంచి తీసుకుపోవచ్చు" అని చెప్పింది.

"నమస్కారం. తప్పక అలానే వస్తాం. మీ ఆశీర్వచనం తీసుకుంటాం." అని చెప్పి ఫోను పెట్టేశాడు పాణి.

"తప్పక అలానే వస్తాం అంటున్నారు. ఇద్దర్నీ కలసి అక్కడికే భోజనానికి రమ్మన్నారా?" నవ్వుతూ అడిగింది పద్మావతి.

"ఇప్పుడు కాదు. సాయంత్రం తోటకు వెళ్ళేటప్పుడు అలా వచ్చి వెళ్తామని చెప్పాను. కజ్జికాయలు చెయ్యమన్నారట. నా కోసమేనా?"

సిగ్గుపడింది పద్మావతి. "కాదులెండి. కజ్జికాయలు నాకూ ఇష్టమే." అనేసింది.

తర్వాత అన్నపూర్ణమ్మను పిలిచి "పద్మావతి పుట్టినరోజట ఇవ్వాళ" అని చెప్పి "అత్తయ్యా పాయసం చెయ్యడానికి ఎంత టైముపడుతుంది?" అడిగాడు పాణి.

"వద్దు. ఇప్పుడేమీ చేయించవద్దు. నాకు ఆకలిగా ఉంది. టైమెంతయిందో తెలుసా! ఒంటిగంట కావస్తూంది" అంది పద్మావతి.

"అయితే సరే. భోజనం చేద్దాం పదండి. మధ్యాహ్నం పాయసం చేయించత్తయ్యా!" అంటూ నెమ్మదిగా అడుగులువేస్తూ బాత్‌రూంవైపు నడిచాడు పాణి.

అతను విప్పిన షర్టు అందుకుని స్టాండుకి పెట్టాడు అప్పారావు. తెల్లని టంగీకటి బనియనూ, మరొకరకమైన ఆకర్షణలో కనుపించాడు పాణి పద్మావతి కళ్ళకు.

అతని చెయ్యిపట్టి అన్నం కూరలూ అవీ తాకించి "పాణీ పద్మావతికి మాంచి ఖరీదైన చీర కొనాలి," అంది అన్నపూర్ణమ్మ.

పాణి జవాబిచ్చేంతలో "నేను కట్టుకునే చీరలూ, తిండీ, అన్నీ మీ దబ్బే కదా! పిన్నిగారూ ఏమీ వద్దు. ఇప్పుడలాటివేమీ పుచ్చుకోను" అంది పద్మావతి అయిష్టతను వ్యక్తంచేస్తూ.

"ఏం సుశీలమ్మ చీర కొనిఇస్తే కట్టుకోవచ్చును కాని, నేను కొని ఇస్తే తీసుకోగూడదూ! పున్నిత్రీ పిల్లవని నువ్వు వచ్చిన ఇన్ని సంవత్సరాల్లోనూ ఓ చీర కొని ఇచ్చానా? పద్మావతీ ఇవ్వాళ నాకు నచ్చిన చీర, కొని ఇస్తాను. పాణి దబ్బే అనుకో. కాని వాడి దబ్బుమీద నాకూ స్వాతంత్ర్య ముంది. నువ్వువద్దన

డానికి వీల్లేదు. నేనిచ్చిన చీరకట్టుకొని సాయంత్రం తోటకు వెళ్ళాలి." ఆజ్ఞాపిస్తున్నట్టంది అన్నపూర్ణమ్మ.

"నన్ను ఇబ్బందిపెడుతున్నారు. ఇరుకున పెడుతున్నారు పిన్నిగారూ !"

పాణి తటస్థంగా ఊరుకున్నాడు వారి సంభాషణ వింటూ.

''మాట్లాడవేంరా అబ్బాయ్. నే నిచ్చిన చీర కూడా తీసుకోవాలి. అని చెప్ప వేం ?" అంది అన్నపూర్ణమ్మ పాణి భుజంపై చరుస్తూ.

''ఆమెకు తెలియదా అత్తయ్యా" అని నవ్వి, "పద్మావతీ అత్తయ్య పెద్దది ఆమె కోరిక మన్నించడం ధర్మం" అన్నాడు పాణి.

"ధర్మమే. కాని ఖరీదైన చీర కొని నన్ను కట్టుకోమంటే ఎలా చెప్పండి ?''

"ఇవ్వాళ నేను చెప్పిన ప్రతి మాటా వినాలి మీరు. సాయంత్రం తోటలో ఓ మంచి మాట చెబుతాను మీకు.''

"ఇహ నేను జీవితంలో వినబోయే మంచి మాటలేవీ ఉండవు పాణిగారూ ! అన్నీ వినేశాను. మీ నీడన ఇంత తిండీ, బట్టా, రక్షణా, లభిస్తున్నాయ్. ఇలా జీవితం ప్రాణ మానభంగాలు లేకుండా గడిచిపోతే చాలు'' అంది పద్మావతి.

అన్నపూర్ణమ్మా, పాణీ, ఇద్దరూ ఏమీ మాట్లాడలేదు. పద్మావతికి కొసరి కొసరి ఆప్యాయంగా వడ్డనచేసింది అన్నపూర్ణమ్మ.

భోజనం ముగించి చేతులు కడిగి తుడుచుకుంటూ "పద్మావతీ పడమటి గదిలో కాస్సేపు విశ్రాంతి తీసుకోండి.'' అన్నాడు పాణి.

''అలానే ఆ గదిలో హాయిగా నిద్ర పట్టేస్తుంది. ఎన్ని గంటలకు మెలకువ వస్తుందో. మీరు మీ గదికి వెళ్ళి పోగలరా ?'' అడిగింది పద్మావతి.

''ఆఁ ఈ ఇల్లు దాటవలసివస్తేనే మీ చేయూత అవసరం ''

"ఇవ్వాళ ఒక్కరోజు అత్తయ్య మాట మన్నించండి. "అత్తయ్యా ! అప్పారావుని షాపుకి పంపి, ఎలాటి చీర కొనాలనుకున్నావో తెప్పించు.'' అని చెప్పి తన గది కెళ్ళిపోయాడు పాణి.

అప్పారావు తెచ్చిన చీరల్లో ఎంపిక చేసి ఛాక్‌లెట్ కలర్ జరీ పూల కాంజీవరం పట్టుచీర తీసింది అన్నపూర్ణమ్మ.

''అమ్మాయ్! చూడు ఈ చీర బాగుంది కదూ.'' వత్తిగిలిమత్తుగా కళ్ళు మూసుకు పడుకున్న పద్మావతి జబ్బపై తట్టి అడిగింది, అన్నపూర్ణమ్మ.

(సశేషం)

Printed and Published by A. Chandrasekhar Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500001. Controlling Editor : "CHAKRAPANI"